# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 11 ]　　డిసెంబరు, 1966　　[ సంచిక : 2

ఆగ్రహాయణ-పౌష్య 1888 శా. శ

ప్రధాన సంపాదకులు :
బి. రామచంద్రరావు

సంపాదకులు :
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## ఈ సంచికలో



మొదటి చిత్రం : మన జాతీయ విహంగము
ఫోటో : ప్రధాన సంపాదకులు

రెండవ చిత్రం : శ్రీరామస్వామి దేవాలయం, రాయదుర్గం (అనంతపురం జిల్లా)
ఫోటో : జగదీశ్వర్

మూడవ చిత్రం : గీతపారిశ్రామికులు

నాలుగవ చిత్రం : పాతాళగంగ, శ్రీశైలం
ఫోటోలు : ప్రధాన సంపాదకులు

* ఈ సంచికలోని రచయితల అభిప్రాయాలు ప్రభుత్వానికి సంబంధించినవి కావు.

* 1967 జనవరిలో వచ్చే నూతన సంవత్సరం కేలండరీ కొరకు వేచిఉండగలరు.

# స్వాతంత్ర్య గమ్యం



ఇటీవల ప్రసిద్ధ రాజకీయవేత్త ఒకరు గత యాభై యేళ్ళుగా ప్రపంచంలో జరుగుతూన్న సంఘటనలనూ, వస్తూన్న పరిణామాలను సమీక్షిస్తూ "స్వాతంత్ర్యమా!—ఏది గమ్యం" అంటూ వాపోయారు. అటు యూరప్‌లోని జారు చక్రవర్తుల పాలనలో రష్యాలో వచ్చిన తిరుగుబాటు, యిటు తూర్పున చైనాలో అదే మాదిరి విప్లవం, అపైన ఆఫ్రికాలోనూ, మధ్య ఆసియా, లాటిన్ అమెరికా దేశాల్లోనూ తరచుగా వస్తూన్న రాజకీయ కల్లోలాలనుగూర్చి ఆయన ప్రస్తావించి పై విధంగా ఆందోళనను వ్యక్తంచేశారు. ఈ ప్రజలు తమ పాలకుల చేతుల్లోనుండి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పొందడానికి విపరీతమైన కష్టనష్టాలకు లోనయ్యారని, కొన్ని కొన్ని చోట్ల నిర్దాక్షిణ్యంగా తుడిచివేయబడ్డారని, ఇంత జరిగినా చాలా దేశాల్లో నిజమైన ప్రజాప్రభుత్వంలేక అక్కడి ప్రజలు స్వాతంత్ర్య వాయువులను పీల్చడానికి యింకా నోచుకోలేదని ఆయన చాలా బాధ పడ్డారు. ఒక వేళ ప్రజాస్వామ్యం నెలకొల్పబడినప్పటికీ వాటి పునాదులు బలహీనములైనవి కావడంచేత ఏక్షణంలోనైనా కూలిపోక తప్పదు అన్నారు. ఈనాడు ప్రపంచం యింకా క్లిష్ట పరిస్థితుల్లోనే వుంది. ఇంకా అనేకమంది నిరంకుశ పాలకులున్నారు. వారి పతనం జరగాలి. ఎంతో ముందుకు పోయామనుకుంటున్న పెద్ద పెద్ద ప్రజాస్వామిక రాజ్యాల్లోకూడా యీనాడు అక్షరాలా ప్రజాస్వామ్యం కనుపించదు. అక్కడ తలకు మోపిడి రాజకీయాలున్నాయి, మైనారిటీలను అణగద్రొక్కడం వుంది—అన్నారు. రెండుసార్లు ప్రపంచమారణ హోమం సంభవించినా స్వాతంత్ర్యం యొక్క ప్రాముఖ్యతను, శాంతియుత సహజీవనం యొక్క ఆవశ్యకతను మానవజాతి ఏమాత్రం గుర్తించినట్టు లేదని విపరీతంగా మథనపడ్డారు. ఈ నాడు ప్రపంచం ప్రమాదాల అంచుల మీదనడుస్తున్నది, ఏవో కొన్నిశక్తివంతమైన దేశాల చేతుల్లో చేరిన మారణ అణ్వాయుధాల వల్ల ఏక్షణంలోనైనా నాశనం కావచ్చు నన్న అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు.

ఆ రాజకీయవేత్త చెప్పినదానిలో కొంత వాస్తవం లేక పోలేదు. అయితే ప్రపంచస్వరూపం ఆయన మనముందుంచినంత ప్రమాదభరితంగా ఏమీ లేదు. ప్రపంచం పెద్ద పెద్ద అంగలువేసుకుంటూ అభివృద్ధి దిశగా సాగుతున్నది. ముఖ్యంగా ఈ శతాబ్ది ఆరంభంనుంచి మరీని. అయితే ఆ రాజకీయ వేత్త ప్రస్తావించిన సంఘటనలకూ,కల్లోలాలకు కారణం ఈ చీకటిలోంచి వెలుగులోకి రావాలనే మనిషితాపత్రయమే. మనిషిలోని చెడు కన్న మంచితనమే బలీయమైనది. కట్టకడపటికి యీ విషయం వ్యక్తంం కాకమానదు. అప్పుడు మనిషి బంధనాలను అది విచ్ఛిన్నం చేసి ఉజ్జ్వల భవిష్యత్తులోకి అతన్ని తీసుకెళ్తుంది.

కొన్ని కొన్ని పరిమితులూ, పరిధులూ వున్నప్పటికీ ప్రజాస్వామ్యంలోని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అమెరికా ఇంగ్లాండు, స్విట్జర్లాండువంటి దేశాలకు—అవికొన్నే కావచ్చు—యితోధిక భవితవ్యాన్నీ, ఐశ్వర్యాన్నీ ప్రసాదించాయి. ఈ దేశాలలో ప్రజాస్వామ్యం అనేది ప్రభుత్వ విధానమేగాక ప్రజలనిత్య జీవితంలోని అంతర్భాగం కూడా. అంటే అది వారి జీవనసరళి కూడా. ఇతర దేశాలకు యిది మార్గాన్ని చూపే దివిటీలు.

మనదేశం 1947 వరకు విదేశీయ పరిపాలనలో వుంది. 1947లో మనకు స్వాతంత్ర్యం రాగానే మనం మన అభీష్టానికి వీలుగా ప్రజాస్వామిక జీవన సరళిని ఎన్నుకున్నాం. దానిలోని మంచిసంతా కోరుకున్నాం, ఈ యాత్రలో మనం పురాతన ప్రజాస్వామిక దేశాలనుకూడా దాటుకుని వాటిని అలక్ష్యం చేసి ముందుకు పోయాం. ఆ దేశాలలో ప్రజలందరికీ కొన్ని కొన్ని ప్రాథమిక హక్కుల్ని ప్రసాదించడంలో దశాబ్దాల తరబడి కాలం తీసుకోగా మనం మన రాజ్యాంగ చట్టం క్రింద వెంటనే ఒకేసారిగా ఆ హక్కుల్ని అందజేశాం. కులం, మతం, ఆడా, మగా అన్న భేదంలేకుండా మన వయోజనులందరికీ ఓటు హక్కును ప్రసాదించాం. మన జాతీయ జీవితంలో స్త్రీకి గౌరవనీయమైన స్థానాన్ని అందజేశాం. మనం తీసుకుంటున్న యీ సాహసచర్యల్ని చూచి కొన్ని దేశాలు భృకుటి ముడిచి ప్రశ్నార్థకంగా మనవైపు చూశాయి. మనతెలివి తేటల్ని, శక్తిసామర్థ్యాల్ని తప్పుగా అంచనా వేశాయి. మన విజయాన్ని శంకించాయి. కాని ఆ తరువాత దేశంలో జరిగిన మూడు సాధారణ ఎన్నికలూ, మనం సాధించిన బ్రహ్మాండమైన విజయాలనూచూచి మన యీ ఉన్నత లక్ష్యాలను, మన విజ్ఞతను పూర్తిగా అవగాహన చేసుకున్నాయి. ఎన్ని క్లిష్ట పరిస్థితులు ఎదురైనప్పటికీ యింతగా అభ్యుదయాన్ని

సాధించిన మన శక్తిని, మన సాహసాన్ని యీనాడు ప్రపంచ రాజ్యాలన్నీ గుర్తించి ప్రస్తుతిస్తున్నాయి. ప్రజా స్వామ్యానికి తూర్పున పటిష్ఠమైన కోటగా మనదేశాన్ని గుర్తిస్తున్నాయి. ఎంత బడుగు దేశమైనా ప్రజాస్వామిక విధానంలో త్వరిత గతిని అభ్యుదయాన్ని సాధించవచ్చని, ఆచరణ పూర్వకంగా ప్రపంచానికి మనం తెలియ జెప్పాం. నిజానికి ప్రజాస్వామిక ప్రభావం ఎంతగా ఒత్తిడి చేస్తున్నదంటే, యీనాడు నిరంకుశ ప్రభుత్వాలుకూడా ప్రజాస్వామ్య వ్యవస్థా మార్గాలను అమలు పరుస్తున్నాయి.

ఇటీవల మనలో కొన్ని వర్గాలవారిలో ఆందోళనా చర్యలూ, అసంతృప్తి సంఘటనలూ తలెత్తాయి. కొన్నిటికి బహుశా వారిలో ఏర్పడిన నిరాశే కారణం కావచ్చు. మరికొన్నిటికి రాజకీయ ఎత్తుగడలు కారణం కావచ్చు. మిగిలినవి హక్కుల పేరిట జరిగేవని అనుకోవాలి. సువిశాలమైన ఒకానొక దేశంలోని శక్తివంతమైన ప్రజాస్వామిక వ్యవస్థలో కొన్ని కీచు గొంతుకలు వినిపించక తప్పవు. అయితే అవి శాశ్వతంగా వుండిపోయేవి కావు. నీళ్ళల్లోని అలలమాదిరిగా అంతరించిపోతాయి ప్రజాస్వామిక వ్యవస్థక్రింద పౌరునకి లభించే స్వేచ్ఛ ఏపరిమితులూ, పరిధులూ లేని సంపూర్ణమైన స్వేచ్ఛకాదు. ఆయా ప్రాంతాలలోని చట్టాలూ, అలవాట్లూ, సాంఘిక కట్టుబాట్లూ మొదలైనవాటి పరిమితుల మేరకు ఆ స్వేచ్ఛ వుంటుంది. ఈ పరిమితులను అతిక్రమించడంవల్ల విశృంఖలత్వం చెలరేగగలదు. స్థూలంగా చెప్పాలంటే మనప్రజలు క్రమశిక్షణకు అలవాటు పడిన పౌరులు. మనదేశాన్ని పరిపాలిస్తున్న ప్రజాస్వామిక సూత్రాల పరిరక్షణకూ, ఉద్దీపనకూ మనస్ఫూర్తిగా, శక్తివంచన లేకుండా కృషి చెయ్యగలరని ఆవగింజంత సందేహానికికూడా తావులేకుండా నిరూపించుకున్నారు. మానవ కల్యాణాన్ని సాధించాలంటే ప్రజాస్వామ్యంలో కొంత సహనం అవసరం. స్వార్థపూరిత దుష్టశక్తుల విచ్ఛిన్నకర ధోరణులను ఎదుర్కొనగలిగే ధైర్యం కావాలి. కొన్నికొన్ని కట్టుబాట్లూ, నిబంధనలు, ప్రవర్తనా నియమావళులు, పరిధుల మధ్య ప్రజాస్వామ్యం ఎప్పుడూ నిరాటంకంగా అభ్యుదయ దిశలో ప్రయాణం చేస్తుంది.

ప్రజాస్వామ్యం గల దేశంలో యువకుల పాత్రను గూర్చి యిక్కడ కొంత ప్రస్తావించడం అవసరం. ప్రజాస్వామ్యం మూడుపూలూ-ఆరు కాయలుగా వృద్ధి చెందిన అభ్యుదయ దేశాలలో దేశ భవిష్యత్ స్వరూపాన్ని తీర్చి దిద్దేభారం పెద్దలు తమ భుజస్కంధాలమీద వేసుకుని యువకులను వారి శక్తియుక్తుల నన్నిటినీ విజ్ఞానార్జనలో కేంద్రీకరించ మన్నారు. మనదేశంలోని యువకులుకూడా యీ మార్గాన్నే అనుసరిస్తే మంచిది. మన ప్రజాస్వామ్యం యింకా బాల్యదశలోనే వున్నది. మనం ప్రజా స్వామిక సాంప్రదాయాలను, పద్ధతులను రూపొందించుకోవడానికి యింకా మనకు చాలాకాలం పడుతుంది. అందువల్ల అభ్యుదయ దేశాల్లో యువకులవలె మన యువకులు కూడా తమ మనసును విజ్ఞానార్జనపై కేంద్రీకరించవలసిన అవసరం మనదేశానికి మరింతగా వున్నది. రాజకీయ రంగంలోకి దూకడానికి వారికి యింకా చాలా సమయం వుంది. తమ చదువులను పూర్తి చేసుకున్న తర్వాత అందుకు పూనుకోవచ్చు వారుకూడా ప్రజాస్వామ్య దేశంలో పౌరులుగా తమఓటు హక్కును ఉపయోగించవచ్చు. మనదేశ ప్రజలకు మరొకసారి ప్రజా స్వామ్యంపై తమ విశ్వాసాన్ని ప్రకటించుకోవడానికి మూడు నెలలలోగానే ఒక గొప్ప అవకాశం రానున్నది. అప్పుడు మరింతగా ఉజ్వల భవిష్యత్తులోకి మనదేశాన్ని నడిపించగలిగే సమర్థులైన ప్రతినిధులను వారు ఎన్నుకోగలరనడంలో ఎట్టిసందేహమూలేదు.

జై హింద్.

ముఖ్యమంత్రి.

కూరగాయల
మొక్కలకు
ఇంతకు ముందు
లేని సరిక్రొత్త
రకమైన రక్షణ !



# రోగోర్®

## మొట్టమొదటి భారతీయ సిస్టమిక్ క్రిమిసంహారిణి




రోగోర్, అనేక పంటలకు ఇంతకు ముందు లేని సరిక్రొత్త రకమైన రక్షణ నిస్తుంది. ఆకులు, వేళ్ల ద్వారా అది పీల్చుకోబడి మొక్క యొక్క పసరు ప్రవాహములోకి పోవును. అక్కడ అది రెండు వారములు వుంటుంది. ఈ సమయంలో మొక్క యొక్క పసరు త్రాగే ఏ చీడ క్రిములైనా నశిస్తాయి. రోగోర్ సురక్షితమైన క్రిమి సంహారిణి—మనుష్యులకు హానికరమైనది కాదు.
టాటా ఫైసన్ ఇండస్ట్రీస్ అత్యంత విస్తృతమై, అత్యధిక ప్రభావమైన క్రిమి సంహారిణులను చేయుదురని భారతీయ వ్యవసాయదారులకు పూర్తిగా తెలిసిన విషయమే. భారతదేశములో రోగోర్‌ను తయారు చేయుటకు వారు క్రొత్త ఫ్యాక్టరీని నిర్మించిరి.
రోగోర్ వాడండి—మొట్టమొదటి భారతీయ సిస్టమిక్ క్రిమి సంహారిణి—మీ కాయగూరల మొక్కల మీద...అత్యధిక, మంచి పంటలను పొందుదురని నిశ్చయపరచుకోండి.

® రోగోర్ మాంటెకాటిని, మిలాన్, ఇటలీ, యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

**TATA FISON RALLIS**

టాటా ఫైసన్ ఉత్పత్తి

టాటా ఫైసన్ రాలీస్

సీరియల్ :

# మహాభారతము

తెన్నేగంటియు లక్ష్మీశాస్త్రి

## 4

ఒకనాడు రాక్షసరాజగు వృషపర్వునికూతురు శర్మిష్ఠ, దేవయానితోను, కన్యకాసహస్రముతోను జలక్రీడ లాడుచుండెను. స్నానానంతరము, కుప్పగా పడియున్న వస్త్రములను కన్యకలు తీసికొని ధరించిరి. శర్మిష్ఠ పొరపాటుచేత దేవయాని చీరెను కట్టుకొనెను. దేవయాని కోపించి "నీవు నీచురాలవు. మా తండ్రి శిష్యునికూతురవు. గురుపుత్రియొక్క వస్త్రమును కట్టుకొంటివి. ఇది తప్పు. అని దూషించెను. దానికి శర్మిష్ఠ కోపించి, "మా యింట పురోహితుడుగా నుండి, మాపెట్టుపోతలచే పెరుగుచు, మాగుణములను వందిమాగధులవలె స్తుతించుచున్న శుక్రుని కూతురవగు నీ కింతగర్వమా." యని దురాగ్రహముచేత దేవయానిని దూషించి నూతిలో పడ ద్రోసెను. పిదప అందరును వెడలి పోయిరి.

అక్కడికి నహుషపుత్రుడగు యయాతిమహారాజు వేటకై వచ్చి జలపానార్థమై ఆనూతికి పోయి దేవయానిని చూచెను. ఆమె ప్రార్థించగా, ఆమెకుడిచేయి పట్టుకొని బయటకు తీసి ఆమెను వీడుకొని వెడలిపోయెను.

దేవయాని శర్మిష్ఠయందలికోపముచేత తండ్రిని పిలిచి జరిగిన సంగతి చెప్పి, వృషపర్వరాజ్యమును వీడి పోవలసినదని కోరెను. శుక్రుడు పుత్రీప్రేమచేత రాజ్యము వీడి పోవుచుండగా వృషపర్వుడు పోవలదని వేడుకొనెను. "నా పుత్రిని ఒప్పించి యామెకోర్కెను నెరవేర్చినచో ఉండెదను." అని శుక్రుడనెను. వృషపర్వుడు దేవయాని కోర్కెను విచారించగా ఆమె, "శర్మిష్ఠ కన్యకాసహస్రముతో తనకు దాసిగా నుండినచో మేమీ పట్టణమునందు ఉండెదము." అని చెప్పెను. ఆమాటకు వృషపర్వుడు అంగీకరించి శర్మిష్ఠను ఆమెకు దాసిగా అప్పగించెను.

ఒకనాడు దేవయాని శర్మిష్ఠాదులైన సహస్రకన్యకలతో వనవిహారము చేయుచుండగా యయాతిమహారాజు అక్కడికి వేటాడుచు వచ్చెను. అతడు వారిని చూచి పలుకరించి వారిసంగతి తెలిసికొనెను. దేవయాని, "నన్ను వివాహము చేసికొనుమనియు పూర్వమే నీవు నన్ను నూతినుండి తీయునపుడు నాదక్షిణపాణి గ్రహణము చేసితి వనియు చెప్పెను. యయాతి భయపడి "నీవు బ్రాహ్మణుడగు శుక్రునికూతురవు. నేను క్షత్రియుడను. మనకు వివాహము పొసగదు." అనెను. అప్పుడు దేవయాని తండ్రిని పిలిపించి తనకోర్కెను తెలిపెను. శుక్రుడు యయాతికి బ్రాహ్మణ కన్యావివాహదోషము అంటకుండగా వరమిచ్చి, యిరువురికిని వివాహము చేసెను. శర్మిష్ఠను వివాహమాడకూడదని యయాతికి శుక్రుడు కట్టడి చేసి పోయెను.

దేవయానిని పెండ్లియాడి యయాతి మహారాజు రెండు వేల దాసీజనముతో కూడిన దేవయానీ శర్మిష్ఠలతో తన పట్టణమును చేరి దేవయానిని రాజసదనములో ప్రవేశపెట్టి ఆమె కోరికపై శర్మిష్ఠకు అశోకవనమునందు ఇల్లు కట్టించి అందులో ఆమెను ఉంచి రక్షించుచుండెను. కొంతకాలమునకు దేవయానికి కొడుకు పుట్టెను.

ఇట్లుండగా కొన్నాళ్లకు శర్మిష్ఠకు ఋతుకాలము వచ్చెను. ఆమెగూడ యయాతినే యాచించి పుత్రుని కనదలచెను. తన కోరిక నతడు త్రోసివేయడనువిశ్వాసము ఆమెకు ఉండెను. కాని అతడు ఒంటరిగా తనకు కనపడుట యెట్లు? అని ఆమె యోచించుచుండగనే యయాతి విహారార్థమై తోటలోకి వచ్చుచుండుటను చూచి శర్మిష్ఠ ఆయనకు స్వాగతవచనపూర్వకముగా నమస్కరించి యిట్లనెను.

శర్మి:- రాజా! నేను నీయింట సురక్షితముగా నున్నాను. కుల రూప యౌవన సంపత్తిచేత నీకు అన్నివిధముల తగినదానను. కనుక నాఋతుకాలము సఫలమగునట్లు నాకు ఋతుదానముచేసి పుత్రుని అనుగ్రహింపుము.

యయా:- సుందరీ! నా కన్నియు తెలియును. అన్నిటను నీవు యోగ్యురాలవే. కాని, నిన్ను ప్రేమించకూడదని శుక్రాచార్యులు నాకు ఆజ్ఞ చేసెను. కనుక నేను అసమర్థుడను.

శర్మి:- పరిహాసవచనములలోను, స్త్రీల విషయమునందును, వివాహకాలమునందును, ప్రాణాపాయము కలిగినప్పుడును, సర్వధనము అపహరింపబడునప్పుడును, ఈ యైదుసమయ

ములందు అసత్యమాడినను పాపమంటదు. నిర్దోషిని రక్షింప వలసినప్పుడు అసత్యము దోషము కాదు.

యయా:_ రాజు అందరికిని ప్రమాణభూతుడు. కనుక నేను ఎన్ని సంకటములు వచ్చినను అసత్య మాడను.

శర్మి:_ సఖురాండ్రిద్దరు సమానులే. నాసఖి నిన్ను వరించెను. కనుక మాయిరువురికిని సమానముగా వివాహమైనట్లే. ఇది గాక ఎవరేది కోరినను ఇచ్చెదనని నీవ్రతముకదా! నా కోరికను నెరవేర్చని యెడల నీవు అసత్యవాది వగుదువు.

యయా:_ అడిగినది లేదనకుండ ఇచ్చువ్రతము నాది. నీకు ఏమికావలెనో కోరుకొనుము.

శర్మి:_ నీవలన సంతానమును పొంది నేను ధర్మాచరణము చేయ దలచినాను. ప్రపంచములో ధనవంతులైనను ధనహీనులుగా పరిగణింప బడువారు ముగ్గురున్నారు. భార్య, సేవకుడు, పుత్రుడు. ఎందు కనగా, భార్యసంపద భర్తది, సేవకునిసంపద యజమానునిది, పుత్రునిసంపద తండ్రిది. నేను దేవయానికి సేవకురాలను. ఆమె నీ భార్య యగును. కనుక ఆమెసంపద యగు నేను నీకు ఉపభోగ్యురాలనే యగుదును.

శర్మిష్ఠ మాటలు విని యయాతి సంతుష్టుడై ఆమెను చేపట్టెను. కొన్నాళ్లకు శర్మిష్ఠ కొడుకును గనెను. ఆసంగతి దేవయానికి తెలిసి శర్మిష్ఠకడకు వచ్చి యిట్లేల జరిగినదనెను.

శర్మి:_ నా ప్రార్థనపైన ఒకఋషివచ్చి పుత్రుని ప్రసాదించెను. నేను కామవశురాలనై అన్యాయము చేయలేదు నిక్కముది.

దేవ:_ అట్లైన మంచిదే కాని, ఆఋషిగోత్రనామము లేమి?



శర్మి:_ ఆయన తపస్సు, తేజస్సుచేత సూర్యునివలె ప్రకాశించు చుండెను. ఆయనను జూచి ఈప్రశ్నలు అడుగ జాలనైతిని.

దేవ:_ శర్మిష్ఠా! అట్లైనచో నీపైన నాకేలాటి కోపమును లేదు.

అని చెప్పి దేవయాని తనభవనమునకు పోయెను. యయాతి దేవయాని యందు యదు, తుర్వసు అను పుత్రులను ఇరువురను కనెను, శర్మిష్ఠయందు కూడ 'దుహ్యు' అను పూరు, అను ముగ్గురు పుత్రులను కనెను. కొంతకాలమునకు దేవయాని యయాతితో కలిసి వనమునకు పోయి శర్మిష్ఠవద్ద ఆడుకొనుచున్న ముగ్గురు బాలకులను చూచి ఆశ్చర్యపడెను. మీ రెవరిపుత్రులు అని వారి నడిగెను. వారు అక్కడ నున్న తలిదండ్రులను చూపి తండ్రి ఒడిలో కూర్చొన బోయిరి. కాని యయాతి దేవయానికి జడిసి వారిని చేరదీయలేదు. వారు ఏడ్చుచు తల్లివద్దకు పోయిరి. అది చూచి దేవయానికి కోపము వచ్చి నియమభంగముచేసి శర్మిష్ఠను చేపట్టితివి కనుక నీవద్ద నుండను. అని యయాతిని వీడి తండ్రికడకు పోయెను. యయాతి ఆమెను ప్రాధేయపడుచు ఆమె వెంటనే శుక్రాచార్యుల వద్దకు పోయెను. దేవయాని జరిగిన సంగతిని తండ్రికి చెప్పి యయాతి ధర్మమును వీడి చరించినా డనెను. శుక్రుడు కోపించి యారాజునకు ముసలితనము వచ్చునట్లు శపించెను. దానికి యయాతి, ఋతుకాలమునందు యాచించినందుకు శర్మిష్ఠకోర్కె నేను తీర్చితిని. అది ధర్మబద్ధమే. ఋతుకాలమునందు యాచించినస్త్రీని తిరస్కరించినవానికి భ్రూణహత్యాదోషము కలుగు నని ధర్మశాస్త్రములు చెప్పుచున్నవి. ఆమె నాస్త్రీకి దాసి గనుక నేను ఆమెతో కవయుట ధర్మయుక్తమే యగును. అట్లు గమ్యురాలైన స్త్రీ, రహస్యమునందు కోరినప్పుడు ఆమెను నిషేధించుట గూడ భ్రూణహత్యకు సమానమే యగును. ఈధర్మసూక్ష్మములు మీ రెరుగనివి కావు. కనుక ఇట్టి ధర్మము లన్నింటిని పరిశీలించియే నే నామెకోర్కె తీర్చితిని. అని చెప్పెను. కాని శాపవశముచేత అతనికి వార్ధక్యము వచ్చెను. అది చూచి యయాతి దేవయానితో కలిసియుండుటకు నా కింకను తృప్తితీరలేదు. కనుక మహాత్మా నాకు ఈ ముసలితనము సంప్రాప్తించ కుండునట్లు అనుగ్రహింపుము. అని ప్రార్థించెను. దానికి శుక్రుడు శాంతించి నీజరాభారమును ఇతరులకు సంక్రమింపజేసి వారియౌవనమును నీవు స్వీకరింప జాలుదువు. అని తనశాపమునకు తిరుగుడు చెప్పెను. ఆమాటకు యయాతి "తన యౌవనమును నా కిచ్చినపుత్రునికి నారాజ్యముపైన అధికారము కల్గునట్లును, అతడు కీర్తిమంతుడు, పుణ్యవంతుడు నగునట్లును అనుగ్రహించవలసిన" దని కోరగా శుక్రాచార్యులు అంగీకరించెను.

ముసలితనముతో యయాతి తన పురమునకు పోయి పుత్రులను పిలిచి తనముసలితనమును తీసికొని యౌవనము నిమ్మని కోరెను. దేవయానిసుతులు యదు, తుర్వసులు, శర్మిష్ఠసుతులలో తొలియిద్దరు 'ద్రుహ్యు, అను' వారును దానికి అంగీకరించలేదు. తండ్రి కోపించి వారు రాజ్య భ్రష్టులు, కులభ్రష్టులు నగునట్లు శపించెను. అందరికన్న కనిష్టుడు 'పూరు' అనువాడు భక్తితో అంగీకరించి తన యౌవనమును తండ్రికి ఇచ్చెను. ఆయన

ఢుగాను ఉన్న కొడుకే కొడు కనిపించుకొనును. అట్టివానికే పిత్ర్య మైన ధనమునకు అర్హత ఉండును. అనిచెప్పి ప్రజలను అంగీ కరింప జేసెను. వారును సంతసించి యోగ్యుడగుపూరునకు రాజ్య పట్టాభిషేకము చేయుచున్నయయాతిని అభినందించి సహక రించిరి. గంగా యమునా నదుల మధ్యదేశమును పూరుడు పాలిం చెను. ఆయెల్లకు ఈవలిదేశములు ఇతరసోదరులు పాలించిరి.

యదువునుండి యాదవులు. తుర్వసువునుండి యవనులు. దుహ్యువునుండి భోజులు, అనువునుండి మ్లేచ్ఛజాతులు పుట్టెను.

పూరువునుండి పౌరవజాతి పుట్టెను. ఓ జనమేజయమహా రాజా! నీవు ఆపూరువంశమునందు జనించితివి. ఈ రాజ్యమును వేయిసంవత్సరములు నీవు పాలించవలెను. అని వైశంపాయనుడు చెప్పెను.

యయాతి పూరునకు రాజ్యపట్టాభిషేకము చేసి వానప్రస్థ వృత్తి నవలంబించి వనమునకు పోయెను. కొంతకాలమునకు స్వర్గమునకు పోయి అచ్చట సుఖముగ నివసించు చుండెను.

ఒకనాడు ఇంద్రుడు సభలో యయాతిని జూచి నీవు తపస్సులో ఎవరితో సమానుడవు? అని ప్రశ్నించెను. దానికి యయాతి, ''నాతో సమానులైన తపస్వులు, దేవతలలో, గంధ ర్వులలో, మహర్షులలోను ఎవ్వరును లేరు నేనే గొప్పవాడను.'' అని చెప్పెను. ఆమాట విని యింద్రుడు, "రాజా! నీవు వివేకము లేక పెద్దల నందరిని తిరస్కరించి అవమానము చేసితివి. దీనితో నీపుణ్యము నశించెను. కనుక ఈ స్వర్గమునుండి పతితుడ వైతివి" అనెను. అది విని యయాతి "నేను మహాత్ములను. తిరస్కరించుట



సంతసించి యతనికి తన రాజ్యమును ఇచ్చి సత్సంతతి కలుగునట్లు వరము గూడ నిచ్చెను.

యౌవనమును పొంది యయాతి స్వస్త్రీలతోను, దేవకన్య లతోను యథేష్టముగా వేయిసంవత్సరములు విహరించి పూరును పిలిచి నాయనా! నాకీ కామసుఖము అక్కర లేదు. ఎంతకును దీని తృప్తి దీరదు. కామములను అనుభవించుటచేత అవి తీరవు. నేయి పోయగా అగ్నివలె కామములు అభివృద్ధి జెందుచుండును ప్రపంచ ములో సకలసంపదలను అనుభవించినను నిరాశవలన గలుగు సుఖము రాదు. ఆశ మానవుని వీడదు. అతడు ఆశక్తుడైనను దాని శక్తిమాత్రము తగ్గదు. అది యొక ప్రాణాంతకరమైన రోగము కనుక దానిని విడిచిన వానికే సుఖము అబ్బును. నేను వేయి సంవత్సరములు కామోపభోగము చేసినను ఆశ తీరలేదు. కనుక దీనిని విడిచి పరమాత్మయందు మనస్సు లగ్నము చేయదలచితిని. వానప్రస్థమును చరించెదను. కనుక పుత్రా! నీయౌవనము నీవు తీసికొని నాజరను నాకిమ్ము. నీకు సకలశుభములు కలుగు గాక. సుఖముగా రాజ్య మేలుము. అనిచెప్పి అతనిని ఆశీర్వదించి యత నికి రాజ్యపట్టాభిషేకము చేయుటకు తలపెట్టెను.

అప్పుడు పురజనులు యయాతి కడకు వచ్చి, జ్యేష్ఠులు ఉండగా కనిష్ఠునికి పట్టాభిషేకము చేయుట అధర్మ మనిరి. ఆ మాటకు యయాతి, పెద్దకొడుకులు నలుగురును నాయాజ్ఞను త్రోసి పుచ్చిరి. పూరుడు నాయభీష్టమును తీర్చెను గనుక ఇతనికే రాజ్యా ధికారము కలదు ఇది శుక్రునియాజ్ఞ. మాతాపితరులకు అను కూలుడుగా ఉండి, వారిమాట వినుచు, వారికి ప్రియుడుగాను హితు



చేత స్వర్గమునుండి చ్యుతుడ నైనను సల్లోకమునందు సత్పురుషుల మధ్య నుండునట్లు అనుగ్రహింపుము.'' అని కోరెను. ఇంద్రుడు అతనికి ఆ వరమిచ్చి ''యికపైన ఎప్పుడును పెద్దలను తిరస్కరించి నిర్లక్ష్యపడకుము. సత్సంగతివలన నీవు మరల స్వర్గమునకు రాగలవు అని చెప్పెను. అంతట పుణ్యలోకమునుండి భ్రష్టుడై క్రిందికి పడుచున్నయయాతిని మార్గమధ్యములోనే సల్లోకము నందలి అష్టకుడు అను రాజర్షి కలిసి యిట్లు ప్రశ్నించెను

అష్ట:- ఇంద్ర సమానరూపముగలిగి, అగ్నివలె ప్రకాశించుచున్న నీవెవరు? స్వర్గమునుండి చ్యుతుడ వగుటకు కారణ మేమి? సత్పురుషులసమాజములో చేరితివి. నీకింక భయము లేదు. నీవు మాకు అతిథివి. కనుక పూజ్యుడవు. తపించుట యందు అగ్నికి, బీజధారణము చేయుటయందు భూమికి, వెలుగు నిచ్చుటయందు సూర్యునకు శక్తి యున్నట్లే అతిథికి సత్పురుషులను శాసించి తన యిష్టము తీర్చుకొనుటయందు శక్తి యుండును. స్వేచ్ఛగా ఇక్కడ ఉండుము.

యయా:- నేను 'యయాతి' అను రాజును. పెద్దలను అవమానించుట చేత స్వర్గమునుండి పతితుడ నైతిని. అధికధనముచేత హర్షించ గూడదు. విద్యల నభ్యసించి గర్వపడ కూడదు. అన్నిటికంటె దైవమే బలీయమని అణకువతో నుండవలెను. సుఖదుఃఖములు దైవాధీనము లని తలంచ వలెను. నేను భయసంతాపములకు జడియను. బంధువులు, మిత్రులు విత్తహీనుని విడిచినట్లు క్షీణపుణ్యుడనగు నన్ను స్వర్గ వాసులు విడిచిరి. విద్యావంతుడు గర్వపడుచు ఇతరులయశస్సుకు హానిని కల్పించినయెడల అతనికి నరకప్రాప్తి కలుగును. సత్పురుషులు సజ్జనులను గౌరవించ వలెను. భూతదయ, సత్యవాక్యము ఈరెంటికన్న మించినధర్మము లేదు. ఇతరులు నొప్పిపడుదురు. అని వెను కాడక వారిని బాధించుటకన్న మించినఅధర్మము లేదు.

ఆ మాటలు విని అష్టకుడు సంతుష్టు డయ్యెను. అప్పటనే యున్న మరియొక రాజర్షి ప్రతర్దను డనువా డిట్లు ప్రశ్నించెను.

ప్రత:- ఓరాజా! నాకు కలుగబోవు పుణ్యలోకము లన్నియు నీకు ఇచ్చి నిన్ను క్రింద పడనీయకుండ జేసెదను. నీవు భయ పడకుడు.

యయా:- రాజర్షీ! ధర్మదృష్టి గలవాడు తనధర్మము, యశస్సు పైననే ఆధారపడి యుండును. వా డెప్పుడు గూడ దీనుడై ఇతరులసంపత్తికి ఆశపడడు. ఎవడు ధర్మాధర్మములను గుర్తెరిగి కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుకొన గలడో అతడు బుద్ధిమంతు డై జాగ్రత్తతో సంచరించును. అతడు తనమహిమచేతనే లోకపాలకుడు కాగలడు. అట్టివాడు ధర్మార్థ కామములు మూడుగూడ న్యాయముగా ఏక కాల ములో ప్రాప్తించినపుడు అర్థకామములను విడి ధర్మ మునే ఆశ్రయించును. ఇట్టిదియే ధర్మము. కనుక నీవు నాకిచ్చు ఉత్తమలోకములకు ఆశ పడను.

ఆమాటలు విని అప్పటనే ఉన్న 'వసుమంతుడు' అను మరియొక రాజర్షి యయాతిని ఇట్లు ప్రశ్నించెను.

వసు:- రాజా! నీవు ధర్మాత్ముడవు. నీకు మేలు చేయుట నా కర్తవ్యము. కనుక నాకు కలుగనున్న పుణ్యలోకములు నీకిచ్చి నిన్ను క్రింద పడకుండ జేసెదను. ఒకవేళ దానము పుచ్చుకొనుట పాపమని నీవుభావించినచో ఏదైనతృణమాత్ర వస్తువునైన నాకిచ్చి నాపుణ్యలోకములను వెలకుకొనుము. నీవు కొనుటకు ఇష్టపడనియెడల నేను హృదయపూర్వకముగా సంతోషముతో నాపుణ్యలోకములు నీకు సమర్పించెదను వాటిపైన సంపూర్ణాధికారము నీ కిచ్చుచున్నాను.

యయా:- రాజర్షీ! నేను ఇట్టి అసత్యవస్తువును వెలకు కొన దలచ లేదు నేను స్వయముగా సత్కర్మ చేసి సంపాదించు కొనెదను.

ఆమాటలు విని శిబి యను రాజర్షిగూడ పై విధముగనే ప్రశ్నించెను కాని యయాతి చలించ లేదు అతనికి గూడ పై విధముగనే బదులు చెప్పెను. ఈ నల్గురు రాజర్షులు యయాతి పుత్త్రియగు మాధవి కొడుకులు గనుక యయాతికి దౌహిత్రులు.

ఈ సంవాదము ఇట్లు జరుగుచుండగనే అక్కడనే ఉన్న యయాతిపుత్రికయగు మాధవి అక్కడికి వచ్చి తన తండ్రిని కొడుకులకు పరిచయము చేసి యయాతితో నిట్లనెను:-

మాధవి:- ''రాజా! మాతపోబలముచేత సంపాదింప బడిన పుణ్య లోకములను సంతోషపూర్వకముగా నీకు సమర్పించు చున్నాము కైకొనుము. పౌత్త్రులధనమువలెనే దౌహిత్రుల ధనముగూడ నీవు స్వీకరించుటకు అర్హుడవు.

యయాతి:- ఇది ధర్మజనితమైనసంపద యగును. కనుక నేను గైకొనెదను. నేను నాకూతురిచేతను, దౌహిత్త్రులచేతను తరింప బడితిని కనుక నేటినుండి పవిత్రమైన పితృ శ్రాద్ధకర్మలో దౌహిత్త్రుని మంత్రణము పరమపవి త్రము కాగలదు. దౌహిత్త్రుడు శ్రాద్ధభోజనమునకు కూర్చున్నచో పితృదేవతలు చాల సంతృప్తిపడుదురు. పితృశ్రాద్ధములో దౌహిత్త్రుడు, కుతప కాలము, తిలలు, ఈ మూడును పవిత్త్రములు. కుతపకాల మనగా పగటి యొక్క యెనిమిదవభాగము. అప్పుడు సూర్యుని తేజస్సు జారుచుండును. ఆకాలములో పితరులకు చేసిన శ్రాద్ధతర్పణాదులు అక్షయ మైనఫలము నిచ్చును. తిలలు (నువ్వులు) పిశాచములనుండి, దర్భలు రాక్షసుల నుండి రక్షించును. వేదవేత్తలు భోజన పంక్తిని రక్షించె దరు. యతులు శ్రాద్ధభోజనము చేసినచో అది అక్షయ ఫలమును చేకూర్చును. యోగ్యుడు, విద్వాంసుడు, వేద వేత్త, నియమవంతుడు, పరిశుద్ధుడు నగువాడు శ్రాద్ధ భోజనమునకు అర్హుడు కాగల డని యయాతి చెప్పెను.

ఇట్లు చెప్పి యయాతి తన దౌహిత్రుల తపోబలముచేత సంపాదించ బడిన స్వర్గాదిపుణ్యలోకములకు దౌహిత్త్రులతో

బయలుదేరెను. వారిలో శిబి చక్రవర్తి అధికధర్మాత్ముడు గనుక అందరికన్నముందుగా స్వర్గము చేరెను.

ఈ విధముగా యయాతి మహారాజు అతిగర్వముచేత క్షీణపుణ్యుడై స్వర్గమునుండి పతితు డైనను తిరిగి సత్సంగతి చేతను, దౌహిత్రులపుణ్యముచేతను మరల పుణ్యలోకములకు పోగలిగెను. కనుక ధర్మపరునకు ఎన్నటికిని చ్యుతిలేదు.

## పూరువంశ వర్ణనము.

జనమేజయ మహారాజు యయాతి చరిత్ర విని పూరు వంశములో శ్రేష్ఠులచరిత్ర విన గోరి వైశంపాయనమహామునిని ప్రశ్నింపగా నాత డిట్లు చెప్ప దొడగెను.-

పూరువంశములో ననేకులు దక్షప్రజాపతి మొదలుకొని మహాధర్మపరులైన రాజులు పుట్టిరి. వారిలో శకుంతలాదుష్యంతు లకు పుట్టిన భరతుడు పూరువంశరాజులకు వంశకర్త యయ్యెను. సుహోత్రునకు సువర్ణయందు పుట్టిన హస్తి యను రాజు నిర్మించిన నగర మీరాజులకు రాజధాని యయ్యెను. హస్తి నిర్మితము గనుక దానికి 'హస్తిపురము' అనుపేరు నేటికిని ప్రసిద్ధమై యున్నది. తపతికి సంవరణునకు పుట్టిన 'కురు' రాజు సుప్రసిద్ధుడు. అతని పేరనే కురుక్షేత్రము జగత్ప్రసిద్ధ మై యున్నది. ఇట్లనేకులు రాజర్షి సత్తములు క్రమముగ జనించిరి.

'ప్రతిశ్రవసుడు' అను ఈవంశపురాజునకు 'ప్రతీపుడు' పుట్టెను. అతనికి సునందయందు దేవాపి, శాంతనుడు (శంతనుడు), బాహ్లికుడు, అను ముగ్గురు కొడుకులు పుట్టిరి. దేవాపి బాల్యమునందే వనమునకు పోయెను. శాంతనుడు (శంతనుడు) రాజయ్యెను. అతడు తనరెండుచేతులచేత స్పృశించిన వృద్ధుడు పూర్ణసుఖశాంతులను పొంది తిరిగి యువకు డగును కనుక ఈ రాజునకు 'శాంతనుడు' అనుపేరు వచ్చెను. అతడు గంగను పెండ్లియాడి యామెయందు దేవవ్రతుడను భీష్ముని కనెను. అతడు తండ్రికోర్కెను నెరవేర్చ దలచి సత్యవతిని తండ్రికి వివాహము చేసెను. ఆమెకు 'గంధకాలి' యని మరియొక పేరు గలదు. ఆమె కన్యగా నున్నపుడే పరాశరమహాముని యను గ్రహముచేత వేదవ్యాసునికనెను. ఇప్పుడు శాంతను మహారాజు వలన 'విచిత్రవీర్యుడు, చిత్రాంగదుడు' నను నిరువురు పుత్రులు ఆమెకు కలిగిరి. చిత్రాంగదుడు బాల్యమునందే గంధర్వునిచేత హతుడయ్యెను. విచిత్రవీర్యుడు రాజయ్యెను. అతడు కౌసల్యా కాశిరాజులకు పుట్టిన 'అంబిక, అంబాలిక' యనుకన్యలను పెండ్లియాడెను. కాని అనపత్యుడుగానే మరణించెను. పూరువంశము అంతటితో విచ్ఛిన్నము కాకూడ దని సత్యవతి చింతించి తన జ్యేష్ఠపుత్రుడగు వ్యాసమహామునిని తలచినంతనే ఆయన ఆమెయెదుట నిలిచి ''తల్లీ! యేమి యాజ్ఞ?'' అని యడిగెను. ''నీతమ్ముడు విచిత్రవీర్యుడు అనపత్యుడుగా మరణించెను గనుక అతనిభార్యలయందు

నూర్గురు పుత్రులు వ్యాసుని వరప్రభావముచేత పుట్టిరి. ఆనూర్గురి యందు ''దుర్యోధనుడు, దుశ్శాసనుడు, వికర్ణుడు, చిత్రసేనుడు'' అను నలుగురు ప్రధానులు. పాండురాజుకు మాద్రి'పృథ' యనుపేరు గలకుంతియని యిరువురు భార్య లుండిరి. ఆరాజు ఒకనాడు అడవికివేటకు పోయి కామాసక్తిలో నున్నమృగదంపతులలో పురుషమృగమును బాణముతో కొట్టెను. ఆదెబ్బతిని మృగము'' రాజా!నీవు కామరసమును గుర్తెరిగినవాడ వయ్యును, కామాసక్తుడ నగుచున్న కొట్టితివి కనుక నీవును స్త్రీలను కలిసినయెడల వెంటనే మరణించెదవు'' అని శపించెను. పాండురాజు ఆశాపమునకు ఖిన్నుడై ప్రాణభయముచేత భార్యలను కవయకుండెను. ఒక నాడు కుంతితో, ''నేను చాపలముచేత శాపమును పొందితిని. అనపత్యునకు పుణ్యలోకములు లేవు. కనుక నీవు పుత్రులను కనుము'' అని చెప్పెను. ఆమె అంగీకరించి, యమధర్మరాజు వలన యుధిష్ఠిరుని, వాయువువలన భీమసేనుని, ఇంద్రునివలన అర్జునుని కనెను. పతియాజ్ఞపై కుంతి తనమంత్రవిద్యను మాద్రికి నేర్పెను. ఆమంత్రప్రభావముచేత మాద్రికి అశ్వినీదేవతలవలన 'నకుల, సహదేవులు' అను కవలపుత్రులు పుట్టిరి. ఒకనాడు చక్కగా అలంకరించుకున్న మాద్రిని చూచి పాండురాజు మోహించి యామెను స్పృశించగనే మరణించెను. మాద్రి తన కొడుకులను కుంతికి ఒప్పజెప్పి పతితోపాటు చితాగ్నిలో సహగమనము చేసెను.

తరువాత ఆ వనములోని మునులు పాండవులను, కుంతిని వెంటబెట్టుకొని హస్తినాపురికి వచ్చి భీష్మునకు విదురునకు ఒప్పగించి వెడలిపోయిరి. హస్తినాపురిలో పెరుగుచున్నపాండవులను చూచి దుర్యోధనుడు ఓర్వలేక పెక్కు ఉపాయములచేత పాండవులను సంహరింప దలచెను. కాని దైవబలముచేత వారు చావలేదు. చివరకు వారణావతము నందు లక్కయింటిలో పాండవులను దహింప దలచిరి. కాని విదురునిసహాయముతో తప్పించుకొని పోవుచు మార్గములో హిడింబుని, బకుని సంహరించి ద్రుపదరాజపుత్రిని పెండ్లియాడి తమపట్టణమునకు పోయిరి. ద్రౌపదియందు యుధిష్ఠిరుడు ప్రతివింధ్యుని, భీముడు సుతసోముని, అర్జునుడు శ్రుతకీర్తిని, నకులుడు శతానీకుని, సహదేవుడు శ్రుతకర్మను పుత్రులనుగా బడసిరి. వీరిని గాక, యుధిష్ఠిరుడు శిబిదేశరాజైన గోవాసనుని కూతురు 'దేవిక'ను పెండ్లియాడి 'యౌధేయుడు' అను పుత్రుని కనెను. భీముడు కాశీరాజుబిడ్డ 'బలంధర'ను వివాహమాడి 'సర్వగుడు' అనుపుత్రుని బడసెను. అర్జునుడు శ్రీకృష్ణుని చెల్లెలు 'సుభద్ర'ను పెండ్లియాడి అభిమన్యుని గనెను. నకులుడు చేదిరాజపుత్రిక 'రేణుమతి'ని పత్నిగా జేసికొని 'నిరమిత్రు'ని గనెను. సహదేవుడు మద్రదేశరాజు 'ద్యుతిమంతుని పుత్రి 'విజయ'ను స్వయంవరములో గైకొని ఆమెనుండి 'సుహోత్రు'ని గనెను.

'ఉత్తర' ను పెండ్లియాడి ఆమె యందు మరణించిన శిశువును కనెను. అప్పుడా శిశువును కుంతీదేవి, శ్రీకృష్ణుని ఆజ్ఞచేత తన యొడిలో తీసికొనెను. ఆరు నెలలగర్భములో నుండినప్పుడే అశ్వత్థామ శస్త్రాగ్నిచేత మరణించిన ఆ శిశువును బ్రతికించెద నని కుంతిని ఆశ్వాసించెను. కాని, శిశువు పూర్ణముగా గర్భము నందు పెరుగక ఆరు నెలలు మాత్రమే గర్భవాసముచేసి ప్రసవ కాలమునకు పూర్వమే ఉత్పన్నుడగుటచేత అతనికి బలము, వీర్యము, పరాక్రమము లేకుండెను. అయినను శ్రీకృష్ణుడు తన తేజస్సుచేత ఆ శిశువును జీవింపజేసెను. 'కురువంశమంతయు పరిక్షీణమయిన తరువాత పుట్టిన శిశువు గనుక 'పరీక్షిత్తు' అని ఆ శిశువునకు కృష్ణుడు నామకరణము చేసెను. ఓ జనమేజయా! ఆ పరీక్షిన్మహారాజే 'మాద్రవతి'ని పెండ్లియాడి నిన్ను కనెను. నీకు 'వపుష్టమ' యను భార్యయందు 'శతానీకుడు, శంకుకర్ణుడు' అను నిరువురు సుతులు కలిగిరి. శతానీకునికి వైదేహియందు 'అశ్వమేధదత్తుడు' పుట్టెను.

ఇది పూరువంశ, పాండవ వంశముల చరిత్ర సంగ్రహముగా వివరింపబడెను. ఈ చరిత్రను తెలిసికొన్నవారు పుణ్యవంతులగుదురు. వ్యాసనిర్మిత మహాభారతము వేదసమానము. అతి పవిత్రము, ఉత్తమము. దీనిని నియమముచేత విన్నవారికి ఆయువు, కీర్తి అభివృద్ధి నందును.

## మహాభిషు, గంగాదేవుల వృత్తాంతము

వైశంపాయనమహాముని జనమేజయ మహారాజునకు తరువాతికథ యిట్లు చెప్పదొడగెను.

పూర్వము ఇక్ష్వాకుల వంశమునందు 'మహాభిషుడు' అను రాజు ఉండెను. అతడు వేయి అశ్వమేధయాగములు, నూరు రాజసూయయాగములు చేసి స్వర్గమును పొందెను. ఒకప్పుడు బ్రహ్మలోకము నందు బ్రహ్మను సేవించుచున్న దేవతలలో మహాభిషుడు గూడ ఉండెను. ఆ సభలోకి గంగాదేవి వచ్చెను. అప్పుడు వాయువశముచేత ఆమె వస్త్రము పైభాగమునకు ఎగిరెను. అప్పుడు దేవతలందరు తమముఖములను క్రిందికి వాల్చి ఆ దృశ్యమును చూడకుండిరి. కాని, మహాభిషుడు మాత్రము శంకలేక గంగవైపే తలయెత్తి చూచుచుండెను. అది గమనించి బ్రహ్మదేవుడు, 'దుర్మతీ! నీవు ఈ పాపమునకు ఫలముగా మనుష్యలోకములో జన్మించి కొంతకాలమునకు తిరిగి పుణ్యలోకములను చేరగలవు. నీ చిత్తమును హరించిన గంగ కూడ మనుష్య లోకములో జనించి, నీకు పత్నియై నీకు ప్రతికూలముగా ఆచరించగలదు. అని శాపము నిచ్చెను. "నీకు గంగపై కోపము వచ్చినప్పుడు ఈ నీశాపము తొలగిపోవును." అని శాపాంతమును గూడ బ్రహ్మ ప్రసాదించెను.

అప్పుడు మహాభిషుడు భూలోకములో తనకు తండ్రిగా నుండుటకు అర్హుడైన రాజర్షి 'ప్రతీపు'డు అని నిర్ణయించుకొని అతనికి పుత్రుడుగా జనింప దలచెను. గంగాదేవి, తనను జూచి ధైర్యచ్యుతుడైన మహాభిషునే తలచుచు బ్రహ్మశాపవశమున భూలోకమునకు వచ్చుచు మార్గములో వసువులను జూచెను. వారి శరీరములు స్వర్గమునుండి భూమిపైన పతితము లగుచుండెను. వారిని జూచి గంగ యిట్లు ప్రశ్నించెను. "మీకు దివ్యరూపము నష్టమై యిట్లు అధఃపతితు లగుటకు కారణమేమి? దేవతలకు కుశలమా?

వసు .—"దేవీ! ప్రచ్ఛన్నముగా కూర్చొని సంధ్యోపాసన చేయుచున్న వసిష్ఠమహామునికి మూర్ఖులమై మేము అపకారము చేసితిమి. ఆ ముని కోపించి 'మనుష్య యోనియందు పుట్టుడు' అని మమ్ము శపించెను. ఆ బ్రహ్మర్షి వచనము తప్పదు కనుక మాతా! నీవు భూమండలములో మానవ పత్నివై మమ్ము నీ పుత్రులనుగా కనుము. మనుష్య స్త్రీల గర్భములో పడకుండ మమ్ము కాపాడుము.

గంగ .— (వారి ప్రార్థన సంగీకరించి) భూలోకములో మీకు తండ్రి యగుటకు తగిన పురుషుడు ఎవడున్నాడు?

వసు :—ప్రతీపమహారాజు పుత్రుడు శాంతనుడు ఉన్నాడు. అతడు భూలోకములో జనించును.''

గంగ :—నాకును అదే ఇష్టము. నేను ఆ రాజును పెండ్లి చేసికొని అతని ప్రీతిని, మీ అభీష్టకార్యమును నెరవేర్చెదను.

వసు :—తల్లీ! మేము భూలోకములో చాలకాలము ఉండలేము కనుక నీవు మమ్ము అనుగ్రహించి కనినవెంటనే నీజలము నందు పారవేయు చుండుము.

గంగ :—అట్లే చేసెదను కాని ఆరాజు, పుత్రసంతతికొరకు నాతో చేసిన సంబంధము వ్యర్థము కాకూడదు కనుక అతని కొరకు ఒక్క పుత్రునైనను సజీవునిగా నుంచుట అవసరము.

వసు :—మా యెనమండుగురి తేజస్సునుండి ఒక్కొక్కరము ఎనిమిదవ అంశమును ఇచ్చెదము. ఇట్లు ఏర్పడిన యెనిమిది అంశములతో పుట్టిన కొడుకు ఆరాజుకు ప్రీతికరుడై యుండగలడు. కాని, అతనికి తిరిగి సంతతి యుండదు. ఆనీపుత్రుడు పుత్రహీనుడై మహాపరాక్రమశాలిగా భూలోకమునందు వెలయ గలడు.

ఈవిధముగా వసువులు గంగాదేవితో ఒడంబడిక చేసికొని వెడలిపోయిరి.

## శాంతనుని జన్మము

గంగా (హరి) ద్వారమునందు ప్రతీప మహారాజు తపస్సు చేసి కొనుచుండెను. అప్పుడు గంగ మనోహరమైన మనుష్య స్త్రీ రూపముతో జలమునుండి బయలువెడలి విశాలమైన ఆరాజు తొడపైన గూర్చొనెను. ఆమెనుజూచి,

ప్రతీ :—కల్యాణీ! నీ కోరిక యేమి? తెలుపుము.

స్త్రీ :— రాజా! నీపై ప్రేమచే నిన్ను కోరియున్నదానను. కామవశముచేత వచ్చిన స్త్రీని సజ్జనులు విడువ కూడదు.

ప్రతీ :- కామినీ ! నేను కామవశముచేత పరస్త్రీని కోరను. ఇది నా నియమము.

స్త్రీ :- నేను అమంగళకరురాలను, నీకు అయోగ్యురాలను, కలంక పతిని కాను. నీయందు అనురాగముచే వచ్చిన దివ్య కన్యకను. కనుక నన్ను స్వీకరింపుము.

ప్రతీ :- అధర్మముగా సంచరించినచో నేను నశింతును. కనుక నిన్ను స్వీకరించ జాలను. ఇదిగాక, నీవువచ్చి నాకుడి తొడపైన కూర్చున్నావు. ఇది పుత్రులకు, కోడండ్రకు మాత్రమే కూర్చొనదగిన చోటు. ఎడమతొడయే భార్య కూర్చొన దగినది. కనుక నిన్ను భార్యగా గ్రహింప జాలను. నిన్ను నాకోడలిగా స్వీకరించెదను. నా పుత్రునికి భార్యవు కమ్ము.

స్త్రీ :- రాజా ! అలాగే కానిమ్ము. నీకు కోడలనై భరత వంశమును సేవించుచుండెదను. కాని, ఒక్క ఒడంబడిక పై నీపుత్రుని పెండ్లి చేసికొనెదను అది యేమనగా, నేను జేయు పనికి ఎప్పుడుగూడ నీకొడుకు అడ్డంకి చెప్ప కూడదు. ఈ నియమముతో అతనిని పెండ్లియాడి అతనికి ప్రియము చేసెదను. నాకు గలుగు పుత్రసంతతివలన నీ పుత్రునకు స్వర్గలోకప్రాప్తి కలుగును.

ఆ మాటకు ప్రతీపుని అంగీకారము తీసికొని గంగాదేవి అంతర్హితురాలయ్యెను.

పుత్రజన్మను కాంక్షించి ప్రతీపమహారాజు తనభార్యతో కలిసి తపస్సు చేయదొడగెను. ఆవృద్ధదంపతులకు మహాభిషుడు పుత్రుడుగా జనించెను. శాంతుడగు ప్రతీపునికి జనించి నందున ఆపుత్రునకు 'శాంతనుడు' అని పేరువచ్చెను. (అతడే శంతనుడు) అతడు పెరిగి విద్యాబుద్ధులు గలవాడై యౌవనవంతుడయ్యెను. ప్రతీపుడతనిని పిలిచి, "కుమారా ! నీవద్దకొక స్త్రీ వచ్చును. ఆమెను 'నీవెవతెవు ? ఎక్కడిదానవు ?' అని ప్రశ్నించక పెండ్లియాడి ఆమె యిష్టమునకు ఏమాత్రముగూడ వ్యతిరేకము లేకుండ మెలగుచుండుము. ఇది నేను ఆమె కిచ్చిన "వచనము" అని చెప్పెను.

ప్రతీపుడు పుత్రుని ఆదేశించి అతనిపైన రాజ్యభారము ఉంచి వానప్రస్థవృత్తిచే వనమునకు పోయెను. శాంతను డొకనాడు వేటకై వనమున కేగెను. అచ్చట గంగాతీరమునందు సంచరించుచు మనోహరరూపలావణ్యములు గలసుందరిని చూచి మోహించి నన్ను పెండ్లియాడుమని యామెను కోరెను. ఆమెయే గంగాదేవి. ఆమె తాను పూర్వము వసువులకు చేసిన ప్రతిజ్ఞను స్మరించి శాంతనునితో "రాజా ! నేను మంచి చేసినను, చెడ్డ చేసినను నాపనిని వారించకుండ ఉండుటకు నీవు అంగీకరించిన యెడల నీకు ప్రియురాలనై యుండెదను. అట్లు కానినాడు నిన్ను విడిచి పోయెదను. ఆమెకు శాంతనుడు అంగీకరించెను. ఆమె హర్షించి అతనితో రథమెక్కి పట్టణమునకు పోయెను.

ఆమెను పెండ్లియాడి శాంతనుడు సుఖముగా విహరించు చుండెను. ఆమెకు వసువులు పుత్రులుగా జనించిరి. ఒక్కొక్కరిని జనించినవెంటనే గంగాప్రవాహములో పారవేయు చుండెను. శాంతనుడు తన కిష్టము లేకున్నను, వారించినచో ఆమె తన్ను వీడి పోవు నని భయముచేత ఏమియు ననజాలకుండెను.

ఇట్లుండగ ఎనిమిదవ కొడుకు పుట్టగనే పూర్వము వలెనే ఆమె ఆశిశువునుగూడ గంగలో వేయ బోవుచుండగా శాంతనుడు సహించ లేదు. "ఓ రాక్షసీ ! నీ వెవరి బిడ్డవు, ఎవరవు ? ఎందుకు నీ కొడుకులనే చంపుచుంటివి ? నీకు పుత్రహత్యాపాపము అంట గలదు. ఈబాలకుని చంపకుము" అని అనెను. ఆ మాటకు ఆమె 'ఓరాజా ! నీవు పుత్రవంతులలో శ్రేష్ఠుడ వగుదువు కాని, మననియమము ప్రకారము నేనుమాత్రము ఇకపైన నీ వద్ద ఉండను. నన్ను నీవు నిరాకరించి నాపనిని నివారించితివి. నేను గంగను. దేవకార్యసిద్ధికొరకు నీవద్ద నివసించితిని. నీకు పుట్టినవారు అష్టవసువులు. వసిష్ఠ శాపముచేత మనుష్యులుగా పుట్టినారు. వారికి తండ్రి యగుటకు నీకంటెను, తల్లియగుటకు నాకంటెను అన్యులీభూలోకములో లేరు వారికి జననిగా నుండుటకే నేను మనుష్యస్త్రీగా వచ్చి మహారాజువైన నిన్ను పెండ్లియాడి వీరిని కంటిని. వసువులకు జనకుడ వగుటచేత నీకును అక్షయము లైనపుణ్యలోకములు ప్రాప్తించ గలవు. వసువులను, పుట్టినవారిని పుట్టినట్లు మనుష్యత్వమునుండి కాపాడి స్వర్గమునకు పంపుచుంటిని. ఇది దేవతలు నాతో చేసికొనిన ఒడంబడిక. ఇప్పుడు వసువులు 'ఆపవుని' శాపమునుండి విముక్తులైనారు. ఓ రాజా ! నీకు శుభము కలుగుగాక. ఈ యెనిమిదవకుమారుని జాగ్రత్తగా కాపాడుము ఇతడు ఎనిమిది వసువులఅంశములు కలవాడు. నీకొరకు వారిని అందరిని కోరి యితనిని ఆందరువసువులఅంశములతో నీకు సమర్పించినాను. కనుక ఇతనికి 'గంగాదత్తుడు' అని పేరువెట్టి పెంచుకొనుము. అని చెప్పెను.

## వసువుల శాప వృత్తాంతము

శాంత :- గంగే ! ఆపవుడనగా నెవడు ? అతడు వసువుల కేల శాప మిచ్చెను ? వారేమి పాపము చేసి మనుష్యులుగా జనించిరి ? ఈ యెనిమిదవ కుమారు డేమి చేసెను ? ఇతడు చాలకాలము భూలోకములో నుండ వలసినందుకు కారణ మేమి ?

గంగ :- పూర్వము వసిష్ఠుని వరుణదేవుడు తనకు పుత్రునిగా స్వీకరించెను గనుక వసిష్ఠునికి 'ఆపవు'డని పేరు. మేరు పర్వత ప్రాంతమునందు ఉన్న ఆవసిష్ఠునియాశ్రమము నందు, దక్షప్రజాపతికి పుత్రి యైనసురభికి కశ్యపునకు బిడ్డయై నివసించుచుండెను. ఆగోవు అన్నికోర్కెలు తీర్చునదై యుండెను. అది వసిష్ఠుని హోమధేనువు. దానిపేరు నందిని. ఆవనమున కొకప్పుడు 'పృథువు' మొదలగు అష్టవసువులు తమ భార్యలతో వచ్చి విహ

రించు చుండిరి. వారిలో నొకనిభార్య ఆగోవును చూచి దానిసౌందర్యమునకు ఆశ్చర్యపడి తనప్రియు డగు 'ద్యో' అను వసువునకు దానిని చూపెను. అతడు ఇది వరుణ పుత్రు డగువసిష్ఠుని హోమధేనువు. దీని క్షీరము పానము చేసిన మర్త్యులు పదివేల సంవత్సరములు స్థిరమైనయౌవనము కలవారై జీవింతురు. అని చెప్పెను. ఆ మాట విని ఆమె, "మనుష్యలోకములో 'ఉశీనరుడు' అనురాజర్షికూతురు 'జితవతి' యనునామె నాకు మిత్రురాలు ఉన్నది. ఆమె మంచిసౌందర్యవతి. ఈ గోవును మనము తీసికొని పోయి ఆమె కిచ్చినచో ఆమె దీనిపాలు త్రాగి చిరకాలము తారుణ్యముతో సుఖములను అనుభవించ గలదు. కనుక నీవు ఈగోవును, దాని దూడతో సహితముగా తెమ్ము." అని చెప్పగనే 'ద్యో' అనువసువు ఆమెకు ప్రియము చేయ గోరి 'పృథు' మొదలైన యితరవసువులను ప్రోత్సహించి వారిసహాయముతో ఆ గోవును అపహరించెను. కాని, వసిష్ఠమహాముని కోపమునకు పాత్రుడ నగుదు నని కించిత్తుగూడ అత డప్పుడు యోచించ లేదు. అప్పుడు వసిష్ఠుడు ఆశ్రమమునందు లేకుండెను. ఆతరువాత వనమునుండి తిరిగివచ్చి వసిష్ఠుడు ఆ గోవును, దూడను కానక వనమెల్ల వెతకెను. ఎక్కడను అది దొరక లేదు. దివ్యదృష్టితో కనుగొని క్రుద్ధుడై, 'మనుష్యలోకములో జనించుడు' అని ధరుడు మొదలగు అష్ట వసువులను శపించెను. వారు తిరిగి వసిష్ఠాశ్రమమునకు వచ్చి తాము శప్తులైనట్లు తెలిసికొని శాపమోక్షణమునకై ఆ మునిని ప్రార్థించిరి. అతడు కరుణించి మీరందరు మనుష్య లోకములో పుట్టిన వెంటనే శాపవిముక్తిని పొందుదురు. కాని, యీ అష్టమ వసువు 'ద్యో' (ప్రభాసుడు) అనువాడు కారణముగా మీరీ అకార్యమును చేసితిరి గనుక ఇతడు మాత్రము చాలకాలము మానవలోకములో నుండును. ఇతనికి సంతతి యుండదు. మహాధర్మాత్ముడు, సర్వశాస్త్రవిశారదుడు తండ్రికి ప్రియకరుడునై స్త్రీ భోగములను విడిచి యుండ గలడు." అని వారికి శాపాంతమును చెప్పి వెడలిపోయెను.

గంగాదేవి, తరువాతి వృత్తాంతమును శాంతనున కిట్లు చెప్పదొడగెను :—

"అట్లు వసిష్ఠునిచే శప్తులైనవసువులు నాకడకు వచ్చి 'మేము నీగర్భములో జనించెదము. పుట్టినవారిని పుట్టినట్లు మమ్ము జలములో పారవేయుము.' అని కోరిరి. వారికోరిక ప్రకారమే నేనట్లు చేసితిని. ఈ ఒక్కడుమాత్రము ముని శాపముచేత చాలకాలము మనుష్య లోకములో నుండ గలడు." అని చెప్పి గంగ ఆ యెనిమిదవపుత్రుని తనవెంట తీసికొని అంతర్ధానము చెందెను. అతడు యువకుడై విద్యాబుద్ధులు నేర్చువరకు తనవద్దనే యుంచుకొనెను. ఆ కుమారుడే దేవవ్రతుడు అను పేరుగల గాంగేయుడు. శాంతనుడు భార్యావియోగముచేత దుఃఖితుడై యుండెను.

## దేవవ్రతుని భీష్మప్రతిజ్ఞ

శాంతనుడు ధర్మప్రధానముగా రాజ్య మేలు చుండెను. అతనిశాసనములో దేశము సుభిక్షముగా నుండెను. ఇట్లు ముప్పదియేండ్లు భార్యారహితముగా నిష్ఠతో రాజ్య మేలెను. అతని పుత్రుడు దేవవ్రతుడు తండ్రితో సమానమైన రూపము సత్ప్రవర్తన విద్యాబుద్ధులు గలవాడై తల్లివద్ద పెరుగు చుండెను.

శాంతనుడు ఒకనాడు వేటకు పోయి గంగాతీరములో తిరుగుచు గంగానదిలో జలము చిన్నప్రవాహముగా పారు చుండుటను చూచి, దానికి కారణము తెలియ గోరు చుండెను. ఆసమయమున దేవవ్రతుడు తనబాణపరంపరచే గంగాప్రవాహమునకు సేతువు కట్టి దాని నాపి యుండుటను చూచి శాంతనుడు ఆ యువకుని మానవాతీతమైన బలశౌర్యాదులకు ఆశ్చర్యపడెను. ఇంతలో ఆయువకుడు అంతర్ధాన మందెను. అతనిని చూడ గోరి శాంతనుడు గంగ నడిగెను. గంగాదేవి మనుష్యరూపముతో సర్వాభరణభూషితయై కొడుకును వెంట బెట్టుకొని శాంతనుని కడకు వచ్చెను. అత డామెను గుర్తించ లేదు. అపు డామె తన సంగతి తెలిపి, ఆ కుమారుడే దేవవ్రతు డనియు, సకలవేద వేదాంగములందుదిట్ట యనియు, ధనుర్విద్యావిశారదు డనియు చెప్పి అతనిని శాంతనున కొప్పగించి గంగాదేవి వెడలిపోయెను.



శాంతనుడు దేవవ్రతుని వెంట బెట్టుకొని హస్తినాపురమునకు పోయి ప్రజలకు తెలిపి ఆకుమారుని యువరాజుగా చేసెను. ఇట్లు నాలుగువత్సరములు గడచెను.

(సశేషము)

# ఆంధ్రప్రదేశ్‌లో దేవాలయాలు

—ఎస్. రమేశన్

(గత సంచిక తరువాయి)

## ఆంధ్రప్రదేశ్‌లో దేవాలయాల పుట్టుక, పరిణామం

ఆంధ్రప్రదేశ్‌లోని దేవాలయాలు వాటి ఉత్సవాలు, వేడుకలు, నిర్మాణ కౌశలం మున్నగు వాటిలో శతాబ్దాల తరబడిగా వస్తున్న ప్రాచీన సంప్రదాయాలను, రీతులను పరిపోషించుకుంటూ ఈ నాటికీ అంతే వైభవంతో అలరారుతున్నాయి. కాబట్టి వీటిని గురించిన పరిశీలనను అవిచ్ఛిన్నంగా సాగించవచ్చు.

మౌర్య సామ్రాజ్యకాలంలో కళల అభివృద్ధికి ఆదరణ లభించి వాటి వికాసానికి దోహదం చేకూరింది. మౌర్యుల అనంతరం శాతవాహన లేక ఆంధ్ర సామ్రాజ్యం ఏర్పడింది. వీరి పరిపాలన తూర్పు సముద్రతీరం నుంచి పశ్చిమ సముద్రతీరం వరకు దక్కన్ ప్రాంతమంతటికీ విస్తరించింది. శాతవాహనులు సామ్రాజ్య విస్తరణలో ప్రసిద్ధులేకాకుండా గొప్ప కళాపోషకులు కూడా. వీరు మౌర్యుల సంప్రదాయాలను కొనసాగించారు. వీరి పోషకత్వం క్రింద ఆంధ్రప్రదేశ్‌లో దేవాలయాలు క్రీ. పూ. మూడవ శతాబ్దినుంచి క్రీ.శ. రెండవ శతాబ్దం వరకు సుమారు 450 సంవత్సరాలపాటు అభివృద్ధిజెందాయి.

శాతవాహనుల అనంతరం ఆంధ్రలోని వివిధ ప్రాంతాలలో అధికారాన్ని హస్తగతం చేసుకున్న విభిన్న పాలకులు కళల వికాసానికి చాలా తోడ్పడ్డారు. వీరిలో ప్రధానంగా పేర్కొనవలసినవారు ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు. ఆ తరువాతి వారు చాళుక్యులు.

ఆంధ్రప్రదేశ్‌లోని రాతి దేవాలయ నిర్మాణాలకు సంబంధించిన ప్రస్తుత సంప్రదాయాలు భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో వలెనే పూర్వపు కలప లేక ఇటుకసున్నం నిర్మాణాల తరువాతి దశవి అయినట్లు కనిపిస్తుంది. కాని దురదృష్టవశాత్తు వెనుకటి పద్ధతులకు సంబంధించిన కట్టడ నమూనాలు ఇప్పుడు చాలా వరకు జీర్ణించి పోయాయి. అయితే మిగిలివున్న కొన్ని అవశేషాలు ఆనాటి విశేషాలను సుస్పష్టంచేస్తున్నాయి. అవి వెనుకటి ఇటుక నిర్మాణ పద్ధతి ప్రాశస్త్యాన్ని బహిర్గతం చేయడమే కాకుండా దేవాలయ వాస్తు శాస్త్రపు పరిణామ సిద్ధాంతం అనే వాదాన్ని కూడా బద్దలు చేశాయి. క్రీ. శ. మూడు, నాలుగు శతాబ్దాలలోనే భారీ ఎత్తున పెద్దపెద్ద దేవాలయాలు నిర్మించబడినట్లు ఇవి వెల్లడి చేశాయి. నాగార్జునకొండ వద్ద త్రవ్వకాలలో ఇటీవల బయల్పడిన అవశేషాలే ఇందుకు నిదర్శనాలు.

## ఇక్ష్వాకుల కాలంలో నాగార్జున కొండలోని దేవాలయ కట్టడాలు

నాగార్జున కొండవద్ద ఇటీవల త్రవ్వకాలలో బయల్పడిన దేవాలయాలే ఆంధ్రప్రదేశ్‌లోని పురాతన దేవాలయాలైనట్లు తెలుస్తున్నది. నాగార్జునకొండ, ప్రాచీన అవశేషాల అమూల్య ఖని అయినట్లు పురావస్తు శాస్త్రజ్ఞుల కృషి నిరూపించింది. ఈ ప్రదేశం సుప్రసిద్ధ బౌద్ధకేంద్రం మాత్రమే కాదు, హైందవులకు కూడ అది ముఖ్య ప్రదేశంగానే భాసిల్లింది. ఇక్ష్వాకు రాజులు మత పోషకత్వంలో నిష్పాక్షికంగా ప్రవర్తించడమే ఇందుకు కారణం. ఇచ్చట లభించిన హిందూ దేవాలయాల అవశేషాలు, ఇతర శిలావిగ్రహాలు దక్షిణ దేశంలోని ప్రాచీన నిర్మాణాల క్రిందికి వస్తాయి. దేవాలయ వాస్తుశాస్త్ర పరిణామాన్ని పరిశీలించడానికి ఇవి అమూల్యమైనవి. ఇచ్చట వెలువడిన దేవాలయ అవశేషాలలో, శివపుష్పభద్రస్వామికి అంకితంచేసిన ఒక ఆలయం, మూడు కార్తికేయదేవాలయాలు, ఒక విష్ణుఅష్టభుజస్వామి ఆలయం, రెండు దేవీ ఆలయాలు, ఒక నవగ్రహాలయం వున్నాయి. కార్తికేయ ఆలయాన్ని బహుశః ఏలిశ్రీ స్థాపించి వుంటాడు. ఇచ్చట కార్తికేయ ఆలయాలు, విగ్రహాలు విరివిగా వుండడాన్ని బట్టి ఇక్ష్వాకుల కాలంలో కార్తికేయారాధన చాలా ప్రచారంలో

వున్నట్లు విశదమవుతున్నది. అష్టభుజస్వామి ఆలయంలోని ఒక శాసనంలో అష్టభుజస్వామి కొయ్య విగ్రహం ప్రతిష్ఠాపనను గూర్చివుంది. పుష్పభద్రస్వామి దేవాలయ నిర్మాణం పేర్కొనదగింది. ఇచ్చట వున్న ఒక సంస్కృత శాసనంలో పుష్పభద్రస్వామి అనే మహాదేవాలయనిర్మాణం, ధ్వజస్తంభ ప్రతిష్ఠాపనలను గురించీ, ఒక గ్రామాన్ని మాన్యంగా ఇవ్వడాన్ని గురించీ వ్రాసివుంది. ఇక్ష్వాకురాజు యెహువల శాంతమూల 16 వ సంవత్సరంలో ఈ శాసనం వ్రాయబడింది. దక్షిణ భారతంలోని ప్రాచీన ఆలయాలలో ఈ శివాలయం ఒకటి. బహుశః ఇది ధనురాకార పద్ధతిలో నిర్మించిన పురాతన శివాలయం. నవగ్రహ దేవాలయం, దేవాలయ వాస్తుశాస్త్రాన్ని అభ్యసిస్తున్నవారికి చాలా ముఖ్యమైనది. ఈ దేవాలయ ప్రాకారంలో వర్తులాకారంలోనూ, చతురస్రాకారంలోనూ, ధనురాకారంలోనూ మందిరాలువుంటాయి. మధ్యయుగం, ఆ తరువాతి కాలాలలో దక్షిణ భారతంలోని భారీ దేవాలయ కట్టడాలలోని ముఖ్యలక్షణాలన్నీ దీనిలో కన్పిస్తాయి. సుమారుగా క్రీ. శ. మూడవ శతాబ్దానికి చెందిన ఈ దేవాలయం దక్షిణాదిలోని దేవాలయకట్టడాలలో ఒకటి కావడమేకాక పరిణామ సిద్ధాంతాన్నికూడా పూర్తిగా భగ్నంచేస్తున్నది దక్షిణ భారతంలో దేవాలయనిర్మాణం బహుశః అంతరాలయం లేక అర్ధమంటపంతో కూడిన గర్భగృహంతో చిన్నఎత్తున ప్రారంభించి అనేకమంటపాలు, ప్రాకారాలు, ఉప ఆలయాలతో కూడిన భారీ కట్టడాలుగా అభివృద్ధిజెంది దేవాలయ నగరాలుగా కూడా పెంపొందినట్లు ఈ సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నది. దక్షిణాదిలో ప్రాకారాలు, ఉప ఆలయాలు, ఇంకా ఇటువంటి ఇతర విభాగాలతో కూడిన దేవాలయ నిర్మాణ పద్ధతి చాలా పూర్వకాలంలో కూడా ఆచరణలో వున్నట్లుగా నవగ్రహ ఆలయం నిరూపిస్తుంది.

నాగార్జున కొండవద్ద విరివిగా లభించిన క్రీ. శ. రెండవ శతాబ్దంనాటి సున్నపురాతి లింగాలవల్లకూడా దక్షిణాదిలో లింగమతవ్యాప్తికి సంబంధించిన ఆధారాలు లభిస్తున్నాయి. సాహిత్యంలో పూర్వపు ప్రస్తావనలు వున్నప్పటికీ దక్షిణ దేశంలోని ఆనాటి లింగాల అవశేషాలు ఇప్పటికీ ఎక్కువగా లభ్యం కాలేదు. గుడిమల్లంలోని శివలింగం పురాతన లింగాలలో ఒకటి. ఇది అయిదు అడుగుల ఎత్తునవుంది. ఇది క్రీ. పూ. రెండవ శతాబ్దినాటిదైనట్లు గోపీనాథరావు పేర్కొన్నారు. కాగా కుమారస్వామి మరోశతాబ్దకాలాన్ని తక్కువగా పేర్కొన్నారు. లింగోద్భవమూర్తి, ముఖలింగ నమూనాలు వాస్తవానికి గుడిమల్లం శిల్పనమూనాలకు అనుకరణలు.

## ఇక్ష్వాకుల తరువాతికాలం

ఇక్ష్వాకుల తరువాత పరిపాలించిన వివిధరాజ వంశస్థులలో ఆంధ్ర కళలు ముఖ్యంగా దేవాలయ వాస్తు శాస్త్రం ప్రవర్థిల్లడానికి దోహదంచేసిన వారిలో పేర్కొనవలసినవారు తూర్పు చాళుక్యులు. బాదామీ, ఐహోలు కళా పద్ధతులు ఒక ప్రక్క ఆంధ్ర మరొక ప్రక్క పల్లవుల కళా రీతులను జోడిస్తాయి. బాదామీ గుహాలలోని శిలావిగ్రహాలు ఐహోలు చక్కడాలు సుమారుగా క్రీ. శ. 6 శతాబ్దికి చెందినవి. బాదామిలోని అనంతసాయి విష్ణు, నృసింహ, మహిషమర్ధని ఇంకా కొన్ని ఇతరచక్కడాలు దక్షిణాపథంలోని ఇటువంటి ప్రాచీనశిలా విగ్రహాలలో కొన్ని ప్రధాన దేవతల శరీరాలు భారీగా, సంపూర్ణంగా నిర్మించబడినవి.



లేపాక్షి

తూర్పు చాళుక్యుల పతనానంతరం విజయాలయచోళులు ప్రఖ్యాతిలోనికి వచ్చిన తరువాతగట్టి శిలలపై నిర్మాణం జరిపే పద్ధతికి ప్రోత్సాహం లభించింది. ఆ తరువాత మూడు శతాబ్దాల పాటు ఈ విధానం బాగా అభివృద్ధిజెంది క్రొత్త అందాలు సంతరించుకున్నది. ఆంధ్ర దేవాలయ నిర్మాణ పద్ధతిపైకూడా దీని ప్రభావం పడింది. మధ్యయుగంలో ఆంధ్రలో చాళుక్యుల అనంతరపు దేవాలయ నిర్మాణ పద్ధతి బాగా ప్రచారంలో వుంది. ఈ దేవాలయాల ప్రాతిపదిక ద్రావిడ పద్ధతికి చెందినప్పటికీ పనివారలు తమ ఆదర్శాలకు అనుగుణ్యంగా దాక్షిణాత్యరీతులకు చేర్పులు కూర్పులు చేశారనే సాధారణ భావనను ఇవి కలిగిస్తాయి. వారు నిర్మించినది నిజానికి వాస్తుకళకాదు. ప్రయోగకళ మాత్రమే. మూర్తులను తీర్చిదిద్దినట్లుగా తొలచడంలో కొయ్యప్రతిమలను పోలిన పనితనం ప్రదర్శితమవుతుంది. కొయ్య విగ్రహాల నిర్మాణంలో ఇప్పటికీ మైసూరు కళాకారులది పెట్టింది పేరు. ఈ వాస్తు పద్ధతికి చెందిన ప్రసిద్ధ దేవాలయం హాలబిడ్‌లోని హోయసలేశ్వర ఆలయం. ఈ నిర్మాణ విధానం అమలు జరిగిన ప్రాంతం ఆంధ్ర హద్దులనుంచి దూరంగా వున్నప్పటికీ దత్తమండలాలలోని తాడిపత్రివంటి అనేక దేవాలయాలలో ఇప్పటికీ వీటి నమూనాలు కనిపిస్తాయి.



సింహాచల దేవాలయం

పద్నాలుగవ శతాబ్దిమధ్య భాగంలో మహమ్మదీయ దాడులు జరిగి పరిస్థితులు కుదుటపడిన పిమ్మట దక్షిణభారతాన్ని విజయనగర రాజులు పరిపాలించారు. వారు దక్షిణ దేశ దేవాలయ నిర్మాణ పద్ధతులను పరిపోషించడమేకాకుండా సుస్థాపితమైనటువంటి ప్రాచీన సంప్రదాయాలను, విధానాలను కొనసాగించడానికి, ప్రోత్సహించడానికి కూడా ప్రయత్నించారు. విజయనగర వాస్తుశాస్త్రం శిల్పకళకూ, శృంగారానికీ ప్రసిద్ధిచెందింది. దేవాలయాలకు అనేక కల్యాణమంటపాలను, నూరు లేక వెయ్యి స్తంభాలతో కూడిన మందిరాలను చేర్చేడివారు. స్తంభాలు విభిన్న నమూనాలలో వుండేవి. దేవాలయాలకు అనేక గోపురాలను చేర్చడం కొనసాగింది. కంచిలోని ఏకాంబరనాథుని దక్షిణ గోపురం, తిరువణ్ణామలై, కాళహస్తిలలోని గోపురాలు మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. విజయనగరంలోని విఠల, పట్టాభిరామ దేవాలయాలు వెల్లూరు, తాడిప్రతి దేవాలయాలు విజయ నగర వాస్తు పద్ధతిని ప్రతిబింబింపజేసే చక్కటి నమూనాలు.

## దేవాలయాల మత ప్రభావం

వాస్తు, పురావస్తు శాస్త్రాల దృష్ట్యా దేవాలయాలు అమూల్యమైనవి కావడమే కాకుండా దేశ ప్రజల జీవన పద్ధతులకు, ఆలోచనలకు ఆకృతి కల్పించడంలో కూడా విలువైన పాత్ర వహిస్తున్నాయి.

దేవాలయావరణలోనికి ప్రవేశించగానే భక్తులు పవిత్ర భావాన్ని పొందే విధంగా దేవాలయాలు నిర్మించబడి అలంకరింపబడతాయి. గర్భగృహం సాధారణంగా మసక చీకటిగా వుంటుంది. అచ్చట స్వామి మూర్తి తప్ప ఇతర శిల్పాలు వుండవు. ఇందువల్ల భక్తులు స్వామిపైననే తమ దృష్టిని నిలిపి ఏకాగ్రత సాధించగలుగుతారు.

దేవాలయ ముఖద్వారం విశ్వానికీ, లోపలిభాగంలోని దైవ విగ్రహం పరమాత్మకూ చిహ్నాలని ఒక సంప్రదాయం. వైష్ణవ సంప్రదాయం ప్రకారం తెలుపు, ఎరుపు, నలుపు మూడు రంగులుగల ఒకతెర యెప్పుడు దైవ విగ్రహంముందు ఉంటుంది. ఈ మూడు రంగులు సత్వ, రజ, తమోగుణములకు ప్రాతినిధ్యం వహిస్తాయి. ఈ గుణముల తెర తొలగించినప్పుడు దైవ విగ్రహ దర్శనమవుతుంది. మరో సంప్రదాయం ప్రకారం దేవాలయం మానవ శరీరంవంటిది. కేంద్రంలో జీవునితో సంచరించే భగవదాలయంగా దీనిని భావిస్తారు. దేవాలయం ఉపరితలం, శిరస్సు; గర్భగృహం, కంఠం; ముందు మంటపం, ఉదరం; ప్రాకారపు గోడలు, కాళ్లు; గోపురంపాదాలు; దైవం, శరీరంలోని





వేయి స్తంభాల దేవాలయం

జీవుడు. ఈ విధంగా దేవాలయంలోని ప్రతిభాగం భగవంతుని శరీరంలోని భాగంగా పవిత్రంగా చూస్తారు. దేవాలయాల చరిత్రలలో దేవాలయాలనుగూర్చిన పైభావనలు వర్ణించబడినాయి. మరోభావన — దేవాలయాన్ని పుష్పంతోకూడిన తామరకొలనుతో



శ్రీశైలం దేవాలయంలోని నంది



మహానంది

పోల్చినారు. విమానాన్ని తటాకంలోని నిరుగాను; ధృవమూర్తిని కమలం కాండమూలంగాను; సంబంధకుర్చ కమలం కాండంగాను; కౌతకమూర్తిని కమలంగాను; యీ విధంగా దేవాలయాన్ని కమలాలయంగా వర్ణించారు.

దేవాలయాలలో సాధారణంగా రెండు విగ్రహాలుఉంటాయి. గర్భాలయంలో శాశ్వతంగా ఉండే మూల విగ్రహం; రెండవది ఊరేగింపులు మొదలైనవాటిలో ప్రదర్శితమయ్యే ఉత్సవవిగ్రహాలు. కొన్ని దేవాలయాలలో అభిషేకం, ఉత్సవం మొదలైనవాటికి వివిధ విగ్రహాలు ఉంటాయి. శైవుల సిద్ధాంతంప్రకారం మూల విగ్రహం, సూక్ష్మ లింగమనీ, బలి విగ్రహం బలి లింగమనీ అంటారు. దేవాలయాలలో పూజాదికాలకు అనుసరించే వైఖానస ఆగమ శాస్త్రం ప్రకారం పరమాత్మను, విష్ణు, పురుష, సత్య, అచ్యుత, అనిరుద్ధ అని ఐదు 'వ్యూహాలు' గా విభజించారు. ఈ ఐదు అంశాలను మూలబెర, కౌతుకబెరల, ఉత్సవబెర, స్వప్నబెర, బలిబెరలని వివిధ విగ్రహాలను ప్రతిష్ఠించారు. లోకకల్యాణానికి మూలబెరను, వ్యక్తిగత ప్రయోజనాల నిమిత్తం కౌతుకబెరను, ఊరేగింపులకు ఉత్సవబెరను, అభిషేకానికి స్వప్నబెరను, ముడుపులకు బలిబెరను పూజించడం జరుగుతున్నది. ఆకార నిరాకార రూపాలలో భగవంతునికి ద్వివిధ అంశాలు ఉంటాయనీ, ఈ అంశాన్ని నిరంతరం మనస్సులో ఉంచడానికి ముఖ్యమార్గం హిందూ దేవాలయం చిహ్నమని [illegible] బోధిస్తుంది.

## స్థల పురాణాలు

దాదాపు అన్ని దేవాలయాలకు స్థల పురాణాలు ఉన్నాయి. పవిత్ర గ్రంథాలలోని అంశాలను వాటిలో తగిన విధంగా స్పష్టమైన వివరణలతో పొందుపర్చారు. స్థానిక ప్రదేశాల చరిత్ర దేవాలయాల చరిత్ర, ఆ దేవాలయాల నిర్మాణానికి మూలకారణమైన పురాణ ఇతిహాసాలు, మొదలైనవి అందులో మనకు లభిస్తాయి. దేవాలయాలు, యాత్రా స్థలాల ఐతిహాసిక చరిత్రలుగా వాటిని పేర్కొనవచ్చు. ఏ పరిస్థితులలో యీ ప్రదేశం పవిత్రతను సంతరించుకున్నదీ, ప్రథమ దేవాలయం నిర్మాణం, దేవతలు, దేవుళ్లను పూజించిన వివిధ రాజవంశాలకు చెందిన



ఆలంపురం దేవాలయాలు

రాజుల వివరాలు, నేటి కాలంలో జరిగిన పునరుద్ధరణలు మొదలైన విషయాలను యీ స్థల పురాణాలు అభివర్ణించాయి. దేవాలయాలకు సంబంధించిన పురాతన చరిత్ర ముఖ్య అంశాలను స్థల పురాణాలు లేక స్థల మహాత్మ్యం వివరిస్తాయి. దీనికి తోడు వివిధ హిందూరాజులు దేవాలయాలకు సమర్పించుకున్న కానుకల వివరాలు చెక్కబడిన శిలాఫలకాలు దేవాలయాలలో లభిస్తాయి. దేవాలయాలకు చెందిన అమూల్యమైన చారిత్రక అంశాలుకూడ వీటివల్ల మనకు లభిస్తాయి.

## ఆంధ్రప్రదేశ్‌లోని ముఖ్య దేవాలయాల వివరణ

ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని ప్రముఖ దేవాలయాల సంక్షిప్త చరిత్రను పరిశీలిద్దాము:

శ్రీశైలం.—కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలుకా తూర్పు భాగంలో నల్లమలై కొండలలో దూరరాని దట్టమైన అడవులలో శ్రీ మల్లికార్జునస్వామి దేవాలయం వెలసింది. ఆదిశంకరులు దీనినిగూర్చి ప్రస్తావించారు. వీరశైవులకుకూడ యిది ప్రముఖ పీఠం. చెంచు గిరిజనులకు ఇది సంప్రదాయకమైన దేవాలయం. "చెంచుమల్లయ్య" దేవుడుగా వారు వ్యవరిస్తూ పూజిస్తారు.

అహోబిలం : కర్నూలుజిల్లాలోని మరో ప్రఖ్యాత దేవాలయం లక్ష్మీనరసింహస్వామి దేవాలయం. "అహోబిలంజియ్యర్ల" కు ప్రముఖస్థానం. వారిభక్తులకు అధ్యాత్మిక గురువులు. తుంగభద్ర కృష్ణానదుల పవిత్ర సంగమస్థలమైన ఆలంపురంలో సంగమేశ్వర, నవబ్రహ్మవంటి అనేక పవిత్ర దేవాలయాలు ఉన్నాయి ఇవి కళానిధులు. హిందూపురానికి తూర్పున 9 మైళ్ళ దూరంలో విజయనగర నిర్మాణపద్ధతికి ఉదాహరణమైన లేపాక్షి దేవాలయం ఉన్నది. కూర్మశైలకొండల అడుగుభాగంలో ఇది నిర్మించబడింది. ఇక్కడి పేయింటింగులు చాలా ప్రసిద్ధములైనవి. విజయనగర పేయింటింగులకు ఇవిప్రతీకలు. గుంతకల్లుకు 47 మైళ్ళ దూరంలోని తాడిపత్రి (అనంతపురంజిల్లా) లో రామలింగేశ్వరస్వామి దేవాలయం ఉన్నది. ఇక్కడి ప్రాకారపు రాళ్ళపై శివపురాణమంతా చెక్కబడిఉన్నది. కర్నూలుజిల్లా నంద్యాల సమీపంలోని తూర్పు కనమలలో మహానంది దేవాలయంఉన్నది,



రామప్ప దేవాలయం

భారతదేశంలోని దేవాలయములన్నిటిలోను ఆంధ్రప్రదేశ్‌లోని అతి ప్రఖ్యాతమైన దేవాలయం శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయం తిరుపతిలో ఉన్నది. ఉత్తరాది ప్రజలు బాలాజీగా వ్యవహరిస్తారు. తిరుపతి రైల్వేస్టేషన్‌కు 7 మైళ్ళదూరంలో శేషాచలం కొండల మధ్య యీ పవిత్ర దేవాలయం వెలసింది. ఈ కొండలు ఆదిశేషుని శరీరంగా పురాణాలు పర్ణించాయి. తిరుపతికి సమీపంలో పవిత్ర యాత్రాస్థలమైన కాళహస్తి ఉన్నది. భగవంతునికి తన కన్నును కానుకగా సమర్పించిన పరమభక్తుడు కన్నప్ప జ్ఞాపక చిహ్నంగా కన్నంబేశ్వర దేవాలయం ఇక్కడఉన్నది. గుంటూరు జిల్లా నర్సారావుపేట తాలుకాలోని చేజెర్లలో కపోతేశ్వరస్వామి దేవాలయం ఉన్నది. మహాభారత శిబిచక్రవర్తి కథకు ఉత్పన్నం యిది ప్రతీతి. ఆంధ్రదేశంలోని అతిపురాతన దేవాలయాలలో ఇది ఒకటి. దేవాలయ శిల్ప నిర్మాణ కళదృష్ట్యా ఇది చాలా ప్రాముఖ్యం వహిస్తుంది, నగర, వేసర, ద్రావిడ కట్టడాల పద్ధతిలోకాక అర్ధచంద్రాకృతిలో నిర్మించబడింది. వాస్తుశాస్త్రంలో దీనిని 'హస్తిప్రష్ఠ'లో భాగంగా విభజించారు, ఆనందగోత్ర రాజులలో ... కాంధారరాజు పుత్రిక ఆపనిత లంతావతి కుమారుడు ... యొక్క ప్రఖ్యాత శిలాశాసనం ఈ దేవాలయంలో ఉన్నది. క్రీ॥ శ॥ 4 లేక 5వ శతాబ్దిలో కాంధారవంశపు రాజులు పాలించారు. క్రీ॥ శ॥ 5వ శతాబ్దినుండి యీ దేవాలయంఉన్నట్టు యీ శాసనంవల్ల తెలుస్తుంది.



పానగల్లు దేవాలయం (నల్లగొండజిలా)

ప్లాస్టిక్ కళానైపుణ్యములో ప్రపంచ ప్రసిద్ధిగాంచిన అమరావతి, ప్రముఖ దేవాలయములో ఒకటిగా కూడా ప్రఖ్యాతి వహించింది. దీనిని అమరేశ్వర దేవాలయం అని కూడ అంటారు. కృష్ణానది ఉత్తర వాహిని తీరంలో యీ దేవాలయం ఉన్నది. విజయవాడకు 8 మైళ్ల దూరంలో ఉన్న మంగళగిరిలో పానకాల నరసింహస్వామి దేవాలయం ఉన్నది. ఆ స్వామికి పానకంతో అభిషేకం జరుగుతుంది. తూర్పు గోదావరి జిల్లా ద్రాక్షారామంలో చాళుక్య, చోళ శిల్ప సంప్రదాయాల సమ్మేళనం కనిపిస్తుంది. ఈ దేవాలయం గోడలపై చక్కడాలు ఆంధ్రలోని అన్ని దేవా



అహోబిల నరసింహస్వామి

లయాలకన్నా విశిష్టమైనవి. 1002 శకం (క్రీ. శ. 1080) నుండి 1356 శకం (క్రీ. శ. 1434) వరకు సంబంధించిన 381 శిలా శాసనాలు ఉన్నాయి. శ్రీకాకుళం జిల్లా అరసవెల్లిలో-సూర్యభగవానుని దేవాలయముంది. శ్రీకూర్మంలో విష్ణు యొక్క కూర్మావతారానికి సంబంధించి శ్రీ కూర్మేశ్వరస్వామిని పూజిస్తారు అదే జిల్లాలో [illegible] ప్రముఖ దేవాలయం. ముఖలింగం [illegible]. దేవాలయ కట్టడాల సంప్రదాయంలో ఇవి ఒరిస్సా పద్ధతి నిర్మాణానికి మచ్చుతునకగా భావించబడుతున్నది. గోదావరి జిల్లా ఏజన్సీ ప్రాంతంలో భద్రాచలం. భక్త రామదాసు స్మృతి ఫలితంగా పవిత్రమైంది. హైదరాబాదుకు 40 మైళ్ల దూరంలో యాదగిరి (నల్లగొండ జిల్లా) లో ప్రసిద్ధ దేవాలయం ఉంది. కరీంనగర్ జిల్లాలోని, వేములవాడ, ధర్మపురిలలో పురాతన దేవాలయాలు ఉన్నాయి. ఈ దేవాలయాలలో పూజించబడే దేవతలు అనేకమంది ఉన్నారు. హిందువులకు చెందిన దేవుళ్లు అందరకు స్థానం కల్పించబడింది.

ఆంధ్రలో లింగరూపంలోను, యితరరూపాలలోను శివుణ్ణి, విష్ణువును, గణపతి, సుబ్రహ్మణ్యం, భగవతి, దుర్గదేవతలను వివిధ దేవాలయాలలో పూజిస్తారు. ఇటీవల నాగార్జున





జగన్మోహిని దేవాలయం

కొంత త్రవ్వకాలలో పుష్పభద్రస్వామి ఆలయం, ధ్వజస్తంభంతో సహా బయటపడింది. ఈ దేవాలయం శివునికి అంకితమైంది. భారతదేశంలోని అతి ప్రాచీనమైన దేవాలయంగా ఇది భావించబడుతున్నది. ఈ విధంగా ఆంధ్రదేశంలో ఎన్నో దేవాలయాలు, శిల్పాలు ఉన్నాయి. అంతేగాక వివిధ దేవాలయ కట్టడ సంప్రదాయాలు ఇక్కడ గోచరిస్తాయి. అతి పురాతన పద్ధతినుండి ఆధునిక పద్ధతి చెందిన నిర్మాణ సంప్రదాయాల సమ్మేళనం యీ కట్టడాలలో కనిపిస్తుంది.

సమాజజీవితం దేవాలయాలతో ముడిపడి ఉంది. దేవాలయాల మంటపాలపై పురాణాలు, ఇతిహాసాల వివరాలు ఉన్నాయి. ధర్మశాస్త్రాలను కూడ విపులంగా వివరించారు. కొన్ని దేవాలయాల రంగమంటపాలపై సంగీతం, నృత్యాలకు ప్రారంభోత్సవం చేసేవారు. దేవాలయాలలో రాజులు తులాభారం, హిరణ్యదానం చేశారు. భక్తిగీతాలు, మంత్రాలు ప్రబోధించే విద్యాసంస్థలుగా దేవాలయాలు వ్యవహరించాయి. 'రథోత్సవం', 'వసంతోత్సవం' మొదలైన వివిధ ఉత్సవాలతో సంవత్సరంపొడుగునా ఉత్సవాలు జరుగుతాయి. ప్రజలు సామూహికంగా కలిసి సాంఘిక కార్యక్రమాలు నిర్వహించే అవకాశం యీ ఉత్సవాలు కల్పిస్తాయి. కొన్ని దేవాలయాలలో దైవాన్ని, పరిపాలన నిర్వహించే రాజుగా భావిస్తారు. అందువల్ల రాజలాంఛనాలు జరుపుతారు. ఉదాహరణకు తిరుపతి దేవాలయంలో స్వామివారికి ప్రతిరోజు పంచాంగ శ్రవణం జరుపుతారు. రాజస్వామికి మాదిరిగా ఆదాయవ్యయ పట్టికలను సమర్పిస్తారు. ఈ విధంగా ప్రపంచంలో ఎక్కడాలేనివిధంగా మనదేశంలో దేవాలయాలు అపూర్వ సంస్థలుగా నిర్వహించబడుతున్నాయి. దేవాలయం నాభిస్థానంగా సమాజ జీవితం నిర్మించబడింది. మతం ప్రాతిపదికగా భారతీయ జీవితం విలసిల్లుతున్నది. ఇక్కడ ఏ ప్రాంతంలోలేని జీవన వైవిధ్యం కనిపిస్తుంది. యోగి కుండలినీ సాధనకు; జీవన్ముక్తుడు దైవసాన్నిధ్యానికీ; సంగీత, నాట్యవేత్తలు తమ కళలను దైవపరం చేయడానికీ; భక్తుడు దైవారాధనంలో లీనమవడానికీ; గృహస్థులు తమ కష్టసుఖాలను స్వామికి నివేదించుకుని వాటి విముక్తిని కోరడానికీ; రోగి తన ఆరోగ్యానికీ; ఆరోగ్యవంతులు, ఐశ్వర్యానికీ; ఐశ్వర్యవంతులు అధికారం ఆర్జించడానికీ; రాజులు శాంతిని కాంక్షిస్తూ సన్న్యాసం స్వీకరించడానికీ; సన్న్యసించిన యోగులు లోకకల్యాణానికీ; యీ విధంగా సర్వజనులు దేవాలయాలను సందర్శిస్తూ దైవధ్యానంలో నిమగ్నులవుతుంటారు. సమాజ జీవితానికి దేవాలయం జ్ఞాననిధి వంటిది. ఈ విజ్ఞానం లేని వారికి జీవితం అసంపూర్ణమైంది.

వివిధ దేవుళ్లకు చెందిన దేవాలయాలతో ఆంధ్రదేశం అలరారుతున్నది. భారతదేశంలోని దేవాలయాలు, ఇతిహాసాలలో భాగంగా ఆంధ్రదేశ దేవాలయాలు, ఇతిహాసాలు, హిందూ భక్తులకు అమూల్య సంపదగా విరాజిల్లుతున్నవి. ★



భీమేశ్వర దేవాలయం, ద్రాక్షారామం



కనకదుర్గ దేవాలయం, విజయవాడ

# కామినీ కాంచనాలు

—'సరస్వతి'

కామినీ కాంచనాలను సరి అయిన విధంలో చూడకపోతే మానవుడు దెబ్బతింటాడు. అతని సహచరి అయిన మానవికీ ఇందులో బాధ్యత ఉన్నది.

ఇంటి యజమాని యిల్లు స్వర్గంగా చేసుకోవడానికి కొన్ని నియమాలు పాటించాలి. దైనందిన కర్మలు నిర్విఘ్నంగా, ప్రశాంతంగా సాగాలంటే డబ్బు అవసరం. అది మానవుడు ఆర్జించుకోవాలి. కర్మలు ఆచరిస్తూ, కర్మ ఫలం భగవంతుని పాదాలముందు నివేదించుకుంటే మనం ఈ భవ సాగరంనుంచి విముక్తులం అవుతాము. ఆ పరమేశ్వరునిలో విలీనం చెందడానికే మన ఈ సాధనఅంతా.

స్త్రీని ఒక దేవతగా ఆరాధించుకునే వాడు మానవుడు. ఆమె ప్రకృతి, తాను పురుషుడు. ఒకరి ఆరాధనలో ఒకరికి ఆ అవ్యయ సుఖం ఉంది. శారదా రామకృష్ణులు ఈ ఆరాధనలోనే ఆ స్వామిని దర్శించారు. పురుషుడు తాను ఆరాధించే స్త్రీని అలంకరిస్తాడు. ఈ అలంకరణతోనే ఆమెకి నగలు అమిరాయి.

ఆకులు వస్త్రాలుగా ధరించే యుగంలో పువ్వులు కర్ణాభరణాలుగా ధరించేవారు. పూలమాలలు కంకణాలుగా, హారాలుగా సువాసనలు వెదజల్లేవి. ప్రబంధ యుగంలోని విరహి జనులు పూలపాన్పులు, పూలమాలలు, తాపోపశమనానికిఉపయోగించడం కావ్యాలలో చదువుతున్నాం.

ఇవే కాలానుగుణంగా, లోహయుగంలో, లోహాలతో చేసుకునేవారు. అదే ఈనాటికీ మిగిలిపోయింది. నగలు లోహంతో చెయ్యడం మొదలుపెట్టాక, అవి ఒక్క అలంకరణకే కాకుండా, స్త్రీధనంగా కూడా ఉండేవి, అవసరం వచ్చినప్పుడు ఆ ధనం వాడుకోవానికి.

మానవుడు తన వివేకాన్ని సద్వినియోగం చేసుకోవడం మరచిపోతున్నాడు ఈనాడు. అది మన దురదృష్టం. దానికి కారణం ఈనాడు అతనికి ఉన్న బహుముఖ ప్రజ్ఞలు. అందరికీ క్రీడలు, సంగీతం, సాహిత్యం, సైన్సు, చిత్రలేఖనం,... 64 విద్యలూ రావాలని ఆశ అయితే ఉన్నది. ఇది మనయుగ ధర్మం. కాని మనం దాన్ని సరిగా సాధించడంలేదు. క్రికెట్టు వ్యామోహంలో పడిపోయి కుటుంబం బాధ్యతలు మరచి, ఆ కుటుంబాన్ని కష్టాలపాలు చేసినవారు మనకు ఎంతోమంది కనిపిస్తున్నారు.

స్త్రీకి ఈనాడు పురుషునితోపాటు స్థిర చరాస్తులు ఉండే హక్కు ఉంది. ఇంక ఆ ఆస్తి బంగారంలోనే ఉండాలని ఏమీ అవసరం లేదుకదా మరి. అయినా మనం బంగారు నగలలోనే మన సర్వస్వమూ ఉందనే వ్యామోహంలోంచి బయటపడలేకుండా ఉన్నాం. ఇంకా ఈ వ్యామోహాలన్నీ మనకు ఎందుకు కలుగు తున్నాయి ? మన ధర్మం మనం విస్మరించడం వల్లనే.

స్త్రీధనంగా బంగారాన్ని పరిగణించే రోజుల్లో ఆమె బంగారు నగల్లో అలంకరించుకోవడంలో అందమూ, ఆనందమూ ఉన్నాయి. ఈనాడు దేశం జనాభా పెరిగిపోయింది. దేశాభివృద్ధికే బోలెడు బంగారం కావాలి. ఇంక మనదేశం మనకు నగలకు ఇచ్చే బంగారం శాతం చాలా తక్కువఉండాలి మరి మనం ఇప్పుడూ బంగారు నగలలో అలంకరణ చేసుకుంటాం అంటే ఎంత అవివేకం. పూజకోసం ఏర్పడిన అలంకరణ—పూజపోయినా—ఉత్త ఆడంబరమయిన అలంకరణగా మిగిలిపోయింది. మనలో ఉన్న అజ్ఞానమంతా ఇదే—గడచిన యుగాల ధర్మాలు కూడా మనం పాటించడం. ఏ యుగంలోనో బంగారం స్త్రీధనం, ఇప్పుడుకాదు. ఇది మనం చూడలేకుండా ఉన్నాం.

దంపతులందరూ సుగాత్రీ శాలీనులకు మల్లే ఉంటే ఎంత బాగుంటుంది. శాలీనునికి తన ధర్మపత్ని ఏ అలంకారాలూ లేకుండా తనతోపాటు తోటపని చేస్తున్నప్పుడు మహాయిష్టం.

'కనిపెంచే తల్లికి పిల్లభారమా; నారుపోసిన వాడు నీరు పొయ్యడా? అనే సూక్తులు ఈ నాడు మనకు నచ్చవు. ఇది మనం గుర్తించ లేకపోతున్నాం. అందుకే మన గవర్నమెంటు వారు కుటుంబ నియంత్రణ క్రింద ఇంత ఖర్చు చేయాల్సి వస్తున్నది. గాంధీగారు చెప్పిన బ్రహ్మచర్యం అవలంబిస్తే ఈ డబ్బు మనం ఇంకదేనికయినా వాడుకునే వారంకదా.

బాపూజీ బ్రహ్మచర్య వ్రతం మాకు చాలా ఇష్టం. 'సంతానం కావాలన్నప్పుడే దంపతులు కలియడం ఒక పవిత్రమైన కర్మకాండ. ఇదే బృహదారణ్యక ఉపనిషత్తులో కూడా ఉంది. స్త్రీని మాతృమూర్తిగా చూడగలిగిన నాడు పురుషునికి వ్యామోహం ఉండదు. ఆమెలో ఆ పరమేశ్వరిని చూచిన మానవుడు ధన్యుడు అంటారు బాపూజీ.

ఈ బ్రహ్మచర్యం సాంఘిక ఆచారంగా గుర్తించిన నాడు మనకు ఏకొరతా ఉండదు. అందువల్లనే ఈ దారిద్ర్యం. ఇదే అన్ని అనర్థాలకు దారితీస్తుంది. మన పూర్వులు హాయిగా బ్రతికారంటే—వారు బ్రహ్మచర్యాన్ని నిష్ఠగా పాలించేవారు

మన సంస్కృతి చాలా గొప్పది. దాన్ని మన యుగానికి సరిపోయే విధంగా చిన్న చిన్న మార్పులతో గ్రహిస్తే బాగుంటుంది. మనం ఏదిచేసినా ఆ స్వామిని చేరుకోవడానికే.

సర్వేజనాః సుఖినో భవంతు' శుభం భూయాత్. ★

నగరంలో రాష్ట్రపతి

# వార్తా చిత్రాలు



నవంబరు 12న నగరానికి విచ్చేసిన భారత రాష్ట్రపతి డా॥ ఎస్. రాధాకృష్ణన్‌కు బేగంపేట విమానాశ్రయం వద్ద గవర్నరు, రాష్ట్ర ముఖ్యమంత్రి, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, ఇతరులు స్వాగతమిస్తున్న దృశ్యం.



భారతరత్న శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య కాంస్య విగ్రహం.



హైదరాబాదులో నవంబరు 12న మోక్షగుండం విశ్వేశ్వరయ్య విగ్రహాన్ని ఆవిష్కరిస్తున్న రాష్ట్రపతి.



రాష్ట్రపతి ఆ సందర్భంలో ప్రసంగిస్తూ ప్రజలు క్రమ శిక్షణను అలవరచు కోవాలన్నారు.




గరల్ స్కౌట్స్, గరల్ గైడ్స్ తాలూకు ప్రపంచ సంస్థ అధ్యక్షురాలు శ్రీమతి లికియా గ్రోహాలో గౌరవచిహ్నంగా హైదరాబాదులో అక్టోబరు 24న స్కౌట్స్ అండ్ గైడ్స్ రేలీ ఏర్పాటుచేశారు. ఆ సందర్భంలో అధ్యక్షోపన్యాసం యిస్తున్న ఆంధ్రప్రదేశ్ గవర్నరు



అయిదవ ఉక్కు కర్మాగారాన్ని విశాఖలో ఏర్పాటు చేయాలని నిరాహారదీక్ష కావిస్తున్న శ్రీ టి. అమృతరావుకు నవంబరు [illegible]న ముఖ్యమంత్రి నిమ్మరసంయిచ్చి దీక్ష విరమింప జేస్తున్న దృశ్యం.





సికిందరాబాదులో అక్టోబరు 10న ఎన్. సి. సి. డైరెక్టరేటు భవనానికి ప్రారంభోత్సవంచేస్తున్న గవర్నరు శ్రీ పట్టం ఎ. థానుపిళ్ళై.



మహబూబునగర్‌లో అక్టోబరు 12న ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాలకు ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు.



ఎన్. సి. సి. డైరెక్టరేటు భవనం





మహబూబ్ నగర్‌లో అక్టోబరు 12న ఎన్. జి. ఓ. ల హోమ్‌కు ప్రారంభోత్సవం చేస్తున్న ముఖ్యమంత్రి.



హైదరాబాదులోని ఫతేమైదాన్ క్లబ్బులో అక్టోబరు 16న డిప్యూటీ కలెక్టర్ల (ఎగ్జిక్యూటివ్ బ్రాంచి) సివిల్ సర్వీస్ అసోసియేషన్ వార్షిక సమావేశాన్ని ప్రారంభిస్తున్న ముఖ్యమంత్రి.



ఎన్. జి. ఓ. ల హోం దృశ్యం



డిప్యూటీ కలెక్టర్ల సమావేశంలో ప్రధానకార్యదర్శి, తదితర సీనియర్ అధికారులు.



ఖమ్మంలో అక్టోబరు 9న కార్మిక, రవాణా సమాచార శాఖా మంత్రి శ్రీ బి. వి. గురుమూర్తితో ఆ జిల్లా పాత్రికేయులు.



హైదరాబాదులో అక్టోబరు 28న ఆంధ్రప్రదేశ్‌లో పదేశ్య అభివృద్ధికి సంబంధించిన ప్రసంగాల కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరుపుతున్న ముఖ్యమంత్రి.



నవంబరు 1న ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవాన్ని పురస్కరించుకుని హైదరాబాదలో ఏర్పాటు చేసిన ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తున్న ఆర్థిక, పరిశ్రమలశాఖా మంత్రి డా॥ ఎం. చెన్నా రెడ్డి.



సికిందరాబాదులోని శివాజీ నగర్ కార్మికుల విద్యా కేంద్రానికి చెందిన కార్మికఉపాధ్యాయులకు, శిక్షణ పొందినవారికి అక్టోబరు 12న సర్టిఫికేట్లను అందజేస్తున్న కార్మిక, రవాణా, సమాచారశాఖా మంత్రి శ్రీ. బి. వి. గురుమూర్తి.





ఆ సందర్భంలో ప్రసంగిస్తున్న శ్రీమతి సరోజనీపుల్లారెడ్డి.

హైదరాబాదులోని సరోజినీదేవి హాలులో నవజీవన మహిళా కళాశాలకు అక్టోబరు 24న శ్రీ వి. బి. రాజు ప్రారంభోత్సవం చేశారు.







హైదరాబాదులోని లాల్ బహదూర్ స్టేడియంలో జరిగిన 15వ జాతీయ వాలీబాల్ ఛాంపియన్‌షిప్ పోటీలలో
గెలుపొందిన వారికి నవంబరు 6న ముఖ్యమంత్రి బహుమతి ప్రదానం చేశారు.



అక్టోబరు 11న లఘుపరిశ్రమల అభివృద్ధికి సంబంధించిన
తీవ్రతర ఉద్యమాన్నికి ప్రారంభోత్సవం జరుపుతున్న ఆర్థిక,
పరిశ్రమల శాఖామంత్రి డా. ఎం. చెన్నారెడ్డి.



సమావేశానికి హాజరైన కొందరు



రష్యా వైమానిక శాఖ ఉపమంత్రి శ్రీ పి. ఎ. బెలవిన్స్కి అక్టోబరు 27న హైదరాబాదుకు విచ్చేసిన సందర్భంలో వారికి స్వాగతమిచ్చినప్పటి చిత్రం.



హిందుస్థాన్ ఎయిరో నాటిక్స్ కర్మాగారంలో శ్రీ ఎ. ఎ. బెలవిన్స్కి.



ఇటీవల జపాన్ కాన్సల్ జనరల్. కిక్కావా, వారి సతీమణి హైదరాబాదుకు విచ్చేసిన సందర్భంలో అక్టోబరు 26న గోలకొండకోటను సందర్శించారు.



ఆర్థిక, పరిశ్రమలశాఖా మంత్రి డా. ఎం. చెన్నారెడ్డి హైదరాబాదులో అక్టోబరు 11న శిక్షణ-ఉత్పత్తి కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు.



ఆంధ్రప్రదేశ్ మోటార్ బండ్ల నిర్వాహకులు, ప్రతినిధుల సంఘం వారు హైదరాబాదులో నవంబరు 5న కార్మిక రవాణా, సమాచారశాఖా మంత్రి శ్రీ బి.వి. గురుమూర్తికి సన్మానం చేసిన సందర్భంలో ఊరేగుతున్న దృశ్యం.



సానత్ నగర్ లో అక్టోబరు 14 న బాలసేవికల శిక్షణ కేంద్రానికి సాంస్కృతిక శాఖామంత్రి శ్రీ పి. వి. జి. రాజు ప్రారంభోత్సవం జరిపారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ. కె ఎన్ అనంతరామన్. ఐ సి.ఎస్; సమావేశానికి అధ్యక్షత వహించారు.



హైదరాబాదులోని ప్రకాశంనగర్ కాలనీలో నవంబరు 22న పోస్టాఫీసుకు కార్మిక, రవాణా శాఖామంత్రి ప్రారంభోత్సవం జరిపారు.







సమాచార, పౌర సంబంధశాఖా డైరెక్టరు 'షికార్ ఎడ్వెంచర్స్' కార్యాలయాలకు నవంబరు 1న హైదరాబాదులో ప్రారంభోత్సవం చేశారు

జకోస్లేవేకియానుండి వచ్చిన థియేటర్ పాంటమైమ్ ఆవ్ బ్రటిస్లావా బృందంవారు హైదరాబాదులో నవంబరు 7.8 తేదీలలో మూగాభినయ ప్రదర్శనలను యిచ్చారు. అనేకమంది జంటనగరవాసులు జకోస్లేవేకియాలో సాంప్రదాయసిద్ధంగా వస్తున్నయీ కళావిజ్ఞాన్ని తిలకించి ఆనందించారు.



జకోస్లేవేకియా మూగాభినయ ప్రదర్శన బృందం
నవంబరు 6న సికింద్రాబాదు స్టేషనులో దిగినప్పటి చిత్రం.





ప్రదర్శనలోని నాలుగు దృశ్యాలు







మూకాభినయం ప్రదర్శనల రెండవ రోజు
కార్యక్రమాన్ని తిలకించిన ప్రేక్షకులు.



కార్మిక, రవాణా, సమాచార శాఖల మంత్రి శ్రీ బి. వి
గురుమూర్తి, బృందం సభ్యులకు పుష్ప గుచ్ఛాలను
సమర్పిస్తున్న దృశ్యం.



శాసన మండలి ఉపాధ్యక్షులు శ్రీ ఎం. ఆనందం,
నవంబరు 7న రవీంద్ర భారతిలో జరిగిన పాంటోమైన్
ప్రదర్శన ఆఖరులో ప్రసంగిస్తున్న దృశ్యం.



బృందం నాయకుడు నవంబరు 8 న ప్రదర్శన తర్వాత
ప్రసంగించారు.



కార్మిక, రవాణాశాఖల మంత్రి కళాకారులతో.

# దర్శనీయ స్థలాలు

## భద్రాచలం

వైకుంఠ ఏకాదశి రోజున అసంఖ్యాకమైన యాత్రికులు భద్రాచలం సందర్శిస్తుంటారు.



ప్రసిద్ధ భద్రాచలం దేవాలయంలోని భక్త రామదాసు చిత్ర పటం.



భద్రాచలం దేవాలయ దృశ్యం.



భద్రాచలం సమీపంలో గోదావరిపైగల రోడ్డు వంతెన.



గోదావరి నదిలో స్నానం చేస్తున్న యాత్రికులు.

# భద్రాచలం





శ్రీరామాలయం ఆభరణాలు



రామాలయానికి చెందిన ఆభరణాల మరొక చిత్రం



కలికితురాయి, మంగళసూత్రం, పచ్చలపతకం, చింతాకు పతకం



పశ్చిమ గోదావరి జిల్లా కన్నాపురం నివాసురాలు శ్రీమతి కనుమిల్లి వెంకటనరసమ్మ, అక్టోబరు 24 న సీతమ్మవారికి 60 కాసుల విలువగల బంగారు ఆభరణం సమర్పించారు.



ఆభరణం దృశ్యం



కల్యాణ మండపం పైకప్పు చెక్కడాలు



కొత్తగూడెంలోని బొగ్గుశుద్ధి ప్లాంటు దృశ్యం



కొత్తగూడెం థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రం



పశ్చిమ గోదావరి జిల్లా కొబ్బరితోటలు



శ్రీశైలంలోని పాతాళగంగ







ఖమ్మంజిల్లాలోని కిన్నెరసాని ప్రాజెక్టు దృశ్యాలు



కరీంనగర్ జిల్లా ధర్మపురిలో గోదావరినది దృశ్యం



వేములవాడలోని స్నానఘట్టం దృశ్యం

# వేములవాడ

కరీంనగర్ జిల్లాలోని వేములవాడ, కరీంనగర్‌కు దాదాపు 20 మైళ్లదూరంలో ఉంది. ఈ గ్రామం చాలా పురాతనమైనది. పశ్చిమ చాళుక్యుల కాలంనుండి అస్తిత్వాన్ని కలిగి ఉంది. ఇక్కడి రాజరాజేశ్వర దేవాలయం, ఆంధ్రప్రదేశ్‌లోని ప్రసిద్ధ శివాలయాలలో ఒకటి. రాష్ట్రం నాలుగు చెరగులనుండి వేలమంది భక్తులు దైవ దర్శనానికి ఇక్కడికి వస్తుంటారు. ప్రత్యేకంగా మాఘ-ఫాల్గుణ మాసాలలో అసంఖ్యాకమైన భక్తులు యీ స్థలాన్ని సందర్శిస్తారు. మహా శివరాత్రినాడు యాత్రికులు తండోపతండాలుగా వస్తారు. ప్రతి సంవత్సరం ఫాల్గుణ మాసంలో పూర్ణిమ నాడు కల్యాణోత్సవం జరుగుతుంది.



రాజ రాజేశ్వరస్వామి



దేవాలయం ప్రవేశ ద్వారంలోని లక్ష్మీగణపతి

# పదేళ్ల ఆంధ్రప్రదేశ్ ఉజ్జ్వలగాథ

శ్రీ బి. వి. గురుమూర్తి



ఆంధ్రప్రదేశ్ యీనాడు పదేళ్ల ప్రాయంలో సుందరమూ, సురుచిరమూ, శోభాయమానమూనైన రూపాన్ని సంతరించుకుని భవిష్యదాకాశంలో ప్రగతికాంతుల్ని ప్రసరిస్తున్నది. మన అభిరుచులకు, మన ఆలోచనలకు రూపకల్పనగా నిలచే అతి మనోహరమైన, అత్యంత ప్రగతిశీలమైన ఒక కొత్త రాష్ట్రాన్ని పునర్నిర్మించే బృహత్కార్య క్రమంలో యీపదేళ్లు మనం పూర్తిగా మునిగి వున్నాం. మన యీకృషి-పదేళ్లుగా మనం కొనసాగిస్తున్న యీ నిర్మాణ కార్యక్రమం—మన శక్తియుక్తుల్నీ, మన చెమటనూ, రక్తాన్ని వెచ్చించి అనవరతమూ శ్రమిస్తూ సాగిస్తున్న ఈ బృహత్ నిర్మాణ కృషి, భవిష్యత్తులో మనకు మనం కన్న కలలను వాస్తవంచేసి క్రొత్త జీవితాన్ని ప్రసాదిస్తుంది.

గడిచిన దశాబ్దాన్ని గూర్చి ప్రస్తావించేటప్పుడు ఒక విషయాన్ని-అత్యంత ప్రాముఖ్యమూ ప్రసిద్ధమూ అయిన విషయాన్ని-విస్మరించలేం. అదే_విజయవంతగా, ప్రయోజనయుతంగా ఆశాజనకంగా, పూర్తిచేసిన ద్వితీయ, తృతీయ పంచవర్ష ప్రణాళికల ప్రయెజనం. ఈ ప్రణాళికల క్రింద కొన్ని లక్ష్యాలను ఏర్పరచుకుని, యీ దశవత్సరాలుగా అందుకు శ్రమిస్తూ, మన శక్తియుక్తులను అటు వైపుగా కేంద్రీకరిస్తూ విజయాన్ని సాధించాం, మనం ఏర్పరచుకున్న లక్ష్యాలను యించుమించు తృప్తిగా నెరవేర్చాం.

ప్రణాళికా బద్ధంగా చేసిన మనకృషికి నిదర్శనం రాష్ట్ర ఆర్థిక స్వరూపం అంతటాద్యోతకమౌతున్న అభివృద్ధే. రాష్ట్రాదాయం, వ్యక్తిగత ఆదాయాలలో పెరుగుదలనుబట్టే మనకృషి ఫలితాన్ని లెక్కించవచ్చు. తొలి పంచవర్ష ప్రణాళికాంతానికి రాష్ట్రాదాయం రూ. 946 కోట్లు, వ్యక్తిగత ఆదాయం రూ. 281 లుఉండేది. తృతీయ ప్రణాళిక ముగిసేనాటికి రాష్ట్ర ఆదాయం రూ.1248 కోట్లకు, వ్యక్తిగత ఆదాయం రూ. 319లకు పెరిగింది,

దేశం యావత్తూ మనరాష్ట్రాన్ని అన్నపూర్ణగా భావిస్తోంది. ఆంధ్రప్రదేశ్ మీద ఆశలు పెట్టుకుంది. దేశంలో ఆహారకొరత ఏర్పడిన అనేక సమయాలలో యావత్ భారత దేశమూ మన మీద పెట్టుకున్న ఆశల్ని మనం వమ్ము చేయలేదు. ఇక్కడ సమృద్ధిగా ఆహార ధాన్యాలు ఉత్పత్తి అవుతున్నాయి. పైగా ప్రణాళికల్లో వ్యవసాయఉత్పత్తికి అధికతర ప్రాముఖ్యత యిచ్చిన కారణంగా మన ఆహారధాన్యాల ఉత్పత్తులు అధికమయ్యాయి. 1955_56 లో 65,33 లక్షల టన్నులు ఉత్పత్తి కాగా 1965_66 లో 89.86 లక్షల టన్నులు ఉత్పత్తి అయ్యాయి. మన అహారధాన్యాల ఉత్పత్తిని మరింతగా ఎక్కువ చేయడానికి అనేకమైన చర్యల్ని తీసుకున్నాం, 1960 లో పెకేజి కార్యక్రమాన్ని ప్రారంభించాం. ఆ తర్వాత మూడేళ్లకి పది జిల్లాలను ఆవర్తిస్తూండే తీవ్రతరవ్యవసాయ కార్యక్రమాన్ని చేపట్టాం. కొన్ని ప్రాంతాలను ఎన్నుకుని సీటిసౌకర్యాన్ని కల్పిస్తూ ఆయాప్రాంతాలలో ఖరీఫ్, రాబి పంటలను రెండింటిని రెట్టింపు భూమి సాగుక్రిందకు తీసుకొచ్చాం. పశుగణాభివృద్ధి పథకాల ద్వారా ఎంతో ప్రయోజనాన్ని సాధించాం. సమీకృత పాల ప్రాజెక్టును గూర్చి ప్రత్యేకించి చెప్పుకోదగ్గ అంశంగా అభివృద్ధి పరిచాం, హైదరాబాదులో ప్రధానమైన పాడిక్షేత్రాన్ని విజయవాడలో ప్రధానమైన పాలపొడి ఫ్యాక్టరిల నిర్మాణాలను చేపట్టాం. ఈ నిర్మాణాలు యీనాడు అభివృద్ధి దిశగా వివిధ దశలలోవున్నాయి.

షాద్‌నగర్, పాములుర్తిలోని చిల్లింగ్ సెంటర్లు, [illegible] శీతలకేంద్రం అప్పుడే పనిచేయడం ప్రారంభించాయి.

## మూల స్తంభాలు

రాష్ట్ర వ్యావసాయక ఆర్థిక సాధనాకి నీటిపారుదల పథకాలు మూల స్తంభాలవంటివి. గత దశాబ్దంలో అనేక భారీ, మధ్య తరహా నీటిపారుదల ప్రాజెక్టులు నిర్మించబడ్డాయి. ప్రకాశం బారేజి, రొంపేరు డ్రైనేజి, రాళ్ళపాడు ప్రాజెక్టు ఎగువ పెన్నానది ప్రాజెక్టు, భైరవునితిప్ప ప్రాజెక్టుల వంటి భారీ ప్రాజెక్టులు; నారాయణపురం ఆనకట్ట, వేగవతి ఆనకట్ట, సీతానగరం ఆనకట్ట, నాగవల్లి కుడికాలువ, పెడిగం ప్రాజెక్టు, గంభీరంగడ్డ రిజర్వాయరు, బండకట్ట కాలువ, మల్లిమడుగు ప్రాజెక్టు కాళింగి రిజర్వాయరుజె. నక్కలగండిప్రాజెక్టు, పాలేరు-బిట్ర గుంట కాలువ, పించప్రాజెక్టు, దిగువసీలేరు ప్రాజెక్టు, జంటిపల్లి ప్రాజెక్టు, కోయిల్‌సాగర్ ప్రాజెక్టు సరళాసాగర్ ప్రాజెక్టు చెన్నరాయస్వామిగుడి ప్రాజెక్టు వంటి మధ్యతరహా ప్రాజెక్టుల నిర్మాణం చేపట్టబడింది. తుంగభద్ర హై లెవెల్ కాలువ పథకం తొలిదశ కూడా పూర్తయింది. దీనితో రాయలసీమ ప్రాంతాలలో ఒక కొత్త చైతన్యానికి, ఒక కొత్త శకానికి అంకురార్పణ జరిగి నట్టయ్యింది. ఇంకా పోచంపాడు, వంశధార, రాజోలిబండ మళ్ళింపు పథకంవంటి భారీ ప్రాజెక్టులు వివిధ నిర్మాణదశల్లో వున్నాయి.

అంతేకాదు అపూర్వమూ అత్యద్భుతమూ అయిన ఒక భారీ నిర్మాణం యీ దశాబ్దంలో ఆరంభించబడింది. అదే 1 0 కోట్ల రూపాయల నాగార్జునసాగర్ ప్రాజెక్టు. ఈ ఆనకట్టనుండి సాగునీటిని విడుదల కూడా చేయడం జరిగింది. దేశం ఆహార రంగంలో స్వయంసమృద్ధిని సాధించేందుకు చేసే పోరాటంలో ఈ ఆనకట్ట ప్రధాన పాత్రవహిస్తుంది. తొలిదశలో ఈ ఆనకట్ట క్రింద ఏటా ఎనిమిది లక్షల టన్నుల ఆహారధాన్యాలను పండించ గలమని అంచనా. ఆధునిక దేవాలయమనదగిన యీ అపూర్వ నిర్మాణానికి 1966 మార్చి మాసాంతం నాటికి రూ. 57.78 కోట్లు ఆనకట్ట క్రింద, రూ. 27.31 కోట్లు కుడికాలువ క్రింద, రూ. 19,09 కోట్లు ఎడమ కాలువక్రింద మొత్తం రూ. 104.18 కోట్లు వెచ్చించడం జరిగింది.

## విద్యుచ్ఛక్తి అభివృద్ధి

అనేకానేక కారణాలవల్ల మన రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి అభివృద్ధి నత్తనడకలో సాగింది. నిజానికి మన రాష్ట్రానికి 30 లక్షల కి. వా. జలవిద్యుదుత్పాదక శక్తివుంది. థర్మల్ విద్యు దుత్పత్తికి 40,000 లక్షల బొగ్గు నిధులు వున్నాయి. గత పదే ళ్ళుగా మనం యీ విషయంలో చిత్తశుద్ధితో కృషి చేస్తూవచ్చాం 1955 అగస్టులో మాచ్‌ఖండ్ జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు తొలి యూనిట్టు విద్యుదుత్పత్తి ప్రారంభించింది. 1957 ఆరంభంలో తుంగభద్ర జలవిద్యుత్కేంద్రం కూడా విద్యుదుత్పాదన ప్రారం భించింది. తెలంగాణా ప్రాంతంలో 1956 లో నిజాంసాగర్ జల విద్యుత్కేంద్రం, ఆ మరుసటియేడు రామగుండం థర్మల్ స్టేష ను ప్రారంభించాయి. మైసూరు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు ఉమ్మడిగా ఎనిమిది కోట్ల రూపాయల తుంగభద్ర జలవిద్యుత్పథ కాన్నొకదానిని చేపట్టాయి. తుంగభద్ర ఆనకట్ట పవర్‌హౌస్‌లో 4 సెట్లను, కాలువ పవర్‌హౌస్‌లో 4 సెట్లను మొత్తం ఎనిమిది సెట్లను నెలకొల్పడం యీ పథకం ఉద్దేశం. ఈ సెట్లన్నిటినీ నెలకొల్పడం పూర్తయింది.

థర్మల్ విద్యుచ్ఛక్తి అభివృద్ధిపై కూడ తగిన శ్రద్ధ వహించబడింది. తెలంగాణా ప్రాంతంలో విద్యుచ్ఛక్తి అవస రాలను తీర్చడానికి వీలుగా 1957 జూన్‌లో రామగుండం థర్మల్ స్టేషన్ ఉత్పత్తిని ప్రారంభించింది. ఇక్కడ ప్రారంభంలో 12500 కి. వా. ఉత్పాదక శక్తిగల మూడు జనరేటింగ్ సెట్లు ఉన్నాయి. 62.5 మె. వా. ల ఉత్పాదక శక్తిగల మరొక సెట్టును నెలకొల్పే విస్తరణ పథకాన్ని ఈ కేంద్రంలో అమలు జరుపుతున్నారు. 1967 నవంబరులో యీ సెట్టు విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని ప్రారంభిస్తుందని ఆశిస్తున్నారు. అంతర్జాతీయ అభి వృద్ధి పథకం క్రింద అమెరికాసంస్థ యీ పథకం అమలుకు ఆర్థిక సహాయం చేస్తున్నది. కొత్తగూడెం థర్మల్ పథకం మొదటిదశ క్రింద నెలకొల్పబడిన 60 మె. వా. ఉత్పాదకశక్తిగల యూనిటు 1966 జూలైలో ఉత్పత్తి ప్రారంభించింది. ఈ పథకం మొదటి దశ అమలుకు దాదాపు రూ. 28 కోట్లు ఖర్చుఅవుతాయని అంచనా వేశారు. పునర్నిర్మాణం. అభివృద్ధి పథకం క్రింద అంతర్జాతీయ బ్యాంకు ఆర్థిక సహాయం చేస్తున్నది.

## శ్రీశైలం ప్రాజెక్టు

శ్రీశైలం దేవాలయం సమీపంలో కృష్ణానదిపై రూ. 46 కోట్ల ఖర్చుతో శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు నిర్మించబడు తున్నది. ఇది రాష్ట్రంలోనే పెద్ద విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల్లో ఒకటి. 1963 జూలైలో అప్పటి ప్రధానమంత్రి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ యీ ప్రాజెక్టు నిర్మాణానికి శంఖుస్థాపన చేశారు. 1966 జనవరిలో కాఫర్ డాం, నిర్మాణానికి ప్రారంభోత్సవం చేయడం జరిగింది. రాష్ట్రంలో రెండవ ప్రణాళికా ఆఖరుకు విద్యుత్పాదకశక్తి 213 మె. వా. ఉండగా మూడవ ప్రణాళికలో 291 మె. వా. కు పెరి గింది. గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరాచేసే కార్యక్రమం కూడ అభివృద్ధిదశలో కొనసాగుతున్నది. రాష్ట్రంలో ఉన్న 27084 గ్రామాలలో 1966 మార్చి ఆఖరువరకు 5500 గ్రామాలకు విద్యు చ్ఛక్తి సరఫరాచేశారు.

కృష్ణా పరిసరప్రాంతాలలో పరిశ్రమల త్వరగతి అభివృద్ధికి అపారమైన అవకాశాలు ఉన్నాయి. పరిశ్రమల అభివృద్ధికి అవసరమైన సౌకర్యాలు కల్పించడానికి ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, లఘు పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్, ఆర్థిక సహాయక కార్పొరేషన్ నెలకొల్పబడినాయి.

రాష్ట్రంలో పరిశ్రమలను నెలకొల్పదలచిన పారిశ్రామిక వేత్తలకు ఎన్నో సౌకర్యాలు కల్పించబడుతున్నాయి. కేంద్ర

సీరియల్

# అడవి మల్లె

వాసిరెడ్డి సీతాదేవి

**జరిగిన కథ**

ప్రసాదరావు చంద్రం అన్న ఇంటికి వెళ్ళగా అనూరాధ చూచి స్పృహ కోల్పోయి, తేరుకుంటుంది. ప్రసాద్ ఆమె ప్రక్కనే కూర్చున్నాడు. ఆమెకు ముఖం చూపించలేక ఏడుస్తున్న ప్రసాద్‌ను వారించింది. తెనాలి రైల్వే స్టేషన్‌లో అనూరాధ పడిన బాధనంతయు ప్రసాద్‌తో వెళ్ళబుచ్చుకున్నది. ప్రసాద్ తన గాథకూడ చెప్పుకొని తిరిగి తనవెంట వచ్చేయమనీ, కూతురును వెదకే బాధ్యత తనదేనని అంటాడు.

## 20

ప్రకాశం అలా వెళ్ళిపోవడం చంద్రం అనుమానాన్ని మరీ బలపరచింది. వెళ్ళిపోతున్న ప్రకాశాన్ని జరజరా పుట్టలోకి పోతున్న జర్రిని చూసినట్లుచూశాడు చంద్రం. 'ప్రకాశం అయిపోయింది. అదే మరొకరయితే రక్తం కళ్ళచూసి వుందును' అనుకున్నాడు.

గౌరి అసహాయతను చూస్తుంటే చంద్రం గుండెలు చెరువులయాయి. పక్కనేవెళ్ళి కూర్చుని తలమీద ఆప్యాయంగా నిమురుతూ "ఊరుకో. ఏడవకు" అన్నాడు చంద్రం.

గౌరి ఒకసారిగా చంద్రం చేతికి చుట్టుకుపోతూ బోరున ఏడ్చింది.

"ఛ! ఏమిటది. లే ఏడవకు. లేచి ముఖం కడుక్కో. నేను వున్నానుగా. నీకేం భయంలేదు." అన్నాడు చంద్రం.

గౌరికి చంద్రం మాటలు అర్థంకాలేదు. కాని అతను తన కోసం బాధపడుతున్నాడని అర్థం అయింది.

"లేచి ముఖం కడుక్కో" అంటూ చంద్రంలేచి నిలబడ్డాడు. అలా లేచిన చంద్రం కాళ్ళను రెండు చేతుల్తో చుట్టేసి తలను కాళ్ళకు ఆనించి వెక్కి వెక్కి ఏడవసాగింది.

చంద్రం గాబరాపడ్డాడు. వంగి గౌరి చేతులనుంచి తన కాళ్ళను విడిపించుకోవటానికి ప్రయత్నిస్తూ "ఛ ఏమిటి గౌరీ మరీ పసిపిల్లలా. అలా కాళ్ళు పట్టుకోకూడదు. లే" అన్నాడు.

"నువ్వు! నువ్వు ఇక్కడనుంచి వెళ్ళొద్దు" అంది ఇంకా గట్టిగా చంద్రం కాళ్ళను చుట్టేస్తూ, వెక్కి వెక్కి ఏడుస్తూ.

"వెళ్ళను లే. ముందు నా కాళ్ళను వదులు." అన్నాడు చంద్రం తన కాళ్ళను వదిలించుకుంటూ.

చంద్రం వెళ్ళను అనడంతోటే గౌరికి సంతోషం కలిగింది. అంతలోనే అంత దుఃఖాన్ని మర్చిపోయింది. ఏడుస్తున్నపిల్లవాడి చేతిలో మిఠాయిపొట్లం పెట్టినట్లు గౌరి అమాయక హృదయం అంతలో అంత దుఃఖాన్ని ఇట్టే మర్చిపోయింది. కళ్ళు తుడుచుకుంటూ లేచి నిల్చుంది.

"వెళ్ళి ముఖం కడుక్కో" అన్నాడు చంద్రం. బాత్‌రూం వైపు వెళుతున్న గౌరిని జాలిగాచూస్తూ నిట్టూర్చాడు.

ఎంత అమాయకం! కల్లాకపటం తెలియని మనస్సు. పాపం ఎంత చెదరిపోయిందో! ప్రకాశం ఇంత నికృష్టపు పని చేస్తాడని తను ఏనాడూ వూహించలేదు. అన్ని ఆదర్శాలుమాట్లాడే ప్రకాశమే ఇలా ప్రవర్తిస్తే ... ప్రకాశంగురించి చెడుగా ఆలోచించడం బాధ అనిపించింది చంద్రానికి.

ఒకవేళ ప్రకాశం గౌరిని ప్రేమిస్తున్నాడేమో! అయినా అలా ప్రవర్తించి వుండకూడదు ఆమెమనస్సును తెలుసుకోకుండా. గౌరి తనంటేపడి చచ్చిపోతుందని తనకూతెలుసు. అందుకే ఆపిల్ల అంటే తను అంత ముభావంగా నటిస్తున్నాడు. ఎలాగయినా గౌరి మనస్సును ప్రకాశం వైపుకు మరలించాలి.

దానికి ఉపాయం ఒకటే. తను త్వరలో వివాహం చేసుకోవాలి. అప్పుడు గౌరి తనంత తానే మారిపోతుంది. హేమతో తను ఖచ్చితంగా మాట్లాడాలి.

చంద్రం మనస్సు కలతబారింది. ఎంత సర్దుకుందామన్నా ప్రకాశం ప్రవర్తనను సమర్థించుకోలేకుండా వున్నాడు. సగంపైగా రాసిన నవలను తీసుకొని కూర్చున్నాడు.

హేమకోరినట్లు చంద్రం నవలరాస్తున్నాడు. ఇతివృత్తంగా తన జీవితాన్నే తీసుకున్నాడు. హేమముందు వెళ్ళడించలేని భావాలను ఈ విధంగానన్నా హేమకు తెలియపరచే అవకాశం



కలుగుతుందని ఆశించాడు. ఈ నవల హేమ మనస్సులోని అనుమానాలన్నిటికీ సమాధానం చెబుతుందనీ, హేమ తనకు దగ్గరగా రావటానికి సహాయపడుతుందనీ చంద్రం ఆశ.

ఆ నవలద్వారా గౌరికీ తనకూ మధ్యవున్న సంబంధం ఎలాంటిదో, చెయ్యని దొంగతనం తనమీద ఎలా మోపబడిందో, పట్రికాశం తను ఇంతవాడు కావటానికి ఎలా తోడ్పడ్డాడో అంతా వివరంగా రాస్తున్నాడు.

నవల రాయడంలో మునిగిపోయిన చంద్రానికి అలా తను రాయడం మొదలుపెట్టి రెండు గంటలయినట్లు తెలియలేదు. అకస్మాత్తుగా భావప్రవాహానికి ఏదో అడ్డతగిలి కాగితాలూ కలం టేబులుమీద పెట్టి యాంత్రికంగా జేబులోసిగరెట్టుతీసి ముట్టించాడు. గట్టిగా దమ్ముపీల్చి వదిలాడు. కొంచెం రిలీఫ్‌గా అనిపించింది. అప్పుడుగాని గౌరి ఎదురు కుర్చీలోకూర్చుని తన ముఖంలోకే రెప్పవెయ్యకుండా చూస్తుందని తెలియలేదు. అలా ప్రపంచాన్నే మరిచి ఏదో వింతవస్తువును చూస్తున్నట్లు తన ముఖంలోకే చూస్తున్న గౌరిని చూస్తుంటే చంద్రానికి నవ్వు వచ్చింది. మాటల్లో దించాలని సరదా కలిగింది.

"ఏమిటి గౌరీ అలా చూస్తున్నావు? నా ముఖం ఎలా వుందేమిటి?" అన్నాడు చంద్రం సిగరెట్టు పొగను విలాసంగా ఊదుతూ.

గౌరి ఉలిక్కిపడింది. సిగ్గుతో బుగ్గలు జేవురించాయి. తల వంచుకుంది. ఎంత అందంగా వుంది! వయస్సుతోపాటు ఎంత అమాయక హృదయంలోకూడా మధుర భావాలు తల లెత్తుతాయి కాబోలు! చంద్రానికి గౌరిని చూస్తుంటే ఇంకా ఇంకా మాట్లాడించాలనిపించింది.

"సిగ్గెందుకు. చెప్పు. నన్నెందుకలా చూస్తున్నావు?"

"నీవు రాస్తుంటే నీ ముఖం బలేగా వుంటుంది. అలాగే చూడాలనిపిస్తుంది'' అనేసి సిగ్గుతో ముఖాన్ని అరచేతుల్లో దాచుకుంది.

"అట్లా సిగ్గుపడితే ఏట్లా. మరి నేను అడిగేదానికి సరిగా జవాబుచెప్పు. అలా ఎందుకు చూడాలనిపిస్తుంది?"

"ఏమో!" అంది గౌరి సాలోచనగా.

"మరి ప్రకాశాన్ని అలాచూడాలనిపించదా?"

"ఉహూ?"

"ఎందుకనో! నాకంటే ప్రకాశమే నిజానికి అందమైన వాడు."

గౌరి మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ కూర్చుంది. గౌరికి ఆలోచించటంకూడా వచ్చునన్నమాట! అనుకున్నాడు చంద్రం.

"నేను అడిగేవాటికి మరి సరిగా జవాబు చెప్పు. లేకపోతే నేను బయటకు వెళ్ళిపోతాను." చంద్రం చిరునవ్వుతో అన్నాడు.

గౌరి బెదురుగా చంద్రం ముఖంలోకిచూసింది.

"వెళ్ళనులే. మరి చెప్పు. ప్రకాశాన్ని చూడాలని నీకు ఎందుకు అనిపించదు. ప్రకాశం అంటేనీకు ఇష్టంలేదా?"

"ఇష్టమే" ఒక్క ముక్కలో అయిష్టంగా జవాబిచ్చింది.

"మరి ఇష్టమయితే ప్రకాశం ముఖం ఎందుకు చూస్తూ కూర్చోవాలనిపించదు."

"ప్రకాశం అంటేనాకు ప్రేమలేదు. నేను నిన్నే ప్రేమిస్తున్నాను."

చంద్రం విస్మయంగా గౌరి ముఖంలోకి చూశాడు. గౌరి అంతమాట అనేస్తుందనుకుంటే అసలు గౌరిని అలా గుచ్చిగుచ్చి అడక్కనేపోను తను, గౌరి అమాయకత్వానికి బాధపడ్డాడు. గౌరి లోని ఆ భావాన్ని పెరగనివ్వకూడదు అనుకున్నాడు చంద్రం.

"ప్రేమా! ప్రేమంటే ఏమిటి?" అన్నాడు చంద్రం ఊదిన సిగరెట్టు పొగలోకి చూస్తూ.

ఆశ్చర్యపోవటం ఈసారి గౌరివంతయింది. "నీకు ప్రేమంటే తెలియదా? మరి కథలు రాస్తావుగా?" అంది ఆశ్చర్యంగా కళ్ళు తిప్పుతూ.

చంద్రానికి నవ్వూ, వచ్చింది, బాధాకలిగింది.

"నాకు ప్రేమంటే తెలియదు. నేనుంాసే కథల్లో ప్రేమను గురించి రాయను." అన్నాడు చంద్రం.

మరి నువ్వు హేమను ప్రేమించటంలేదా?" చంద్రం ముఖంలోకి చూస్తూ ప్రశ్నించింది గౌరి.

చంద్రం ఇరుకులో పడ్డాడు. అవును అని చెబితే గౌరి ముందుకు మాట్లాడదని తెలుసు. గౌరి అమాయక హృదయం ప్రేమరూపాన్ని ఎలా చిత్రించుకుందో తెలుసుకోవాలనే కుతూహలాన్ని అణచుకోలేకపోయాడు.

"లేదు, నేను ఎవర్నీ ప్రేమించటంలేదు. ప్రేమంటే నాకు తెలియదు. ప్రేమంటే ఏమిటో చెప్పు." అన్నాడు చంద్రం.

గౌరి ముఖం ఆనందంతో వికసించింది. అది చూసి చంద్రం తను అబద్ధం చెప్పి తప్పు చేశానేమోనని బాధపడ్డాడు.

"ప్రేమంటే...ప్రేమే...ఎలా చెప్పటం... " అంటూ ఆలోచనలో పడిపోయింది గౌరి.

"ప్రేమంటే ఏమిటో తెలియదు. కాని నువ్వు ప్రేమిం చేస్తున్నావ్." అన్నాడు చంద్రం గౌరిని ఉడికిస్తున్నట్లు.

చంద్రం ప్రశ్నకు గౌరికి రోషం వచ్చింది.

"ప్రేమించుకొనే వాళ్ళకు ఒకళ్ళకు ఒకళ్ళు అందంగా కనిపిస్తారు. వాళ్ళనే చూస్తూ కూర్చోవాలనిపిస్తుంది. వాళ్ళకు దగ్గరగా కూర్చొని కబుర్లు చెప్పాలనిపిస్తుంది. కాని మాటలు దొరకవు. గుండెలు కొట్టుకుంటాయి. వాళ్ల దగ్గర కూర్చుంటే ఆకలి కాదు. వాళ్లు దూరంగా వెళ్ళిపోతే గుండెల్లో ఏదో గుబులు గుబులుగా వుంటుంది, ఏడవాలనిపిస్తుంది. ఆకురాలిన శబ్దం అయినా వాళ్లే వస్తున్నట్లు ఉలిక్కి పడతాము. ఇంకా...ఇంకా చాలా అనిపిస్తుంది కాని నాకు చెప్పటం రావటంలేదు." అంది గౌరి ఇంకా ఏదో చెప్పాలని ఆలోచిస్తున్న ముఖం పెట్టి.

చంద్రం గౌరి మాటలువిని విస్తుపోయాడు. ఇన్నిమాటలు, ఇన్ని ఊహలు ఎవరు నేర్పించారు ఈ అమాయకురాలికి? బాల భానుని నిలివెచ్చని కిరణస్పర్శకు పులకించటం కమలానికి ఎవరు నేర్పించారు? వసంతుని ఆగమనంతో కోకిలకు పాడటం ఎవరు నేర్పుతున్నారు?

గౌరికి జరగరాని అన్యాయం ఏదో తనవల్ల జరుగుతున్నట్లనిపించింది చంద్రానికి. ఆమెను గాఢంగా గుండెలకు అదుముకోవాలనీ, ఆ గుండెల్లో ఆమెను దాచుకోవాలనీ అనిపించింది. కాని ఆ గుండెలో గూడుకట్టుకొని ఏనాడో హేమ ఆక్రమించుకుంది. మరొకరికి అక్కడ చోటులేదు. చంద్రం కళ్ళలో నీరు తిరిగింది. దానిని ఆపుకొనే ప్రయత్నంలోక్రింది పెదవిని కొరుకున్నాడు.

గౌరి ముఖంలోకిచూశాడు. ఆమె ఇంకా ఆలోచిస్తునేవుంది. ఒక్కసారిగా ఏదోతట్టినట్లు ముఖంపెట్టి "నిన్ను చూస్తుంటే?" అంటూ తన ముఖంలో అదోలాచూస్తున్న చంద్రాన్ని చూసి ఆగిపోయింది.

"ఆగిపోయావేం చెప్పు?" అన్నాడు చంద్రం. చంద్రం స్వరంలో అంత ఆత్మీయతను ఏనాడు అనుభవించలేదు గౌరి.

గౌరికి ఏవో లోకాలలోకి వెళ్ళిపోయినట్లుంది. తన్ను తను మరిచిపోయి చెప్పసాగింది.

"నిన్నుచూస్తుంటే నాకు ఏమనిపిస్తుందో తెలుసా? నిన్ను నా కళ్ళలో దాచేసుకొని కళ్ళు గట్టిగా మూసుకోవాలనిపిస్తుంది."

"ఎందుకూ?" అన్నాడు చంద్రం కుతూహలంగా.

అప్పుడు నేను నిన్నే చూస్తుంటాను. నువ్వుకూడా ఎవర్నీ చూడలేవు. నిన్ను ఎవరూ చూడరు." అలా చెబుతున్న గౌరి కంఠం కొంచెం వణికింది. గౌరి గుండెలవేగం ఆమె మాటల్లోనే చంద్రానికి వినిపించినట్లయింది.

చంద్రం ఆవేశంతోఆమెను రెండుచేతుల్లోకి లాక్కున్నాడు. చంద్రం చేతుల్లో ఇమిడిపోయిన గౌరికి ప్రపంచమే స్థంభించిపోయినట్లయింది. చంద్రం గౌరి నుదుటిని తన పెదవులతో మృదువుగా తాకాడు.

మరోక్షణంలో ఉద్రేకం నుంచి బయటపడిన చంద్రం అరచేతిలో పడిన నిప్పు కణాన్ని వదిలినట్లు వదిలేశాడు.

"క్షమించు గౌరీ" అన్నాడు తను చేసిన తప్పుకు బాధ పడుతూ.

ఇంకా స్వప్నలోకంనుంచి పూర్తిగా బయటపడని గౌరికి చంద్రం మాటలు వినిపించలేదు. వినిపించినా అందులో క్షమించాల్సిందేముందో ఆమెకు అర్థమయేది కానేమో!

"కోపం వచ్చిందా?" అన్నాడు గౌరి మౌనాన్ని అర్థం చేసుకోలేని చంద్రం.

గౌరి విస్మయంగా చంద్రం ముఖంలోకి చూసింది.

"నువ్వంటే నాకు ప్రేమ. నువ్వేంచేసినా నాకు కోపం రాదు." అంతకంటే ఏం చెప్పాలో తెలియని గౌరి.

చంద్రం సిగరెట్టు ముట్టించి గుప్పు గుప్పున పొగ వదులుతూ, ఆ పొగ మేఘాలలోకి చూస్తున్నాడు. కాని అతనికి ఏమీ కనిపించటంలేదు.

"నా చిన్నప్పుడు ఒక అబ్బాయిని ప్రేమించాను. ఇప్పుడు నిన్ను ప్రేమిస్తున్నాను. నేను అసలు ఇద్దర్నే ప్రేమించాను." ఏదో స్వప్నంలో మాట్లాడుతున్నట్లు మాట్లాడుతుంది గౌరి.

చంద్రం ఆశ్చర్యంగా గౌరి ముఖంలోకి చూస్తూ సిగరెట్ తాగుతున్నాడు.

"అప్పుడు నాకు పదేళ్ళుంటాయి. ఒకనాడు ఒక అబ్బాయిని వాళ్ల పెద్దవాళ్ళు గుంజకు కట్టేశారు. నేను విడిపించాను. అప్పుడు ఆ అబ్బాయికూడా అచ్చంగా నీలాగే....

చంద్రం విస్మయానికి అంతులేదు.

"ఊఁ చెప్పు!" చంద్రం ఆర్ద్రకంఠంతో అన్నాడు.

"ఆ అబ్బాయి కూడా...అచ్చంగా నీలాగే నన్ను ముద్దు పెట్టుకన్నాడు." ఒక్కసారిగా గౌరి బుగ్గల్లో గులాబీలు పూశాయి. కృత్రిమ సభ్యతా, నాగరికతా తెలియని గౌరి తన హృదయాన్ని తేలిగ్గా తెరచి పుస్తకంలా చంద్రం ముందు వుంచింది.

చంద్రంలోని ప్రతి అణువు కృతజ్ఞతతో నిండిపోయింది. ఆనాడు తనకట్లు విప్పిన ఆ తేలుకొండి చిలిపిపిల్లేనా ఈ గౌరి? మళ్ళీ తిరిగి వచ్చిన క్షణంలోనే తన జీవితంలో ఇలా ప్రవేశించిందా! ఎంత చిత్రం! ప్రకాశం విధి, కర్మలనేమాటల్ని నమ్మడు. కాని, ఇలా ఎందుకు జరిగిందో ఎవరైనా చెప్పగలరా! ఏ అజ్ఞాత శక్తి ప్రమేయం లేకుండానే ఇలాంటి చిత్రాలు జరుగుతాయా?

గౌరిని రెండు చేతుల్లోకి తీసుకొని "ఆ అబ్బాయిని నేనే గౌరీ! నీకోసం నన్నేంచేయమంటావో చెప్పు. నీకోసం ఏమయినా చేస్తాను. చివరకు హేమను కూడా వదులుకుంటాను." అని అనాలనిపించింది. కాని అలా అనలేకపోయాడు. ప్రయత్నంమీద ఉద్రేకాన్ని అణచుకున్నాడు.

"నీకు ఆ అబ్బాయి అంటే ఎక్కువ ఇష్టమా, నేనంటేనా?" అడిగాడు చంద్రం కుతూహలాన్ని అణచుకోలేక.

గౌరి అయోమయంలో పడింది. క్షణకాలం ముఖం గంభీరంగా పెట్టి ఆలోచించింది. "ఇద్దరంటే సమాన ఇష్టమే" అని గబుక్కున నాలుక కరుచుకుంది.

"ఎవరైనా ఒకర్నే ప్రేమిస్తారు. ఇద్దర్ని ప్రేమించరు. అలా ఇద్దర్ని ప్రేమిస్తున్నారంటే ఎవర్నీ ప్రేమించటం లేదన్న మాట.'' అన్నాడు చంద్రం గౌరి ముఖంలోకి చూస్తూ, ఆ మాట లంటున్నప్పుడు నిద్రపోతున్న పసిబిడ్డముఖంలోకి చూస్తూ కూర్చున్న తల్లిచూపులావుంది చంద్రం చూపు.

గౌరి ముఖం కోపంతో కందిపోయింది. ఏడుపూ, రోషం నేను ముందంటే నేను ముందని కొట్లాడేగొంతుతో అంది." నేను నిజంగానే చెబుతున్నాను. నాకు ఇద్దరూ సమానంగానే ఇష్టం"

"సరే! ఒప్పుకుంటాను. ఇప్పుడు ఆ అబ్బాయి పెద్దవాడయి వుంటాడు కదా, అతను కూడా వచ్చాడనుకో. మరి మా ఇద్దర్లో నీకు ఎవరుకావాలి?' అన్నాడు చంద్రం.

గౌరి ఆలోచనలో పడింది. నిజమే తనకు ఇద్దరూ ఇష్టమే. తనకు ఎవరుకావాలి, ఏమో తనకు తెలియటంలేదు.

చంద్రానికి ఓ ఆలోచన తట్టింది.

"ప్రకాశం ఆ అబ్బాయి అనుకో.''

"కాదు......కాదు......" గట్టిగా అరచింది గౌరి.

చంద్రం ఉలికి పడ్డాడు గౌరి ఆవేశానికి. ఆశ్చర్యం. మానవుడు ఆర్జించిన జ్ఞానం కంటే కూడా అంతఃకరణ జ్ఞానం గొప్పదేమో!

"ప్రకాశం అంటే ఇష్టం అని నువ్వేచెప్పావుగా?"

"అవును. ప్రకాశం మంచివాడు. అందుకే నాకు ఇష్టం."

చంద్రం ఆశ్చర్యపోయాడు.

"మరి ప్రకాశం మంచివాడయితే ఇందాక అలా ఎందుకు ప్రవర్తించావు?'' అన్నాడు చంద్రం గౌరిని పరీక్షగా చూస్తూ.

గౌరికి అర్థంకాలేదు.

"ప్రకాశం మంచివాడే. ఇందాక నేను తిట్టాను. చొక్కా చింపాను. కాని పాపం నన్ను ఏమీ అనలేదు.'' అంది గౌరి బాధపడుతూ.

''ఎందుకలా చేశావ్?'' అడిగాడు చంద్రం.

"నిన్ను ఇక్కడనుంచి వెళ్ళిపొమ్మన్నాడని కోపంవచ్చి అలా చేశాను. ప్రకాశానికి కోపం వచ్చిందేమో?" అంది గౌరి దిగులుగా.

చంద్రానికి విషయం అర్థం అయింది. తను ప్రకాశాన్ని ఎంత అపార్థం చేసుకున్నాడు ?

"ఎంత పనిచేశావు గౌరీ ! ప్రకాశం దేవుడిలాంటి వాడు. నీకు ఆశ్రయం ఇచ్చినవాడు." అన్నాడు బాధపడుతున్న స్వరంతో.

అప్పుడే లోపలకు వచ్చిన ప్రకాశం చంద్రం మాటలు విన్నాడు. ప్రకాశం మనస్సు తేలికపడింది. ప్రకాశాన్ని చూసిన చంద్రం క్షమించమని అడగాలనుకున్నాడు. కాని ఆ విషయం గురించి మాట్లాడాలనిపించలేదు.

'' ఎక్కడకురా వెళ్ళావ్. నీ కోసమే ఎదురు చూస్తున్నాం. పద భోజనం చేద్దాం? '' అన్నాడు చంద్రం.

'' పద వస్తున్నా. '' అంటూ షర్టు మార్చుకోవటానికి లోపలకు వెళ్ళాడు ప్రకాశం.

ఇద్దరకూ భోజనం వడ్డించడానికి గౌరి వంటింట్లోకి వెళ్ళింది.

* *

"నీ చాతగానితనమే ఇంతవరకు తెచ్చింది." కాంతమ్మ కంఠంలో మాటలు గరగరలాడాయి

ఆమె ఏ విషయం గురించి మాట్లాడుతుందో తెలుసుకున్న కృష్ణారావు చదువుతున్న పత్రిక నుంచి తలపైకి ఎత్తలేదు.

"అవ్వ! ఎంత అప్రతిష్ట! కుటుంబాన్ని బజారుకెక్కించినా నీకు చీమ కుట్టినట్టు కూడా లేదాయె, ఒక్కగానొక్క బిడ్డ దాన్ని పరువుగల కుటుంబం వాళ్ళు చేసుకోవాలా అక్కరలేదా? " కాంతమ్మ కంఠస్థాయి పెరిగింది.

అమ్మా నాన్న చూడకుండా స్నేహితుడు రాజాతో బయటకు బయలుదేరిన రజని మెట్లమీదే ఆగిపోయింది. తల్లీ దండ్రీ హాల్లో కూర్చొని ఏదో విషయంమీద ఘర్షణ పడుతుండటాన్ని గమనించింది. రాజాను మాట్లాడవద్దని సైగచేసింది.

అదుపూ ఆజ్ఞాలేకుండా పెరుగుతున్న రజని తనను ఎంతో పెద్దదిగా వూహించుకోసాగింది. నిండా పదమూడేళ్ళ లేని పసిది సహాధ్యాయి రాజాతో తల్లి దండ్రికి తెలియకుండా షికార్లు మొదలు పెట్టింది. రాజాకు పదిహేను సంవత్సరాలుంటాయి. తెలిసీ తెలియని భావాలతో అన్నీ తెలిసినవాడిలా నటిస్తాడు. ఇరుగ్గా వుండే పాయింటెడ్ బూట్లు, బిగుతుగా, కాళ్లకు అతుక్కున్నట్టుండే పాంటూ, బొమ్మల బన్నీను, ముందు జుట్టు ముఖంమీదకు పడుతూ, ఆడపిల్లకు మొగవాడి వేషం వేసినట్లుంటాడు. చూస్తూనే ఆ కుర్రవాడు వయస్సుకు తగ్గ భావాలు కలవాడులా కనిపించడు. మిడి మిడి జ్ఞానంతో దేన్నో. ఎవర్నో అనుకరించటానికి ప్రయత్నిస్తున్న కృత్రిమత అణువణువునా కనిపిస్తుంది. కాని ముఖంలోని చిన్నతనపు అమాయకత్వం విడిచిపోలేక తెచ్చి పెట్టుకున్న గాంభీర్యంతో పెనుగులాడుతుంది.

రజని రాజాలు ప్రేమికులు, కాదు అలా అని వాళ్లు వూహించుకుంటున్నారు. కాస్సేపు రజని లైలా అయితే మరి కాస్సేపు అనార్కలి అవుతుంది. స్కూలు కని వెళ్ళిన రజని ఎక్కడకు వెళుతుందో తెలుసుకోవటానికి ఎవరూ ప్రయత్నించలేదు.

కృష్ణారావుకు కొంచెం అనుమానం వచ్చి రజనిని మందలించబోయాడు. కాని కాంతమ్మ కస్సున లేచేప్పటికి కిక్కురు మనకుండా కూర్చున్నాడు.

మెట్లమీదనే ఆగిపోయిన రజని తల్లీదండ్రీ కీచులాటను ఏదో సినిమా చూస్తున్నట్లు కుతూహలంగా వినసాగింది.

'' ఇదుగో రాజా ! అమ్మా నాన్నా ఎలా పోట్లాడుకుంటున్నారో చూడు. మనంకూడా ఇవ్వాళ అలా పోట్లాట ఆట ఆడుకుందాం. సరిగా విను '' అంది ఉత్సాహంగా రజని.

రాజా ముఖం గంభీరంగా పెట్టి, '' ఇవ్వాళ సినిమాకు వెళ్ళాల్సిందే '' అన్నాడు.

'' అహఁ చెరువు ఒడ్డుకు వెళ్ళి ఆడుకుందాం. ''

'' నేను రాను. ' అన్నాడు రాజా ఆడపిల్లలా అలిగిన ముఖం పెట్టి.

" ఒక పందెం వేసుకుందాం " అంది రజని కళ్ళు తిప్పుతూ.

' ఏమిటి ' అన్నట్లు చూశాడు రాజా విసుగ్గా.

"అదుగో అమ్మ నాన్నా పోట్లాట క్లయిమాక్సుకు వచ్చింది. ఎవరు గెలుస్తారో చెప్పు," అంది రజని రాజాను సవాలుచేస్తున్నట్లు.

రాజా పై పళ్లతో కింద పెదవిని నొక్కి కొంచెం ఆలోచించి ''మీ నాన్నే గెలుస్తాడు,'' అన్నాడు. మగవాడు గెలవక మరి ఆడది గెలుస్తుందా అన్నట్లుంది రాజా ధోరణి.

''లేదు నువ్వు ఓడిపోతావు, అమ్మే గెలుస్తుంది. అమ్మ ముందు నాన్న ఎప్పుడూ ఓడిపోతాడు, "అంది రజనీ గర్వంగా.

''నేను ఒప్పుకోను, ఆడవాళ్ల ముందు మగవాళ్లు ఓడిపోవటం ఏమిటీ? అన్నాడు రాజా.

''సరే పందెం! చూస్తుండు అలా'' అంది రజని.

ఇద్దరూ శ్రద్దగా కృష్ణారావు, కాంతమ్మల ఘర్షణ వినసాగారు.

'' నన్నేం చెయ్యమంటావు కాంతం ! ఆ వార్త చదవగానే వాడికోసం కబురు పంపాను. వాడు వస్తేనా ? '' అన్నాడు తన అసమర్థతను ఒప్పుకుంటున్నట్లు.

'' వాడు రాకపోతే మీరే వెళ్ళండి. తప్పుతుందా. ఓ పదివేలు వాడి ముఖాన పారేసి ఆ ముండతో ఎక్కడకయినా పోయి వూరేగమనండి. '' అంది కాంతమ్మ.

కృష్ణారావు భార్య ముఖంలోకి అర్థం కానట్లు చూశాడు

"ఏమిటలా చూస్తారు బెల్లం కొట్టిన రాయిలా మనం ఈ వూళ్లో తలెత్తుకు తిరగాలా అక్కరలేదా ?" అంది కాంతమ్మ.

"అందుకని లక్షల వ్యాపారంలో భాగస్తుడయిన చంద్రానికి పదివేలు భిక్షం ఇచ్చి పంపించమంటావా ?" కృష్ణారావు గొంతులో కొంత కోపం కనిపించింది.

కాంతమ్మకు భర్త తెలివి తక్కువ చూసి ఆశ్చర్యం కలిగింది. మొదటి నుంచీ ఈ మనిషి ధోరణే ఇంత అనుకుంది.

"మీ తెలివి తెల్లారినట్లేవుంది. చంద్రం సమ భాగస్తుడేమిటీ! ఈ వ్యాపారాన్ని మీరు మీ చేతుల మీదగా పెంచారు."

"అందుకని—?"

"అందుకని పది కాకపోతే ఇరవయ్‌వేలు వాడి ముఖాన పారేసి పొమ్మనండి."

కృష్ణారావు కోపంతో లేచి నిల్చున్నాడు

"చంద్రం నాతమ్ముడు. ఈ ఆస్తి మా తాతగారిది. ఆ తరువాత ఎంత పెరిగినా చంద్రం కూడా సమభాగస్తుడే" కచ్చితంగా అన్నాడు కృష్ణారావు.

కాంతమ్మ కంఠం తారస్థాయినందుకుంది. కోపం ఏడుపూ నేను ముందంటే నేను ముందంటున్నాయి. ఆ గరగరలాడే గొంతులో.

చంద్రాన్ని దుమ్మెత్తిపోసింది. తనకూ తనబిడ్డకూ జరుగుతున్న అన్యాయాన్ని ఏకరువుపెట్ట సాగింది.

కృష్ణారావు కుర్చీమీద వున్న కండువాను భుజంమీద వేసుకుని గబగబా గారేజికేసి నడిచాడు. మరో క్షణంలో కారు స్టార్టయిన శబ్దం. కాంతమ్మ ముక్కు చీదేస్తూ చంద్రాన్ని శపిస్తూ లోపలకు వెళ్ళిపోయింది.

అంతవరకూ ఊపిరి బిగబట్టి వింటున్న రజనీ, రాజాలు, ఒకరి ముఖంలోకి ఒకరు నేనే గెలిచానన్నట్లు చూసుకున్నారు.

"మీ నాన్నే గెలిచాడు. మీ అమ్మ ఏడుస్తూ లోపలకు పోయింది." అన్నాడు రాజా చిరునవ్వును తెచ్చిపెట్టుకుంటూ.

"లేదు నేనే గెలిచాను. మా నాన్న అమ్మతో గెలవలేనప్పుడల్లా ఇంట్లోనుంచి అలాగే పారిపోతాడు." అంది రజని ధీమాగా.

"నేను ఒప్పుకోను. మీనాన్న మగవాడు. కోపం వచ్చింది కాబట్టి బయటకు వెళ్ళిపోయాడు." అన్నాడు రాజా మొండిగా.

రజని ముఖం కోపంతో ఎరుపెక్కింది. మూతి సున్నా చుట్టింది.

"అసలు నేను ఇవ్వాళ్ల నీతోరానుపో." అంది బుంగమూతి పెడుతూ.

"సరే మీ నాన్నే ఓడిపోయాడు. పద నువ్వు చెప్పినట్టు చెరువు దగ్గర కెళ్ళి ఆడుకుందాం" అన్నాడు రాజా తన ఓటమిని అంగీకరిస్తూ.

రజని ముఖం సూర్యోదయం చూసిన కమలంలా విచ్చుకుంది సంతోషంతో.

ఇద్దరూ చేతులు పట్టుకుని చిన్నగా ఇంట్లోంచి జారుకున్నారు

* * *

గౌరి కాఫీ తీసుకొచ్చి తాగమని అడిగేంతవరకూ చంద్రం రాస్తున్న నవలలో తనను తను మర్చిపోయి వున్నాడు ఆ నవల పూర్తిచేసి కాని హేమ దగ్గరకు వెళ్ళదలచలేదు చంద్రం. అప్పటికే పొద్దు బాగా వాటాలిపోయింది. ప్రకాశం ఎప్పుడు వచ్చాడో కూడా గమనించలేదు.

"ఎంతసేపయింది నువ్వొచ్చి!" అడిగాడు చంద్రం కాఫీ తాగుతూ ప్రకాశాన్ని. ఇంకా చంద్రం రచనమూడ్‌నుంచి బయటపడలేదు. పాత్రలు అల్లి బిల్లి తిరుగుతున్నాయి బుర్రలో.

"నేను వచ్చి అర్థగంటయింది. నువ్వు రాయటంలో పూర్తిగా మునిగిపోయి వున్నావు. అందుకే పలకరించలేదు." అన్నాడు ప్రకాశం గౌరిచేతిలో కాఫీ గ్లాసు అందుకుంటూ.

చంద్రం బాత్‌రూమ్‌కు వెళ్ళి చన్నీళ్లతో ముఖం కడుక్కున్నాడు. ఇన్ని నీళ్ళు నడినెత్తిన చల్లుకున్నాడు.

"నేను అలా కొంచెం చల్లగాలిలో తిరిగొస్తాను." అన్నాడు చంద్రం చెప్పులు తొడుక్కుంటూ.

"వెళ్ళిరా, నేనుకూడా వెళుతున్నాను. బహుశా రాత్రికి రాను." అన్నాడు ప్రకాశం

"అవునుగాని ప్రకాశం! నువ్వీమధ్య తిండికూడా సరిగా తినటంలేదు. ఏమంత తీరని పనులో నాకు అర్థం కావటం లేదు." అన్నాడు చంద్రం.

ప్రకాశం జవాబుగా నవ్వాడు. "మళ్లీ నీ మూడ్ చెడిపోతుంది. వెళ్ళు కాస్సేపు అలా తిరిగేసిరా." అన్నాడు ప్రకాశం.

చంద్రం నడుస్తున్నాడు. అతని ఆలోచనలన్నీ నవల ముగింపు చుట్టూనే తిరుగుతున్నాయి.

కారుహారన్ విని పక్కకు తప్పుకున్న చంద్రం కారులోకి చూశాడు. కృష్ణారావు కారు నడుపుతున్నాడు. పక్కనే గౌనులోవున్న ఓ ఆంగ్లో ఇండియన్ స్త్రీ. కబుర్లు చెబుతూ కారు నడుపుతున్న కృష్ణారావు తన కారుకు అడ్డం నడిచినవాడు చంద్రం అని తెలుసుకోలేదు. చంద్రం అలాగే నిల్చున్నచోట కొయ్యబారిపోయి కారు వెళుతున్నవైపు చూస్తున్నాడు. కారు కనుచూపుకు దూరం కాగానే చంద్రం ఈ లోకంలోకి వచ్చాడు. సశేషం.

# శ్రీ దేశభక్త కొండా వేంకటప్పయ్య పంతులు

డా. దివాకర్ల వేంకటావధాని

సకలజగత్పరివర్తనవ
శంబున బ్రహ్మము మూఁడుమూర్తులం
బ్రకటిత మైనయట్టులు ధ
రం దెలుఁగుందన మన్మహామహా
స్సకలుషితాకృతిత్రయము
నంది వెలింగెను, కొండ, కాశినా
యక, ఘనటంగుటూరి మహి
తాన్వయదుగ్ధపయోధిసీమలన్.

భరతోర్వీపరతంత్రతాఽపనయన
ప్రారంభ మాంధ్రావనీ
వరరాష్ట్రాభ్యుదయార్జనోద్యమము ని
స్స్వార్థమ్ము నీసేవచేఁ
బరిపుష్టిం గొని పొందఁ జాలినది సా
ఫల్యమ్ము, నీపేరు బం
గరువ్రాలన్ లిఖియింపఁగాఁ బడుఁ దదా
ఖ్యానద్వయిన్ ధీమణీ!

ఆంధ్రభాషాపత్రికాఽగ్రగణ్య మైన
'కృష్ణకు' రూపు తీర్చినది నీవు,
హరిజనోద్ధరణసేవాఽఽసక్తి నాశ్రమం
బొనగూర్చ నూత యిచ్చినది నీవు.
స్త్రీజనాభ్యుదయ మాసించి శారదపేర
శ్రీనికేతనము కూర్చినది నీవు
ఆంధ్రమహాసభాప్రారంభ మొనరించి
తెలుగులశోభ దిద్దినది నీవు
అనఘ! గ్రంథాలయోద్యమ మనెడిలతను
స్థిరముగా పాతి ప్రోది చేసినది నీవు
తెలుఁగువెలుఁగుకు నాద్య మౌతేజు నీవు
అమలగుణసాంద్ర! వేంకటప్పయ! సుధీంద్ర!

జగదభినంద్యవర్తనుఁడు
సాధుజనాగ్రణి యైనగాంధిజీ
విగళితదోష మూర్జిత మ
భిజ్ఞమనఃప్రమదాఽవహమ్ము నై
నెగడుభవచ్చరిత్రఁ గని
నిన్గురుపీఠమునం దమర్చె, నీ
యగణితగౌరవ మ్మెవరి
కబ్బె మనీషికి నీకుఁ దక్కఁగన్.

పయాగస్టుపదేశు భారతధరి
త్రీపారతంత్ర్యాంధ్యమున్
పాయం జేసెనొ నాఁడె నీతనుగత
ప్రాణానిలంబున్ మహా
వాయూర్మిప్రతిలీన మయ్యె నఁట! నీ
భావాఽళికిన్ మాతృభూ
శ్రేయస్సాధనసంపదాళికి మన
స్వీ! ఎంత సంబంధమో.

వరపురుషోత్తమాఖ్య సిరి
వల్లభు నివ్వలె, నీశ్వరాఖ్య శం
కరునటు, నింద్రనామము న
గప్రతిపంథినిఁ బోలె, భాష్య మన్
బిరుదు పతంజలిప్రచిత
నిస్తులశాస్త్రమునట్లు, నిన్ను కొ
క్కరువునె దేశభక్తసుభ
గప్రథితాభిధ మూఁదలించెడిన్.

పలుసభలందు భాషణము
బంధురభంగి నొనర్చునప్పు డ
న్యులవిషయంబు నందువలె
నుండద నీయెడ కాలనిర్ణయం
బలఘుడు మాలవీయుకటు
లార్యశిరోమణీ! యెంతయౌచితీ
లలితము లెంతభావమధు
రంబులు నైనవో నీదుసూక్తముల్.

అలఘుఁడు గాంధి పూనిన మ
హత్తర కార్యములందు బాసపై
యలరితి, పొంది కాంగ్రెసు స
భాఽధిపతిత్వము తెల్గువారిపే
ర్నిలిపితి, దేశభక్తి నెద
నింపితి, నాంధ్రధరిత్రికిన్ విని
ర్మలభవదీయజీవిత మ
మందశుభం బిడు నొజ్జబంతి యై.

తొలికొండ కొమ్ముపై నలరుకెంజాయనాఁ
బొలుపారు నొసలిపై బొట్టుతోడ
ఎదనిండు స్వచ్ఛత మొదల వ్యాపించెనాఁ
దనరారు దేశ్యవస్త్రములతోడ
ఆస్యేందు నిస్సృత మ్మయి తన్పు కావించు
నిద్దంపు నవ్వువెన్నెలలతోడ
దీనావనత్యాగదీక్ష వెల్లడి చేయు
వెడఁదకన్నుందోయి బెడఁగుతోడ
నతుల మౌదేశభక్తి కార్యానురక్తి
పొడవు దాల్చిన యట్టిమైమెఱుఁగుతోడ
నమరమూర్తివి కాన నీ వాంధ్రభూమి
ననఘ! యెచటనో నడచుచున్నట్లె తోఁచు.

# జనక, బుద్ధ, గాంధీజీల సమన్వయం రాజేంద్రబాబు

—కుమారి అనిసింగరాజు పద్మావతి

నేటికి 82 సంవత్సరాల క్రిందట, బీహార్ రాష్ట్రంలోని జీరాదేయీ అనే మారుమూలగ్రామంలో జన్మించారు డాక్టర్ రాజేంద్రప్రసాద్. నాటికీ, నేటికీ ఆగ్రామస్థులకు నారింజ అంటే వింత! ఇక ద్రాక్షమాట చెప్పనవసరమే లేదు! కలలో నయినా కనీవినీ ఎరుగరు. అటువంటి గ్రామంలో పుట్టిన రాజన్‌బాబు బాల్య జీవితమంతా ప్రాచీన రీతి రివాజులకు, మూఢ విశ్వాసాలకూ ఆలవాలమయిన మధ్య తరగతి కుటుంబంలోనే గడిచిపోయింది.

అంతటి అతిసాధారణ కుటుంబంలో పుట్టి పెరిగిన శ్రీ రాజేంద్రప్రసాద్, అఖిల భారత కాంగ్రెసు కమిటీకి అధ్యక్షు లయ్యారు. స్వతంత్ర భారత దేశానికి ప్రప్రథమ రాష్ట్రపతిగా ఎన్నుకోబడ్డారు. దేశరత్న, భారతరత్న మొదలయిన గౌరవ బిరుదులను పొంది, విశ్వ విఖ్యాతిని గడించిన మహా పురుషులలో ఒకరైనారు. ఆయన అకుంఠిత దేశభక్తి, నిరుపమానమయిన ప్రజాసేవ, గాంధేయ సిద్ధాంతములలో వారికి గల ప్రగాఢ విశ్వాసమూ, అచంచల దీక్షా తప్ప ఇతర కారణాలేవీ కనిపించవు.

ప్రథమ పరిచయలోనే, ఎదుటి వారిని మంత్రముగ్ధులను చేసే అద్వితీయ మయిన ఆకర్షణ గానీ, తన వాగ్ధాటితో ఇతరులను ఆకర్షించే అమోఘశక్తి గానీ, వారిలో అంతగా కనపడవు. మొగల్ చక్రవర్తుల ఠీవీ, దర్పమూ వారి ముఖంలో మచ్చుకయినా కనిపించవు. వారి చూపులు తీక్ష్ణమయి నటువంటివి కావు. మూతి బిగించి, కన్నెర్ర చేసి, ఒక్క నిమిషంలో, ఎదుటనున్న ఎంత శత్రువునయినా పిల్లినిచేసే భయంకరమయిన ఆకృతి కాదు వారిది. సామాన్య రైతులోని నిరాడంబరత్వం, వాత్సల్యం రాజేన్‌బాబుగారి ముఖంలో ప్రతిబింబిస్తాయి!

స్వతంత్ర భారతదేశ రాయబారిగా, మెక్సికో వెళ్లి తన పరిచయ పత్రాన్ని అందజేస్తూ, శ్రీమతి విజయలక్ష్మి పండిట్ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ గారి ఛాయా చిత్రాన్ని కూడా మెక్సికో అధికారులకు ఇచ్చారు. ఆ ఫొటో అనేక మంది చేతులుదాటుతూ వారినందరినీ ఆకర్షించింది. మెక్సికో రాష్ట్రపతి ఆఫొటోను తదేక దృష్టితో చూస్తూ "అరే! ఇది మెక్సికో రైతు ఫొటో లాగుంది! టోపీస్థానే 'సోబెరారో' (మెక్సికో రైతులు ధరించే టోపీ) ఉంచితే, నూటికి నూరు పాళ్లూ మెక్సికో రైతు బొమ్మే! అని ఆశ్చర్యపోయారు. రాజేంద్ర బాబుగారి వేషభూషణాలు అలాంటివి! ఎంతటి అందమయిన దుస్తులనయినా, ఆడంబరం లేకుండా, అతి సామాన్య పద్ధతులలో ధరించే అలవాటు వారిది. దుస్తుల విషయంలో గానీ, ఇతర అలంకరణల విషయంలో కానీ ఆయన అంత శ్రద్ధ తీసుకునే వారు కారు. ఆయన తలమీద టోపీ ఎన్నడూ సరిగా ఉండేదికాదు. సభలలోనూ, సమ్మేళనాలలోనూ, రాజకీయ విందులలోనూ, అది వంకరగా జారిపోతూఉండేది. దాన్ని సవరించుకునే సమయంలో, ఆయన తలపై నాట్యమాడే చిన్నారి ముడి దృగ్గోచరమయ్యేది. ఏనాడయినా పది నిమిషాలసేపు అద్దంముందు ఉంటే ఒట్టి తలదువ్వుకోవాలనే గుర్తుగూడా వారికి ఉండేది కాదేమో! ఈ నిర్లిప్త స్వభావాన్ని, నిర్లక్ష్యపు వేషమునూ చూచిన మోతీలాల్‌జీ, ఒకసారి శ్రీ రాజేన్‌బాబునిలా ప్రశ్నించారు "అసలు మీరు దుస్తులు ధరించడమెందుకూ?" కొంచెం తటపటాయిస్తూ "శరీర రక్షణకు!" అన్నారు రాజేంద్రబాబు! "ఈదుస్తులనే సవ్యంగా అందంగా ధరిస్తే, ప్రాచీన హైందవ చక్రవర్తులలా ఠీవిగా, ఆకర్షణీయంగా ఉంటారు కదా! అన్న మోతీలాల్ నెహ్రూ గారి మాటలు, రాజేంద్రబాబును ఆశ్చర్య పరిచాయి.

ఇక ఠీవి విషయమా?...తెచ్చి పెట్టుకుందామన్నా వారికి చేతకానిదది. రాజకీయలాంఛనాలను నెరవేర్చేందుకని అప్పుడప్పుడూ షెర్వాణీ ధరిస్తూండేవారు. లాంఛనం పూర్తి కాగానే, అదివిప్పి మామూలు పంచే, లాల్చీ ధరించేవరకూ వారికి తోచేది కాదు. రాష్ట్రపతి భవనంలో అడుగుపెట్టిన నాటి నుండే వారి పద్ధతులలో కొంచెం మార్పుకనిపించినా, వేప పుల్లను వదిలి టూత్‌బ్రష్ వేపు ఎన్నడూ మొగ్గలేదాయన! వారి భోజనం కూడా మామూలు భోజనమే! చపాతీ, పప్పూ అన్నం, ఒకటి రెండు కూరలు. చివరకు ఒక 'సందేష్' ముక్కతో బ్రహ్మానందం పొందేవారు. మామిడి పండంటే ఆయనకు మహాప్రీతి! మొక్కజొన్నకండెపై ఆయనకున్న మోజు ఇంతంతకాదు. వివశులై వారు టీ త్రాగుతూండే వారు. కానీ, టీలో ఎంత పంచదార కలపాలి?...అనే కళను మాత్రం వారు చివరవరకూ నేర్చుకోలేకపోయారు. "మీ కెంత పంచదార కావాలి?" అని ఎవరయినా ప్రశ్నిస్తే, "మీ ఇష్టం" అని నవ్వుతూ సమాధాన మిచ్చేవారు. అది విని ఆ టీ ఆరాధకులు విస్మయం చెందుతూ ఉండేవారు!.

రాజేన్‌బాబు గారు శుద్ధ శాకాహారులు. కానీ వారి కుటుంబంలోని వారు, వారి ప్రక్కనున్న వారు, వారికుటుంబ

సభ్యులందరూ, శాకాహారులు కారు. ఆయన అహింసా సూత్రాలను అక్షరాలా పాటించేవారు. "దయ, సానుభూతి'' ఈ రెండు సద్గుణాలూ వారిలో జీర్ణించుకపోయినట్లనిపిస్తుంది. విశ్వశాకాహార సమ్మేళనం జరిగినప్పుడు, ఒక పత్రికా ప్రతినిధి వారినిలా ప్రశ్నించారు. "నేటికీ రాష్ట్రపతి భవనంలో కంకా మాంసం వడ్డన జరుగుతున్నట్లుందే?...'' "నేను శాకాహారినే కానీ, నా ప్రభుత్వం శాకాహారి కాదు'' అని జవాబిచ్చారు రాజేంద్రబాబు.

ఎంతటిచిక్కు ప్రశ్ననయినా, ఎంత జటిల సమస్యనయినా చిటికలో పరిష్కరించి సులభం చెయ్యగల చాకచక్యం వారిది. చేతులు జోడించి, హృదయపూర్వకంగా పిన్నా, పెద్దా అందరికీ నమస్కరిస్తూ, జనసందోహం మధ్య నుండి ఆయన వెడుతుంటే, వారి వినయ విధేయతలను, దేశీయులే కాదు, విదేశీయులుకూడా శ్లాఘించేవారు. సేవాగ్రామ్‌లో గానీ, సబర్మతీలోగానీ అడుగుపెట్టగానే వారి నేత్రాలు బాష్పపూరితములయ్యేవి ఈ సన్నివేశాలను "రాష్ట్రపతికన్నీటిధారలు'' అనే పతాక శీర్షికలతో చిత్రీకరించేవి పత్రికలు.

చంపారన్ సత్యాగ్రహంతో రాజేంద్రబాబుగారి జీవితంలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమయింది. నాటి నుండీ వారు మహాత్ముని అడుగుజాడలలో నడవటం ప్రారంభించారు బీహారు భూకంపం వారికొక అగ్నిపరీక్ష! ఆ పరీక్షలో ఉత్తీర్ణులై, భారతరాజకీయాకాశంలో సాటిలేని మేటి తారగా ప్రకాశించారు. కాంగ్రెసునావ, సమస్యల సాగరంలో ఊగులాడుతున్న క్లిష్ట పరిస్థితులలో నాయకులందరూ రాజేంద్రబాబుగారి చేతికే చుక్కాని అందించి నిశ్చింతగా ఉండేవారు. వారందరి ఆశలకూ అనురూపంగానే, తుఫానును ఎదుర్కొంటూ నావను గట్టెక్కించేవారు రాజేంద్రప్రసాద్! రాజ్యాంగవిధానసభకు అధ్యక్షులుగా భారత రాజ్యాంగాన్ని తయారు చెయ్యటంలో వారు సలిపిన కృషి అమోఘమయినది. రాజ్యాంగ నిర్మాణపు రోజులలో వారు చూపిన ఓర్పు ఎనలేనటువంటిది. భారత రాష్ట్రపతిగా, దేశానికీ, ప్రజలకూ వారు చేసిన సేవను లెక్కించటం అంత సులభమయిన పనికాదు.

మన ప్రజాతంత్ర పరిపాలన తొలిరోజులలో, నూతన పరిపాటులను, పద్ధతులను ఏర్పరచి నలువైపులా నూతన కాంతులను వెదజల్లారు డాక్టర్ రాజేంద్రప్రసాద్. రాష్ట్రపతి భవనంలో నలుదిశలా స్వచ్ఛంద వాయువులు ప్రసరించాయి. విదేశీ వస్త్రాలస్థానాన్ని, స్వదేశీ ఖద్దరు ఆక్రమించుకుంది. అలంకరణ సామాగ్రి భారతీయత సుస్పష్టంగా కానవచ్చేది. మొగల్ ఉద్యానవనంలో వసంతం విరాజిల్లినది. నర్తనశాల, అశోకకక్షలో సాహిత్యగోష్ఠులూ, సంగీతకచ్చేరీలూ, సభలూ-సమావేశాలు, విరివిగా జరిగేవి. కవాలీ విన్నా, కవిత విన్నా తన్మయత్వంతో వివశులయ్యే వారు రాజేంద్రబాబు సంగీతాస్వాదన చేస్తూ, వారు చలించి పోయేవారు. భగవద్గీతా, రామాయణ పఠన సమయాలలో, వారు మౌన తపస్వి వలె కూర్చొని, తమ హృదయాంతరాళాలను పరిశీలించుకుంటూ ఉండేవారు! కానీ వారి అసలయిన ఏకాగ్రత సూత్ర యజ్ఞ సమయంతోనే బహిర్గతమయ్యేది!

రాజేంద్రబాబు సాధారణంగా చేసే రైలుప్రయాణాలు జన సామాన్యాన్ని విశేషంగా ఆకర్షించేవి. చిన్న చిన్న స్టేషన్‌లలోకూడా, వేలాది ప్రజలు...తమ రాష్ట్రపతిని దర్శించాలనే ఉత్కంఠతతో గంటలు గంటలు ఎదురుచూస్తూ నిలబడేవారు. ప్రాతఃకాలంలోగానీ, సాయం సమయంలోగానీ మిట్ట మధ్యాహ్నంలోగానీ, అర్ధరాత్రిలోగానీ, ఆయన చెదరని చిరునవ్వుతో వారిని పలకరించేవారు. మితిమీరిన ఉత్సాహంతో ప్రజలు చేసే జయ జయ ధ్వానాలమధ్య ముందుకు సాగిపోయేది రైలుబండి. రాజధానీ నగరంలోని ఉన్నత భవనాల పైనమాత్రమేకాక, దేశంలోని మారుమూలల పల్లెలోకూడా రాష్ట్రపతి పతాకం ఎగసి ఎగసి వినువీధులలో రెపరెపలాడుతూ ఉండేది. ఎంతో భక్తి శ్రద్ధలతో, మందిరాలను, మసీదులనూ, గురుద్వారాలనూ, దేవాలయాలనూ సమభావంతో దర్శించేవారు రాజేంద్రబాబు. జలుబుతో బాధపడుతూ కూడా రామేశ్వరం సమీపంలోని, బాలభానుని బంగారు కిరణకాంతితో మిల మిలా మెరిసిపోయే పవిత్ర సముద్ర జలాలలో మునకలు వేసిన రాజన్‌బాబుగారి, ధార్మికశక్తి ప్రజలను ముగ్ధులను చేసేది.

దేశంలో భావాత్మక ఐక్యతకూ, ప్రజలలో భారతీయతను సుస్థిరం చేసేందుకూ, రాష్ట్రపతిగా రాజేంద్రప్రసాద్ చేసిన కృషి అద్వితీయ మయినది! ఆంధ్రుల రాజధానీ నగరమయిన హైదరాబాద్‌లో "రాష్ట్రపతి నిలయం" స్థాపించటంలోనూ, దక్షిణ భారతదేశంలో జరిగే స్వాతంత్ర్య దినోత్సవాలలో తరచుగా పాల్గొంటూ వారికి స్ఫూర్తినివ్వటంలోనూ రాజేంద్రబాబుగారి యొక్క ఈ ఆంతర్యం తేటతెల్లమయ్యేది!

సాధువులయిన మహాత్ములవలె, భారత రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్‌గారు కూడా తమ జీవితాన్ని అతి నిరాడంబరంగా, నిర్మలంగా నిరహంకారముగా కొనసాగించారు. నేటి మన రాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణన్‌గారి మాటలలో రాజేంద్రబాబుగారు జనక, బుద్ధ, గాంధీల సమన్వయం.... ఆ ముగ్గురి ప్రభావం రాజేంద్రబాబుపై ఉంది. రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ మూర్తీభవించిన భారతీయత. ఆయన అజాత శత్రువు. అందుకనే ఆయన కోట్లాది భారతీయ హృదయాలలో రాజేంద్రుడుగా వెలుగొందగలిగారు!



# గృహిణి

పిలకా గణపతిశాస్త్రి

సీరియల్:

## జరిగిన కథ

పార్థసారథికి నాటకాలపిచ్చి. ఆ నాటకాల్లోపడి రాత్రి ఆలస్యంగాకూడ ఇంటికి వచ్చేవాడు. ఆ విషయమై భార్యాభర్తలమధ్య పొరపొచ్చాలు వస్తూండేవి. రాఘవ నాట్యకళా మండలిద్వారా పార్థసారథి నాటకాలు వేస్తుంటాడు. ప్రస్తుతం కృష్ణాతులాభారం రిహార్సలు జరుగతున్నవి. సరోజ అనే ఆమె కూడా అందులో ఒక పాత్రధారిణి సరదాకు సరోజ పార్థసారథివద్ద పాట నేర్చుకోనని రాఘువ అనే మరొకతనివద్ద నేర్చుకుంటానని అన్నది సరోజ విద్యాభివృద్ధికై తాను చేసిన ప్రయత్నాలను, సరోజ వాళ్ళ ఆర్థిక పరిస్థితులను పార్థసారథి జ్ఞాపకం చేసుకుంటాడు. సరోజ, తన చెల్లెలు పుట్టినరోజు పండుగ సందర్భంగా పార్థసారథి భార్యను ఆహ్వానించడానికి ఆయన ఇంటికి వెళ్తుంది.

ఆ తరవాత పేరంటానికి వెళ్ళవలసినదని పార్థసారథి విజయలక్ష్మికి రెండు మూడు సారులు చెప్పి చూశాడు. కాని ఆమె ఆమాట బొత్తిగా వినిపించుకోలేదు. అందుచేత అతనికెంతయినా కోపం వచ్చింది. అయితే అది అంతా మనస్సులోనే దిగమింగుకుని గుంబనగా మాట్లాడకూరుకున్నాడు. ఆ మరునాడు మధ్యాహ్నందాకా భార్య భర్తలిద్దరు బాగా ముభావంగానే ఉన్నారు. భోజనాల వేళ మాత్రం విజయలక్ష్మికి తనపట్టు సడలించక తప్ప లేదు. ఆ తరవాత క్రమ క్రమంగా కులాసాగానే మాట్లాడింది.

మధ్యాహ్నం సుమారు మూడు గంటల వేళ పోస్టులో ఒక ఉత్తరంవచ్చింది. విజయలక్ష్మి అది అందుకుని అదే పనిగా రెండు మూడు సారులు చదివి పట్టరాని సంతోషంతో తలమునకలయింది.

ఏమండీ! ఇదిగో! కృష్ణమూర్తి బావకి పెళ్ళిటండి.

ఆ ఉత్తరంతో తొందరగా లోపలికివచ్చి. హాలులో కుర్చీలోకూర్చుని తాంబూలం సేవిస్తున్న భర్త చేతికందించింది. అది అల్లుడి పేర మామగారు రాసినఉత్తరం. బెజవాడలో ఆపై వారమే కృష్ణమూర్తి వివాహం. దానికందరు తప్పక రావాలి. నాలుగయిదు రోజులు ముందుగావస్తే అంతా కలిసి పెళ్ళికి తర్లివెళ్ళవచ్చును. ఎప్పుడు బయలుదేరి వచ్చేది తిరుగు టపాలో తెలియజెయ్యాలి. ఇంకా ఏవేవో వివరాలున్నాయి కాని మొత్తంమీద ఆ ఉత్తరం సారాంశం అది. దానివల్ల కృష్ణమూర్తి తల్లిదండ్రులకన్న మామగారే ఎక్కువగా ఆ వివాహం భారం వహిస్తున్నారని పార్థసారథి క్షణంలో గ్రహించుకున్నాడు. అందుచేత కొంతవరకు తన కుటుంబం తోడ్పాటు ఆశిస్తున్నారని కూడా అవగాహన చేసుకున్నాడు. కనకనే తిరిగి ఇంకొకమారు ఆ ఉత్తరం చదివి ఆ తరుణంలో తన కర్తవ్యాన్నిగురించి ఆలోచన ప్రారంభించాడు.

ఇక విజయలక్ష్మి ఆ పక్కనే లక్కపిడతలతో ఆడుకొంటున్న సీత, పాపనెత్తుకుని ముద్దులతో ముంచెత్తుతూ పలకరించింది.

'ఏమే పాపా! ఎంచక్కా కొత్త చొక్కా తొడుక్కుని తాతగారింటికి పెళ్ళికి వెడదామా?'

ఆ పసిపిల్ల అది తనకేమి అర్థంకాకపోయినా దానికెంతో సంబరపడుతునట్టు ముసిముసి నవ్వులు చిలకరించింది. విజయలక్ష్మి ఇంకొకసారి అదే ప్రశ్న రెట్టించి భర్త ఆలోచన ధోరణి గమనించి ప్రశ్నించింది.

'ఏమండీ! ఎల్లుండే బయలుదేరి వెడదామండీ!'

ఆమె గొంతులో ఎంతో అనునయం ప్రతిధ్వనించింది.

'అలాగే వెడదాంలే! కాస్త మంచిరోజు చూడనీ! ఇంతా చేస్తే ఎల్లుండి మంచిదోకాదో కనుక్కోవాలి మరి.

'అంత మంచి కాకపోతే ఈవేళో రేపో నిర్యాణం పెట్టుకుంటే సరి!'

ఆ సంభాషణ విని అక్కడికివచ్చిన వర్ధనమ్మ మనవరాలి ముఖతః ఆ శుభ వర్తమానం చెవిని పడగానే ఎంతో సంతోషించింది. కాస్త నాలుగయిదు రోజులు ముందుగానే బయలుదేరవలసిందని పార్థసారథిని ప్రోత్సహించింది.

'నాకు, రావాలనేఉంది. కాని నాటకాని కన్నీ సిద్ధంచేసుకుని కూర్చున్నామే! ఎలాగాఅని ఆలోచిస్తున్నాను. అంతే!'

'ఆ నాటకం ఇంకోరెండు వారాలు వెళ్ళిన తరవాత వేసుకోవచ్చునులెండి!'

భార్య ప్రాధేయపడుతున్న ధోరణిలో చల్లగా సలహా చెప్పింది.

వాయిదా వెయ్యడానికి నేను ఒక్కణ్ణే కాదుగా! అందరు ఒప్పుకోవాలి మరి! ఏమి చెయ్యడానికి పాలుపోవడం లేదు.

పార్థసారథి తిరిగి ఆలోచనలో పడ్డాడు. కాని మరు క్షణంలోనే అతని మనస్సు 'సరోజ అలాగ అకస్మాత్తుగా ఎందుకు వచ్చిందా ? అని వితర్కించడం మొదలు పెట్టింది.

' ఎందుకంత ఆలోచన ? దీనికంత గుంజాటన ఎందుకు ?

విజయలక్ష్మి మరింత ఆత్రంగా అడిగింది.

హఠాత్తుగా నిద్రలో నించి మేలుకున్నట్టు తటాలున తన తలపోత ముగించాడు పార్థసారథి.

' పోనీ, ఒక పని చేస్తే ? '

' ఏమిటాపని? '

విజయలక్ష్మి కొంచెం అనుమానపడి అడిగింది.



' బామ్మగారిని తీసుకుని నువ్వు, పిల్లలు ముందు బయలు దేరండి '___?

' మరి మీరో ! '

' నేను ఆ తరవాత బయలు దేరి వస్తానులే !

' మీరు రారు ! నాకు తెలుసును ! మీరు కూడా మాతో పాటు బయలుదేరి రండి ! లేక పోతే నేనసలు వెళ్ళకే వెళ్ళను.

'కాదు ! విజయా ! తప్పకుండా బయలుదేరి వస్తానులే ! నా కామాత్రం మర్యాద తెలియదనుకున్నావా?'

అయినా విజయలక్ష్మి అలాగే మూతి ముడుచుకుని కూర్చుంది. నాలుగయిదు క్షణాల వరకు వారిద్దరి మధ్య మరి సంభాషణ కొనసాగలేదు. అంతలోనే వర్ధనమ్మ మనవరాలికేసి చూసి బుజ్జగించింది.

'నాటకం వెయ్యాలని ఇంతకుమునుపే నిర్ణయించుకున్నారేమోనే ! పోనీ, కాస్త మనం ముందు బయలుదేరదాము ! ఆ తరవాత అతను వస్తాడులే ! దానికేం !'

'అనుకున్న తేదీకి నాటకం వెయ్యకపోతే వెయ్యిరూపాయల దాకా నష్టం వస్తుంది ! లేకపోతే మీతో బయలుదేరి రావడానికి నాకభ్యంతరమేమిటి ?'

తన పరిస్థితి సమర్థించుకున్నాడు పార్థసారథి.

ఈసారికి వేషం వెయ్యడానికి వీలుపడదని చెప్పండి ! మీ రొక్కరు వెయ్యకపోయినంత మాత్రాన అది ఆగిపోదులెండి!'

'సరిపోయింది! నాటకానికంతటికి పెట్టుబడి పెడుతున్న వాణ్ణి నేనేకదా? మరి నేనే లేకపోతే ఎలాగ?'

పార్థసారథి తిరిగి నెమ్మదిగా బ్రతిమాలుకున్నాడు.

అయినా విజయలక్ష్మి తన పట్టు విడిచిపెట్టలేదు! ముఖము మరింత చిట్లించుకొని తలవంచుకుని కూర్చుంది. పార్థసారథి మరి లాభంలేదని గ్రహించి తటాలున లేచి ధుమధుమలాడుతూ కండువా బుజంమీద వేసుకుని దురుసుగా వీధి గుమ్మంవైపు నడక సాగించాడు! ఎక్కడికలాగ తొందరగా వెళ్ళిపోతున్నారు?' అని అడగాలని అనుకున్నది విజయలక్ష్మి. కాని భర్తముఖవైఖరి గమనించిన తరవాత మరి నోటమాట పెగలలేదు! మరుక్షణంలోనే అతడు చరచరా నడిచి వీధిలోపడి అదృశ్యుడయినాడు!

ఇటీవల సరోజ ప్రవర్తనలో కనిపించిన వింతమార్పువల్ల ఆమె ఇంటిలో అడుగుపెట్టడానికి పార్థసారథికంతగా ఉత్సాహం కలగలేదు. కాని నాటకం అంటూ తలపెట్టిన తరవాత అది మధ్యలో నిలిపివెయ్యడం అతనికెంతమాత్రము రుచించలేదు. అదేగాక! సరోజ తలవని తలంపుగా తన ఇంటికివచ్చి, భార్య నెంతో ఆప్యాయంగా పేరంటానికి పిలిచింది. ఆ సంఘటన మరింతగా అతనిలో ఆశ్చర్యము, జిజ్ఞాస రేకెత్తించింది. సరోజ మొట్ట మొదట రానని చెప్పింది, కాని అకస్మాత్తుగా వచ్చింది! నిజంగా

ఆమె విజయలక్ష్మిని పేరంటానికి పిలవడానికే వచ్చిందా? లేక ఆ వంకపెట్టి తిరిగి తనతో ఒకసారి మాట్లాడడానికే వచ్చిందా? వెనక, ఏదో మాటల సందర్భంలో సరోజ విజయలక్ష్మిని ఒక సారి చూడాలని ఉబలాటపడింది. కనక పేరంటం మిషమీద భార్యనొకసారి పలకరించడానికే వచ్చి ఉండవచ్చునని అనుమానించాడు. కాని అంతలోనే అది అతనికంతగా నచ్చలేదు. సరోజ తిరిగి తనతో కులాసాగా మాట్లాడడానికే వచ్చిందని నిశ్చయించుకున్నాడు. ఆ నిర్ణయం పార్థసారథికెంతో ఉత్సాహం కలిగించింది. సరోజ మాట్లాడిన తీరునిబట్టి చూసినా అదే సరిఅయిన కారణమయినట్టు స్ఫురించింది. నిజానికి ఆమె ఉట్టిపడుతున్న ఆప్యాయతతో ఎంతో కులాసాగా మాట్లాడడం వల్లనే అతనికి తిరిగి సరోజతో సంభాషించాలన్న తహతహ కలిగింది.

తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ పార్థసారథి రంగనాయకి ఇంటికి చేరుకున్నాడు. అల్లంత దూరంలోనే అతనికి మేడమీద హార్మోనియంతో జత కలిపిన రాఘవ గొంతు కొంత అస్పష్టంగా వినిపించింది. అప్పుడే సరోజ పాటలేవో నేర్చుకోవడం ప్రారంభించింది కాబోలును!? అని ఆశ్చర్యపడ్డాడు. మరింత త్వరగా అడుగులు వేసుకుంటూ తిన్నగా మేడమీది హాలులోకి వెళ్ళిపోయాడు.

రాఘవ సరోజ ఒకరొకరి కెదురుగా కూర్చుని ఏదో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు. హార్మోనియమ్ ఒక్కటే వారిదరికి అడ్డుగాఉన్నట్టు కనబడింది. ఆ సమయంలో పార్థసారథికి సరోజ ముఖంలో అంతకుముందెన్నడులేని సరికొత్త చలాకీతనం స్ఫురించింది ఆ నాడామె ఉల్లిపొర వంటి తెల్లని చీరమీద లేత నీలిరంగు సేలంపట్టు జాకెట్టు అలంకరించుకున్నది. ఎన్నడు లేనిది రాఘవ ఆవేళ ఉలెన్ పాంట్ వేసుకున్నాడు. దానిమీద చక్కని తేనెరంగు సిల్కు కమీజు తొడుక్కున్నాడు. బొత్తాములు లేని దాని మోచేతి అంచులు వెనక్కి మడిచి బిగించుకున్నాడు. ముఖంమీద బంగారు ఫ్రేమ్ చలవ కళ్ళజోడు తళ తళ లాడుతున్నది!

పార్థసారథిని చూడగానే వారిద్దరు కొంచెం కంగారు పడ్డట్టు కనిపించారు. సరోజ తటాలున లేచి చిరునవ్వు చిలకరింపుతో ఆదరభరిత స్వరంతో నెమ్మదిగా అడిగింది.

'కొంచెం కాఫీ తీసుకుంటారా ?'

కాని అతనికాప్రశ్నలో అనుకున్నంత ఆదరణ స్ఫురించలేదు.

'అక్కరలేదు! ఇపుడిప్పుడేపుచ్చుకున్నాను. రిహార్సల్ పెంద్రాళ్ళే మొదలుపెడితే మంచిదని కొంచెం ముందుగానే వచ్చేశాను.'

సరోజ మరి బలవంత పెట్టలేదు. తిరిగి నెమ్మదిగా కుర్చీలో కూర్చున్నది. ఆ విధంగా బలవంతం చెయ్యకపోవడం పార్థసారథి కానాడు కొంత వింతగా తోచింది. అంతలోనే సరోజ యాథాలాభంగా అడిగింది.

'మీ పని పిల్లకి ఒంట్లో నింపాదిగా ఉందా?'

'ఆఁ నింపాదిగానే ఉంది. కాస్త పులకరం తగిలితే మా ఆవిడ అనవసరంగా కంగారుపడి కాళ్లు విరగదొక్కుకుంటుంది. అంతే!'

'పేరంటానికి రాకపోతే జ్వరంగాని ఏమయినా ఎక్కువయిందేమో అనుకున్నాను.'

'వద్దామనే అనుకుంది గానీ, తీరా బయలు దేరే వేళకి పని పిల్ల అదే పనిగా పోరు మొదలు పెట్టింది. ఎంత ప్రయత్నించినా మరి నా దగ్గిరికి రాలేదు.

నెమ్మదిగా సర్ది చెప్పాడు పార్థసారథి. కాని అతనేదో కల్పించి మాట్లాడుతున్నట్టు ఇట్టే కనిపెట్టి వేసింది సరోజ.

ఆ పైన వారి సంభాషణ క్రమక్రమంగా కృష్ణ తులాభారంపైపు తిరిగింది. మొత్తం మీద అందరితోను కలిసి రిహార్సల్ నడిపించడం జరగలేదని వారికప్పటికి స్పష్టపడింది. అందు చేత ఆ వ్యవహారం ముందు ముందు ఆలోచించుకోవచ్చునని నిశ్చయించుకున్నారు. ప్రస్తుతానికి వీలయినంత వరకు ముఖ్య పాత్రలతోనే రిహార్సల్ కొనసాగించాలని సంకల్పించుకున్నారు.

సత్యభామ, శ్రీకృష్ణుడు, రుక్మిణి, నారదుడు ఆ నాటకాని కత్యంత ముఖ్యులు. సత్యభామ సంగతి తేలిపోయింది. ఆ వేషం సరోజ వేసి తీరవలసిందే! పార్థసారథికిగాని, రాఘవకిగాని అసలా సంగతి ఆలోచించవలసినంత అగత్యమే కలగలేదు. ఇక కృష్ణ పాత్రధారి వ్యవహారం తేలాలి. రాఘవే ఆ వేషంవేస్తే బాగుంటుందని సరోజ అంతకుమునుపు ఒకసారి స్పష్టంగా కుండబద్దలు కొట్టినట్టు చెప్పింది. అంతర్యంలో ఎంతో ఉబలాట పడుతున్నా అతడు పైపైకి మాత్రమే అది తన కిష్టంలేనట్టు నటించాడు. అంతే!

ఇన్నాళ్ళనించి ఎవ్వరెవ్వరు ఏయే వేషాలు వెయ్యాలో ఇందమిత్థంగా నిశ్చయించుకోవడం జరగలేదు. పార్థసారథి, రాఘవ కృష్ణ వేషమో, నారదవేషమో, లేకపోతే ఇంద్రవేషమో ఏదో ఒకటి వెయ్యవచ్చునని అనుకున్నారు. నిజానికి అవసరమువస్తే, వారిద్దరు ఏవేషమయిన వేసి రక్తి కట్టించగలరు. కనకనే వారంత ఖచ్చితంగా ఆ వ్యవహారం తేల్చుకోవడం జరగలేదు. ఇక ఇప్పుడు ఏదో ఒకటి నిర్ణయించక తప్పలేదు. అయితే ఆ సంగతి తనకేమి పట్టనట్టు గుంబనగా మాట్లాడకూరుకున్నాడు పార్థసారథి.

రెండు మూడు నిమిషాలు గడిచిన తరవాత రాఘవకిక ఆ ముసుగులో గుద్దులాట బొత్తిగా నచ్చలేదు. ఇక ఏదోవిధంగా తేల్చుకోక తప్పదని నిశ్చయించుకున్నాడు. 'సరోజా! నామట్టుకి నాకు కృష్ణవేషం పార్థసారథి వేస్తేనే బాగుంటుందని అనిపిస్తూంది సుమా! మరి నువ్వేమంటావు!?

ఆమె దానికి సమాధానం చెప్పకుండానే పార్థసారథి తటాలున కల్పించుకున్నాడు.

'ఆ వేషం నేనే వెయ్యాలని ఎక్కడుంది? పోనీ ఈసారికి రాఘవే అదివేస్తేనేం? నేను నారదుడివేషమో! ఇంద్రుడి వేషమో వేస్తాను! దానికేం?

'ఆ రెండిటికి కూడా నువ్వు బొత్తిగా పనికిరావు?

రాఘవ తటాలున అతని మాట కడు తగిలి హేళనగా నవ్వాడు. తనకి కృష్ణవేషమే వెయ్యాలని ఉన్నా, అతడలాగ బొత్తిగా తీసివేసినట్టు మాట్టాడడంతో పార్థసారథి అహానికి గట్టి దెబ్బ తగిలింది.

'వాటికి నేను పనికివచ్చేది లేనిది ఆనాడు స్టేజిమీదే తేలి పోతుందిగా! అప్పుడు నీచేతే చక్కగా ఉందని ఒప్పిస్తాను సరిగదా?

తాను వేసిన పాచిక పారిందని రాఘవ లోలోపల సంతృప్తి పడకపోలేదు కాని పైపైకి మాత్రం మర్యాద కోసం నీళ్ళు నమిలాడు.

అబ్బె! ఆవేషాలు వేయడం నీకు చేతకాదని కాదు నేననేది! అవి నీకంతగా నచ్చవేమోనని ఆలోచించాను అంతే! ఇంతకి నువ్వు ఏమంటావు సరోజా?'

'మధ్యని నా ఇష్టంతో పనేమిటి? ఆ సంగతి తేల్చు కోవలిసింది మీలోమీరే?

అంతకు మునుపు ధోరణిని బట్టి ఆమె తాను వేసిన పన్నాగానికెలాగయినా తోడ్పడగలదని రాఘవ బాగా ఉబలాట పడ్డాడు. కాని సరోజ ఏసంగతి తిన్నగా తేల్చిచెప్పలేదు. ఇంతకి ఆమె లోలోపలి అభిప్రాయమేమో తెలియక రాఘవ తిక మక పడ్డాడు. కనక ఆ వ్యవహారం నిష్కర్షగా తేల్చుకోవాలని సంకల్పించుకున్నాడు.

'సారథీ! దీని కోసం ఇంత గుంజాటన ఎందుకు? నువ్వు కృష్ణ వేషం వేస్తువున్నావు! నేను నారద వేషం వేస్తున్నాను! ఇక దీనిని గురించి ఆలోచనలనవసరం తెలిసిందా?'

'అయినా పార్థసారథికి సరోజ ఆంతర్యమేమో ఆరా తీయ్యాలని ఆసక్తి కలిగింది. అందుచేత అర్థ కుసిగా నీళ్ళు నమిలాడు.

సరే, నువ్వన్నట్టే చేయవచ్చును. దానికేంగాని తలవని తలంపుగా అవాంతరం హఠాత్తుగా ఏదయినా వస్తుందేమో! కనక మనం ఇద్దరము, ఈ రెండింటికి సిద్ధపడడం మంచిదేమో?

'నిజమే నీ ఆలోచన మంచిదే! అంతగా ఏదయినా అవాంతరం వస్తే నేను సర్దుకుంటానులే! కాని ఇక ఈ క్షణంనించి నువ్వు కృష్ణుడివి! నేను నారదుణ్ణి తెలిసిందా?'

'అయితే ఇక మీరు మా ఇద్దరిమధ్య లేనిపోని తగాదాలు లేవదీస్తారన్నమాట! అవునా!'

సరోజ ఒక ఛలోక్తి విసిరి కుర్చీమీద చేర్లబడి రాఘవకేసి పార్థసారథికేసి చూసి కలకల నవ్వింది. దానినిబట్టి ఆమె కా ఏర్పాటు నచ్చినదని రాఘవ గ్రహించుకున్నాడు. అది అతని కెంతయినా ఆశ్చర్యం కలిగించింది! అయినా ఆ భావం వ్యక్తం కానీయక తానుకూడా ఒక ఛలోక్తి విసిరాడు.

'అన్యాయంగా నారదుడి మీద నింద మోపుతున్నావు గాని అసలు ఈ రభస అంతా లేవదీసిన దానవు నువ్వే!'

దానిమీద అందరు రవంతసేపు కులాసాగా నవ్వుకున్నారు. కాని సరోజ చెక్కిళ్ళపై రవంత రక్తిమ పొడకట్టింది. పార్థసారథి ఒకకంట ఆ సంగతి పసికట్టినా, ఏదోవిధంగా తన సంకల్పం నెరవేరింది గదా అని ఎంతో సంతోషించాడు కాని మనస్సులో అనుమానం మాత్రం పూర్తిగా తొలగలేదు. మొట్టమొదట ఆ ప్రస్తావన వచ్చినప్పుడు రాఘవే కృష్ణ వేషాని కన్నివిధాల తగిన వాడన్నట్టు సరోజ మాట్టాడింది. ఇక ఇప్పుదేదో ఒక సంగతి నిష్కర్షగా తేల్చవలసి వచ్చినప్పుడు తనకేమి పట్టనట్టు వట్టితటస్థ వైఖరి అవలంబించింది! దీనికేమిటి కారణము? ఎంతగా ఆలోచించినా అతనికా జటిల సమస్య నిష్కర్షగా పరిష్కారం కాలేదు. మొట్టమొదట అలాగనుకున్నా సరోజ ఇప్పటికీ తన అర్హత గుర్తించి ఉండవచ్చునని నిర్ణయించుకుని కొంతవరకు సంతృప్తిపడ్డాడు.

'అయితే మరి అనవసరంగా కాలక్షేపం చెయ్యడమెందుకు? ఇంక రిహార్సల్ ప్రారంభిద్దామా?

రాఘవ సరోజకేసిచూసి ప్రోత్సహించాడు,

'ఎక్కడినుంచి మొదలుపెట్టమన్నారు?'

'ఇక ఈవేళకి మొట్టమొదటినించి రిహార్సల్ జరపడానికి వీలుపడదేమో!'

తన సందేహం వ్యక్తీకరించాడు పార్థసారథి.

'అవును! నిజమే! అప్పుడే ఏడున్నర కావచ్చింది, పోనీ ఈ వేళకి ఏదో ఒక చిన్న పద్యం చదువు!'

రాఘవ దానికంగీకరిస్తూ నెమ్మదిగా సలహా ఇచ్చాడు.

'ఏ పద్యం చదవమన్నారు?'

సరోజ పార్థసారథి వైపు చూసి అడిగింది.

'ధనధాన్యాదికముల' అన్న పద్యం చదువు! మొలకెత్తుతున్న చిరునవ్వుతో సూచించాడు పార్థసారథి. రవంతసేపాలోచించి, అది చదవమన్నందులోనే దాని అంతరార్థం గ్రహించుకుని సరోజ ఆశ్చర్యపడింది. తనలో ఇటీవల కనిపించిన మార్పునుబట్టి అతడా విధంగా కోరి ఉండవచ్చునని ఇట్టే పసికట్టివేసింది. అంతలోనే రాఘవ చిరునవ్వు చిందుస్తూ అందుకున్నాడు.

"అది మంచిపద్యమే! కాని దానికన్న 'ఇక నీగీచిన గీటు దాటనని' అన్నది మాంచి రక్తి కట్టించే పద్యం కాదా! అది చదవ రాదూ!'

'పోనీ! ఇది అదికూడా చదువుతాను దానికేం!'

సరోజ ఠపంత సిగ్గుపడి రాఘవకేసి తిరిగి మొట్టమొదటి పద్యం చదవడం మొదలుపెట్టింది.

'ధనధాన్యాదికముల ధమ
ఢానగూరిచి మరలగొనిన నోర్వగవచ్చున్!
మనసిచ్చి మరల గైకొన
మననగునే మానవతికి త్రానిపరేణ్యా!'

సరోజ, అది మధ్య మధ్యన నెమ్మదిగా ఆపి జేగడ రాగంలో బాగా భావయుక్తంగా చదివి అభినయించింది. అంత వరకు పార్థసారథిచూపు తన చెక్కిళ్ళలోనే చిక్కుపడినదని ఆమె ఆకళింపుకున్నది. అయితే ఆ పద్యం తాననుకున్నంత చక్కగా చదవలేక పోయానని కొంచెం కించపడినట్టు మాట్లాడింది. కాని పార్థసారథి మాత్రం బాగా పాడి అభినయించావని అభినందించాడు. అయినా సరోజ తిరిగి తన అసంతృప్తి వెల్లడించింది.

'ఏమో! నాకంతగా నచ్చలేదు. సుమండీ!'

'ఏం బాగానే చదివి అభినయించావు! నువ్వు అనుకున్నంత పాడలేదు!'

కొంతవరకు సమర్థించాడు రాఘవ. అయినా ఆ స్వల్ప ప్రశంసతోనే సరోజ ముఖం మరింత చక్కగా వికసించినదని పార్థసారథి కనిపెట్టాడు.

'మరి నేను చెప్పిన పద్యం కూడా మొదలుపెట్టు! ఊరికే కూర్చుని చదవడం కాదుమరి! అచ్చంగా స్టేజిమీద ఉన్నట్టే నిలబడి అభినయించాలి! తెలిసిందా?'

ఆ సలహామీద సరోజ మొట్టమొదట కొంచం సంకోచించింది గాని, ఆ తరవాత ఎడతెగని ప్రోత్సాహంవల్ల నెమ్మదిగా లేచి, రాఘవకేసి తిరిగి మృదుమధురమయిన కంఠస్వరంతో మోహన రాగంలో 'ఇకనీ గీచినగీటు దాటనని వింతే' అన్న పద్య అభినయ పూర్వకంగా చదవడం మొదలు పెట్టింది.

'ఇదేమిటి? నాకేసి తిరిగి పద్యం మొదలు పెట్టావు! నేనింక కృష్ణుణ్ణి కాదు! తెలిసిందా? నారదుణ్ణి! పార్థసారథికేసి తిరుగు!'

అకస్మాత్తుగా అడ్డు తగిలాడు రాఘవ.

'ఎవరికేసి తిరిగితేనేం! పద్యం కొనసకంటా చదవనీ!'

అన్నాడు పార్థసారథి అది తనకంతగా పట్టనట్టు.

'ఏదయినా అవాంతరంవస్తే మీరుకూడా కృష్ణ వేషం వేస్తున్నారుగా!'

సరోజ తన చర్య చక్కని చాకచక్యంతో సమర్థించుకుంది.

'అవాంతరంవస్తే అప్పటిమాట ఆలోచించుకోవచ్చునులే! ముందు మనం అనుకున్నట్టుగా తిన్నగా రిహార్సల్ జరగనీ! అతనికేసి తిరిగి అచ్చంగా స్టేజిమీద వున్నట్టే చదువు!'

బ్రతిమాలుకుంటున్న ధోరణిలో మళ్ళీ ప్రోత్సహించాడు రాఘవ. సరోజ మరి కాదనలేక, పార్థసారథికేసి తిరిగి మళ్ళీ ఆ పద్యం అదే రాగవరసలో నెమ్మదిగా చదివింది.

'ఇక నీ గీచిన గీటు దాటనని ఎన్నోమార్లును దండిగ నిచ్చకముల్ నచ్చగ బల్కి బల్కి, తుదకీ చందాన సవ్రీలలో నెకసక్కెంబుల పాలుచేసి ఇటు రానేలా! ఒక్కసారి, కుత్తుక ఖండించి, సపత్నులంగలిసి సంతోషింపగా రాదొరో!

'సెహబాస్! చాలాబాగా ఆలాపించావు!

ఆమె పాట ఆకాశానికే ఎత్తివేశాడు పార్థసారథి.

సరోజ కాప్రశంస సంతోషం కలిగించకపోలేదు. అయినా మీరేమంటారన్నట్టు అలమోకగా రాఘవకేసి చూసింది. వెంటనే అతడందుకున్నాడు.

'నువ్వీ పద్యం చదివాక! 'అయ్యో! కృష్ణవేషం చమ్కీచాన్సుపోయిందే!? అని నొచ్చుకున్నాను సరోజా! ఇంత గొప్పగా పాడి అభినయించగలవనుకోలేదు సుమా!

ఆ తరవాత పెద్ద టేబిల్ లైటుతో అక్కడికి వచ్చిన పనిమనిషి అది అక్కడ ఒక బల్లమీద పెట్టి తిరిగి కిందకి వెళ్ళిపోయింది. అదే తరుణంలో సరోజ నెమ్మదిగా కుర్చీలో చతికిలపడింది.

'నిజంగానేనా! అంత బాగా చదివానా?' చక్కగా పాడినట్టు సంపూర్ణ సంతృప్తి కలిగినా, తన కంతగా నచ్చనట్టు ఎంతో ఆత్రంగా అడిగింది.

'నిజంగానే సరోజా! చాల గొప్పగా పాడి అభినయించావు! నాటకానికంతటికి ఇలాంటివి నాలుగయిదు పద్యాలు, పాటలు రక్తి కడితే చాలదూ?

మరింతగా మెచ్చుకున్నాడు రాఘవ.

పార్థసారథి టేబిల్ లైటు వెలుగు పడి తళతళ లాడుతున్న సరోజ చెక్కిళ్ళ మీది లోలక్కుల కదలికలు, ఏకాగ్రదృష్టితో పరిశీలిస్తున్నాడు. అందుచేత వారి సంభాషణ తిన్నగా వినిపించక దానిలో పాల్గొనలేదు. అంతలోనే రాఘవ ఇనుమడించిన సంతోషంతో సరోజ ముఖం మీద చూపు నిలిపి ప్రోత్సహించాడు.

'అసలు నువ్వు పద్యం మోహనతో చదివావు గాని, మాల్కోస్‌లో చదివితే మరింతగా రక్తి కడుతుంది! ఏమయ్యా! సారథీ! ఏమంటావు!?

అంతవరకు ఆమె లోలక్కుల కదలికలలో లీనమై బాగా పరధ్యానంగా ఉన్న అతడాప్రశ్నతో కొంచెం ఉలిక్కి పడి

ఆ సమయానికి తనకి తోచినట్టు ఏదో ఒక సమాధానం చెప్పాడు.

'అవును ! నిజమే. మాల్కోస్‌లో చదివితే ఇంతకన్న బాగుంటుంది.'

'ఒక సారి ఈ పద్యం మాల్కోస్‌లో చదువు సరోజా ! వినాలని ఉంది'

రాఘవ ఎంతో ఆత్మీయంగా బ్రతిమాలు కున్నాడు.

'ఏమో బాబూ ! మాల్కోస్ నాకంతగా అలవాటు లేదు!'

సరోజ రవంత బెట్టు సరిచేసింది.

'భయంలేదులే! అనవసరం కాలక్షేపం చెయ్యక చదువు!'

రాఘవ తిరిగి బ్రతిమాలుకున్నాడు.

సరోజ మరి కాదనలేక ఆ పద్యం అందుకుని రవంత రాఘవవైపు తిరిగింది. 'ఇక నీగిచిన గీటు దాటనని ఎన్నోసార్లు నాదండ నిచ్చకముల్ నచ్చర బిల్కి బిల్కి' అని చదువుతూ ఆ చివరి మాటలు రెండు ఆ రాగంతో ఎంతో జాలిగా రంగరించింది. 'ఇపుడీ చందాన' అని పైపదాలు రెండు అందుకునేలోగానే లోలో పలి వించి ఉప్పెనలా ముంచుకువస్తున్న నవ్వుని గ్రహించుకోలేక కుర్చీలోకూలబడి రాఘవకేసి చూసి విరగబడి నవ్వడం మొదలు పెట్టింది !

'ఎందుకలాగ నవ్వుతావు!' నిలువునా నిర్ఘాంతపడి అడిగాడు పార్థసారథి.

'మాంచి రసకందాయంలో పద్యం అంతా పాడుచేసేశావు! ఎందుకంత వెకిలినవ్వు! కొంపతీసి రేపు స్టేజిమీదకూడా ఇలాగే నవ్వుతావేమిటి ?

రాఘవ మరింతగా చిరాకుపడ్డాడు.

'నేను పద్యం చదువుతూంటే నాతోబాటు మీరుకూడా కళ్లెగరవేసి అభినయిస్తూంటే మరి నవ్వు ఆగలేదండీ!'

సరోజ తిరిగి అలాగే విరగబడి నవ్వడం ప్రారంభించింది. ఆ ధోరణితో పార్థసారథికి ఒక్కసారుగా చిరాకు తలకెక్కింది. ఇక ఒక క్షణమయినా అక్కడ కూర్చోలేక పోయాడు!

'అప్పుడే బాగా చీకటిపడ్డట్టుంది. మరి నేను వెళ్ళాలి.'

నెమ్మదిగా ఆపలిస్తూ చిటికవేసి నిలుచున్నాడు పార్థసారథి. అతని ధోరణి గ్రహించడానికి రాఘవకెంతో సేపు పట్టలేదు.

'ఉండు! ఒక్క నిమిషం ఆగు! నేనుకూడా బయలుదేరుతున్నానులే! ఇక ఈవేళకి రిహార్సల్ సాగనట్టేలే!'

రాఘవకూడా లేచి నిలుచున్నాడు. 'ఎంతగా ఆపుకోవాలనుకున్నా నవ్వు ఆగలేదండీ! ఈవేళ ఆయన కొంటెతనం మూలానే పద్యం పూర్తిగా చదవడం పడలేదండీ?'

చెంగలిస్తున్న చిరునవ్వుతో సరోజ నిందమోపుతున్నట్టు రాఘవవైపు నిర్దేశించింది. తప్పు మన్నించమన్నట్టు పార్థసారథి మీద క్రీగంటిచూపు నిలిపింది.

'సరేలే ! దానికేంలే !' అని అతడు నెమ్మదిగా వీధి గుమ్మం వైపు నడక సాగించాడు. మరి, కొన్ని క్షణాలలోనే రాఘవ అతనినసుసరించాడు. అయితే ఎడతెగని చిరాకుతో మదనతో అతిత్వరితంగా తన ఇంటివైపు సాగిపోతున్న పార్థసారథి అది గమనించనేలేదు. ఆ ధోరణి పసికట్టిన రాఘవ కూడా అతని నిక పలకరించక తన దారిని తాను తరలిపోయాడు.

ఆనాటి సరోజ రాగంలో, అభినయంలో లాలిత్యము, ఆ పద్యం చదువుతున్నప్పుడు ప్రతి అక్షరంలోను తొణికిసలాడిన ప్రగాఢానురాగము, జాలువారేని జాలి అతని హృదయంలో గట్టిగా ముద్రించినట్టు లోతుగా హత్తుకుపోయాయి. ఇంటికి వెళ్లి ఆదరా బాదరాగా భోజనం ముగించుకుని పందిరి పట్టెమంచంమీద మేనువాల్చిన చాలా సేపటిదాకా అతని హృదయంలో ఆనాటి ఆమె రూపురేఖల మనోజ్ఞ ముద్రలలాగే నిశ్చలంగా నిలిచిపోయాయి. కాని సరోజ అలాగ అకస్మాత్తుగా విరగబడి వెర్రిగా కలకల నవ్వినతీరు మాత్రం గుండె లోతులలో అప్పుడప్పుడు విపరీతంగా కలవరం కలిగించింది. !

( స శే షం )





శ్లో॥ తాసాం ముఖైరాసవగంధగర్భైః
వ్యాప్తాంతరాః సాంద్రకుతూహలానామ్।
విలోలనేత్రభ్రమరైర్గవాక్షాః
సహస్రపత్రాభరణా ఇవాసన్॥ —కాళిదాసకవి.

'అత్యంత కుతూహలము గలస్త్రీలు మద్య గంధముచేత 'వాసితములు' చంచలములైన కన్నులు అను తుమ్మెదలచే ఒప్పుచున్నవియునైన తమముఖములను కిటికీలలో ఉంచి వెలుపట చూచుచుండిరి. అట్టిముఖములచేత ఒప్పుచున్న కిటికీలు కమలములతో అలంకరింపబడినవా యనునట్లు ఒప్పెను.

శ్లో॥ వాతాయనేభ్యస్తు వినిస్సృతాని
పరస్పరోపాసితకుండలాని।
స్త్రీణాం విరేజుర్ముఖపంకజాని
సక్తాని హర్మ్యేష్వివ పంకజాని॥ —అశ్వఘోషకవి.

“కుండలములచేత అలంకరింపబడి కిటికీలనుండి బయలు వెడలిన స్త్రీల ముఖకమలములు, మేడలకు అలంకరింప బడిన కమలములా యనునట్లు ప్రకాశించెను.

చ॥ ధనపతితో దరిద్రునకుఁ దత్త్వవిదుం డగువానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుక్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూథితోడ నవరూథికి సజ్జనుతోడఁ గష్టదు
ర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే? —నన్నయభట్టారకుఁడు.

కం॥ లోకము నిర్మర్యాద
త్వాకులమై చెడదె సజ్జనావళి మధుపా
నాకాంతుఁ డొలఁగకున్న గు
ణాకల్పా! యేమి సేయ దక్కఁడు నరున్? —తిక్కన సోమయాజి.

చ॥ సమదరిపుప్రయుక్తపటుసాయకజర్జరితాంగుఁ డయ్యు, దుః
ఖమును దొలంగి నిద్రఁ గనుఁ గాని కృశింపఁడు మానవుండు నో
యుమ! విను మిష్టబాంధవదురుక్తులు మర్మము లంట నాటఁ జి
త్తమున నహర్నిశంబు పరితాపము నొంది కృశించుచాడ్పునన్. —పోతనామాత్యుడు.

“శత్రువులబాణములచే గాయపడినవాడుగూడ సుఖముగ నిద్రించగలడు. కాని బంధువుల మాటలుపడి నిద్ర పట్టక క్షీణించును.

క॥ నుత—వర్ణాంతర—నిమ్నో న్నతతల—నిశిలోఁ జూచిన నానావస్తు
స్థితి సమము సేసె గతగౌ రత జీఁకటి దుర్వివేకి రాజ్యము పోలెన్. —నన్నెచోడుడు.

"అంధకారబంధుర మైనరాత్రులందు, వివిధవర్ణములు, మిట్టపల్లములు (పెంచ్చు—తగ్గులు), పెద్ద—చిన్న (గొప్పవారు—నీచులు) ఈ మొదలైనవస్తువులకు భేదము లేక, వివేకములేని పాలకుని రాజ్యమునందలి వస్తువులవలె అన్నియు సమానములుగఁ దోచెను.

చ॥ లలితసరోజరాజినిఁ దొలంకుకొలంకుకలంకులందు నె
మ్ములు నడలించి పావడలు ముద్దుగఁ దాల్చి లతాంగు లొండొ లోన్
పిలుచుచు నీరు సొచ్చిరి తమిం దనమోములు చన్నులున్ భుజం
బులుఁ గను ల్లలతామరసమూలముమాదరి చూడనుంబలెన్. —రఘునాథరాయలు.

కాంతలు తామరకొలనులో జలక్రీడలు సేయుటకు పోవగా, నచట తమముఖములు తామరపువ్వులుగను, స్తనములు తామరమొగ్గలుగను, భుజములు తామరతూఁడులుగను నుండుటను చూచి తమయవయవములకు మూలము కమలమే యని యనుకొనిరి.

శా॥ చోరాగ్రామ్యగజాంకుశంబు, నలినీశుంభన్మదేభంబు, ది
వ్యారీమౌక్తికదర్పణంబు రజనీకాంతామనోహారివి
స్తారాంభోధితరంగకారి, గిరిజాప్రాణేశభాస్వజ్జటా
శ్రీరమ్యాభరణంబు చంద్రుఁ డుదయించెన్ సుప్రభాభాసి యై. —కవిభల్లటుడు.

క॥ బలవంతుఁడు మన్నించిన బలహీనుఁడు బలియుఁ డనఁగఁ బను ధారుణిలో
వలరాయఁడు చేపట్టినయలరులు బాణములు గావె యాశ్వికకందా! —కందనామాత్యకవి

క॥ దూరము పని గలగతిఁ జను నూరక యిల్లిల్లు సొచ్చు నొగి జీ యనఁగాఁ
గూరదు సిగ్గున సుజనులఁ జేరదు చిత్తంబు గ్రామసింహమువోలెన్. —మడికి సింగన.

మ॥ కరి నేలింది పులిక్క, ద్రౌపదికి కోకల్ వచ్చి యిచ్చింది ద
బ్బర, కాకాసురునిన్ గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం బహో
శర ణన్నన్ బగవానితమ్మునికి రాజ్యం బిచ్చుటల్ కల్ల యి
త్తరి న న్నేలిన నిక్క మీకథలు కృష్ణా! దేవకీనందనా! —కవి రాజుసుఁడు.

తే॥ గీ॥ శక్తి వెలి యైనఁ గావ్యోక్తిసాధనంబు లెల్లఁ జీఁకటియింటిలో నిడినసరకు;
లెన్ని ఋతువులు గల్గిన నెట్లు పూచు మహి వసంతాగమము లేక మావిమోక. —చిన్నకోటపెద్దన.

సీ॥ పచ్చగాజులయొప్పు పచరించుచేతుల
సంకుటుంగరములచాయ లెసఁగ;
నిగనిగల్ దొలఁకాడు బిగువుచన్నులమీఁద
గురువిందపూసలసరము దనర;
ధవళతాళపలాశతాటంకరుచి మించు—
చెక్కులఁ జిరునవ్వు జీరువారఁ
గొప్పున కందనికురుల నించుక దోఁచు—
నుదుటి జేవురుబొట్టుకుదురు మెఱయ;

తే॥ గీ॥ సన్నవలిపంపుటొల్లియ సగము గట్టి, సగము ముసుఁగిడి యొయ్యారముగ మెఱుంగు—
కంచుమెట్టెలు మెఱయంగఁ గడఁక వచ్చె—నప్పిలంసినిఁ దగ మెచ్చె నపనిసురుఁడు. —మడికి అనంతామాత్యుడు.

## హేమంతము.

మ॥ స్మరదర్పోప్పముని వాసభూమి లసుమసీ శంకించె నాఁగన్ దమం
దొరయం బోక హిమంబు ముజ్జగములందున్ వ్యాపనం బూన; న
బ్బుర మౌనమ్ముకు నిమ్ము లౌకొమలచవ్వొంతల్ విజృంభించె ను
ద్ధురకేంద్రీకృతచూతసాయకము దుర్ధాంతదుర్గస్థితిన్. —ఆంధ్రవిజ్ఞాన.

శ్రీపాద లక్ష్మీనారాయణ మూర్తి

# ఆంధ్ర దర్శనము

అదె నాగార్జునసాగర మ్మదియె యీఆంధ్రప్రదేశైకసం
పద; సాంకేతికవిద్య పెట్టిన అపూర్వంబైనభిక్షమ్మ; నీ
రదముల్ దిక్కని నమ్మి మోసపడుతత్ప్రాంతానికిన్ జీవన
ప్రదమైరూపము దాల్చుచున్నఘననిర్మాణమ్ము సామాన్యమే

పందలును వేలు జీవనోపాధిగాంచ;
కోట్లవిలువైన పంట నెక్కువగ పొంద;
అధికమైన విద్యుచ్ఛక్తి యవతరింప;
సాగు నదిగో నాగార్జునసాగరంబు.

ఈలువు రూపమంది ప్రవహించుచు నుండెడి కృష్ణవేణి శ్రీ
శైల సమీపమందు జలశక్తి ప్రణాళిక సాగునట్లుగా
వీలొదవించె; నాంధ్రులకు వేయి విధమ్ముల జీవితమ్మసౌ
ఖ్యావహమై సమస్త భరతావనికిన్ మకుటాయమానమై

ఆగోల్కొండ శిలాను వీడి హృదయాహ్లాదంబుగా కొంత ద
వ్వేగన్ గన్పడు సాగరద్వితయమా "ఈసా" యు "మూసీ" నదీ
భాగమ్ముల్ సమకూర్చి పెట్టినవి; తత్ప్రాంతంబునన్ దివ్యశో
భాగణ్యమ్ములు "పార్కు" దృశ్యములు లభ్యంబౌ విహారార్థమై

క్రొత్తగ వచ్చు యాత్రికులకున్ సదుపాయము లెల్లగూర్చుచున్
చిత్తము వచ్చుచోటి కతి శీఘ్రముగా గొనిపోయి దృశ్యసం
పత్తికి తావలమ్మయిన ప్రాంతము తొంబది మైళ్లచుట్టి ఆ
పత్తనమందు నిత్యము సెబాసు "మనోరమ" సార్థకాఖ్యమై

తనజలమ్ములు నిరంతరము పొందగ జంట
నగరముల్ స్నానపానమ్ములకును
తన తీరమందు నుద్యానవనమ్ములు
"షాలమార్ గార్డెన్సు" సౌరు చూప
తన చెంత బహుసౌఖ్య ధామమ్ములై యాత్రి
కాళికి వసతిగృహమ్ము లమర
తన మీద తేలి మెల్లన చల్లగా వచ్చు
చిరుగాలి పరిమళశ్రీలు గూర్ప

వేల కొలదిగ ఎకరాలు విస్తరిల్లు
చూచు వారల హృదయముల్ దోచుకొనుచు
భాగ్యనగరంపు నేటి నవాబు పేర
చక్షురుత్సవ ముస్మాను సాగరమ్ము.

రమణీయమ్మయి సేద్యయోగ్యముగ నీరమ్ముల్ ప్రసాదించి క్షే
త్రములన్ సస్యసమృద్ధి గూర్చుచు విశాలంబై విహారార్హ దృ
శ్యములు ద్యానవనమ్ములుం గలిగి నేత్రానందముంగూర్చు నా
హిమయత్సాగర మాంధ్రులెల్లరును గర్వింపంగ శోభిల్లెడున్.

చక్కదనాల నర్సాపూరు లేసులు
నల్లిక దుస్తుల యందములును
పేరంది నట్టి "ఏలూరు" "వరంగల్లు"
పంపు తివాసీల పనితనమ్ము
ధర్మవరంబు పెద్దాపురంబు తయారు
చేసిన సిల్కుల చెలువములును
నాణ్యమైన కరీము నగరంపు వెండి తీ
గల నగిషీ వస్తువుల సొగసులు

తుంగ చాపలు దంత వస్తువులసౌరు
కాంతలువ్విళులూరెడు గాజులెల్ల
కలిగి ఆంధ్రప్రదేశ భాగ్యంపు చిన్నె
గా తనర్చును పట్టణాంగణము లెపుడు.

గోల్కొండ యువరాజు కులి కుతుబ్‌షా ప్రియు
రాలికై ఏప్రవాహమున దుమికె
సామ్రాట్పదవికంటె స్వచ్ఛమౌ ప్రణయమ్ము
అధికమంచే ప్రవాహమ్ముచాటె
రాజ్యప్రతిష్ఠ పుత్రప్రేమ కడనల్ప
మనుచు నేనదికి వంతెన దనర్చె
మతము లంతస్థులు మనసుల వేరుచే
యవటంచు నేనది సాక్ష్యమిచ్చె

ఒక్క సామాన్య నర్తకి నొక్కమారు
రాణిగా జేసి మల్కిభ రాము మనసు
నేప్రవాహము ప్రేమ వర్షింపజేసె
నదిగో! అట్టి మూసీ నది కదలుచుండె.

అందంపు ప్రకృతి దృశ్యములు ఛాయాచిత్ర
కారుల కన్నుల కరువు దీర్ప
నిర్మల కాసార నికట స్థలమ్ములు
వాహ్యాళి కనువగు వసతి గూర్ప

ప్రాచీన భవన నిర్మాణ నైపుణ్యమ్ము
పరిశోధకులకు సంబరముగూర్ప
నాణెంపు నగలు సన్నని నేత బట్టలు
కొనవచ్చు జనముల కోర్కెదీర్ప

నన్నిరకముల ఆహారమందజేయు
వివిధ భోజన శాలలు విందు గూర్ప
భాగ్యనగరము యాత్రికపాళికెల్ల
భూతల స్వర్గముగ దోచి ఖ్యాతి గాంచు.

ఎందును లేవె భాషలు మహీస్థలి దేశములందు పల్కుతీ
యందనమున్ మనోహరం లయాను గుణత్వము. వింతవింతలౌ
ఛందములున్ చమత్కృతుల చక్కదనంబును గల్గు తెల్గుతో
నెందును సాటియౌనె! మనమెంతయదృష్టము చేసికొంటిమో

రాజాధి రాజులే ప్రణమిల్లి మోయ ప
ల్యంకికారోహ భాగ్యమ్ము నంది
సార్వభౌమ ప్రశంసా పురస్సర భవ్య
కనకాభిషేక భాగ్యమ్ము పొంది
పరమ తపోవిధుల్ పడయని హరిహర
బ్రహ్మ సాక్షాత్కార భాగ్యమంది
అశని పాతము గాగ నమృత స్రవంతి గా
నిగ్రహానుగ్రహ నిపుణత గని

నాటి నుండియు క్రమముగా నేటివరకు
అఖిల సారస్వత ప్రకియల దనర్చి
దేశభక్తి పూరితులుగా తీర్చి ప్రజల
నాంధ్ర కవితా కుమారి సద్యశముగాంచె.

శ్రమదానమొనరించి జనులు గ్రామాలలో
భవనముల్ బాట లేర్పాటుచేయ
శాస్త్రీయ మగు వ్యవసాయ పద్ధతినేర్చి
ఎక్కువ పంట పండించుచుండ
ఆత్మ గౌరవము స్వయంసహాయమ్మును
ప్రగతి మార్గములుగా పరిగణింప
సహకార పరపతి సంఘముల్ నెలకొల్పి
ఆవశ్యకమ్మైన అప్పులొసగ

పంచవర్ష ప్రణాళికల్ ప్రజలకెల్ల
సర్వతోముఖాభ్యుదయంబు సంతరింప
భరతమాతృ పుత్రికలలో ప్రథమపదము
నంది ఆంధ్రప్రదేశంబు విందు గూర్ప.

వంశధారా తుంగ భద్రాపినాకినీ
నాగావళీ నదుల్ నావియంచు
త్యాగరాజాన్నమార్యక్షేత్రయాదిక
భక్త గాయకులు నావారెయంచు
శ్రీవరాహనృసింహ దేవ ద్రాక్షారామ
భీమేశ్వరులు నాదు వేల్పులంచు
తిరుపతి వేంకటేశ్వరులును "శ్రీపాద"
పండిత కవులు నావారెయంచు

గరువమున చెప్పుకొనెడు భాగ్యమ్ము తెల్గు
వారలకు జన్మహక్కుగా పరిణమించె,
నన్నిరంగాలలో విజయమ్ము పొంది
ఘనత నిల్పుకొనంగ కంకణముగట్టి.

కేల గత్తిని దాల్చి యాలమ్ములో దుర్గ
వోలె నిల్చిన జవరాలొకర్తె
కలము చేతనుదాల్చి సలలిత మృదు పద్య
ముల రామకథ వ్రాసెవెలదియొకతె
పిరికి తనమ్ముచే తిరిగి వచ్చిన మనో
హరు నాజి కనిపె సుందరియొకర్తె
పరుల చేతుల జిక్కు దురవస్థ రానీక
ఉరికె నగ్నిజ్వాల గరితయొకతె

అన్ని రంగాలలోన ముందంజ వేసి
పురుషులకు తీసి పోమంచు బోధపరచి
తెలుగు తల్లికి వన్నియ తెచ్చినట్టి
కాంతలీనాటికిని గర్వ కారణమ్ము.

మునుపక్షరాలె నేర్వని పల్లెటూరిలో
భాసించెనున్నత పాఠశాల
మునుపు దారియు తెన్ను గనరాని పల్లెకు
లభియించె చక్కని రాచబాట
మునుపు రోగచికిత్స పూజ్యమౌ గ్రామాల
ప్రాప్తించె సంచార వైద్యశాల
మునుపు వర్షాధారముగనున్న చేలకు
ప్రత్యక్షమయ్యెను పంటకాల్వ

దేశ మందెల్ల చోటుల దినదినమ్ము
వృద్ధి జెందు పంచాయతీ పద్ధతులకు
సముచిత స్థానమిచ్చు రాష్ట్రప్రభుత్వ
మమలు జరిపెడు కార్యక్రమములచేత.

·.·.·.0.·.·.·

**సీరియల్ :**

# భాగ్యచక్రం

"నాకు వైజాగ్‌లోకూడ అంతగా చనువైన వాళ్ళెవరూ లేరు. ఉంటే వాళ్ళ లేడీస్ నెవరినైనా కాస్త సెలెక్ట్‌చేసి తెచ్చి పెట్టమనవచ్చు." అన్నాడు నగేష్.

"అవును." జయశ్రీ.

"పోనీలేమరి. ఏంచేస్తాం? వీలైనప్పుడే వెళ్ళవచ్చు. ప్రస్తుతం ఓ నర్సును మాత్రం మాట్లాడి తీసుకొస్తాను."

శ్రీదేవి కల్పించుకున్నది. "పోనీ నీతోనే తీసుకువెళ్ళు అమ్మాయిని' అంత ఆలోచనదేనికి?"

జయాశ్రీనగేష్ ఇరువురూ ఉలికిపాటుతో చూచారు.

"నాతోనా?" అన్నాడు శ్రీనగేష్ నివ్వెరపాటుతో.

"అవునుమరి మంగమ్మ పది రోజులకుగాని రాదు. అయినా అంతకంటె నీతో తీసుకువెళ్ళడమే మంచిదిగా? ఆడవాళ్ళిద్దరూ పోయి బజార్లన్నీ తిరిగి ఎలావస్తారు?"

శ్రీనగేష్ కొంచంసేపు ఆలోచించి అన్నాడు: "వద్దులేమ్మా. అక్కడ ప్రస్తుతం ఒక హాస్పిటల్‌లోని పేషెంటు నా స్నేహితుడు. అతడికక్కడ వైద్యం సరిగా జరగటంలేదు. నాకు వ్రాశాడు. అందుకే ఇక్కడికి తీసుకురావడానికే నేను వెళ్తున్నాను. తీరా ఆ రోగి పరిస్థితి ఎలా వుంటుందో, ఏ కొంపమోతుంతో-కూడా ఆడపిల్లలు దేనికి? ప్రస్తుతం నేను వెళ్తున్నాను. వచ్చిన తర్వాత ఆ విషయం, ఆలోచించవచ్చునులే."

నగేష్ అసలు అభ్యంతరమేమిటో చూచాయగా గ్రహించగలిగిన జయశ్రీ నిరుత్సాహపడింది. "పోనీ నువ్వూరా అత్తయ్యా. నాకోసం ఈ కాస్త సహాయం చేయలేవూ?

**ఆరెకపూడి కౌసల్యాదేవి**

"బావ అభ్యంతరం అందుకేమో?" అన్నది ఓరగా చూస్తూ స్పష్టంగా అనంగీకారం తెలియజేయలేక మౌనంగా నిలబడింది శ్రీదేవి. శ్రీనగేష్ మారుమాటలేకుండా చకచకా వెళ్ళిపోయాడు.

'ఛీ ఛీ. అనవసరంగా అడిగి తేలిక అయ్యానే!" అనుకొంటూ తనను తానే కోపంతో అసహ్యించుకొన్నది జయశ్రీ.

రాత్రి ప్రొద్దుపోయి తిరిగివచ్చిన కుమారునికి భోజనం పెడ్తూ. "ఎలాఉన్నాడు నీవు తీసుకువచ్చిన రోగి?" అనడిగింది. శ్రీదేవి.

"బాగానే ఉన్నాడమ్మా. ఫర్వాలేదు. ఇవ్వాళా రేపూ నేను జాగ్రత్తగా చూచుకుంటాను, చాలు. ఆపైన ప్రమాదం వుండదు."

నిండుగా నవ్వింది శ్రీదేవి. "నాకు తెలుసు, నా చేతిలో పడ్డవాళ్ళెవ్వరూ దుఃఖించరు. మరణశయ్యపైనుండి నవ్వుతూ లేచి హాయిగా జీవిస్తారు."

మందహాసం చేశాడు శ్రీనగేష్. "చల్లని తల్లివి. నువ్వు నోరారా మనస్ఫూర్తిగా అలా దీవిస్తూ ఎంత కాలం అలాగే నేను పట్టిన పని ఫలవంతమౌతుందమ్మా."

అలా అంటూండగానే అతడి వదనంలో ఉన్నట్టుండి మాయమై విషాద మేఘాలావరించాయి. "పోనీలే. నా వారి నేనూ నా తెలివి ఉపయోగించక పోయినా ఆర్తుల-అసహాయులకైనా ఈ అర్థరహిత జీవితం ప్రయోజనకారి కాగలిగితే అంతేచాలు" అన్నాడు భార స్వరంతో.

"అలాగనకు బాబూ. భగవన్నిర్ణయాన్ని మనమేం చేసాం? అవునుగాని నీతో పాపం జయను తీసుకెళ్ళమంటే అంత ఆలోచిస్తావేమిటి? కావలసినవి ఎలా కొనుక్కుంటుంది మరి?" అతడి మనస్సును మరోవైపు మళ్ళించడానికి సంభాషణ మార్చింది తల్లి.

"బాగుందమ్మా. నవ్వుతున్నా ఏ బ్రిటన్‌లోనో అమెరికాలోనో జన్మించవలసింది ఇక్కడ కాదు. నీ కొడుకు సుబుద్ధి అని నీకు తెలియవచ్చు కాని, నావెంట తిప్పితే ఆ అమ్మాయి భవిష్యత్తేమైనా ఆలోచించావా పాపం? అసలే పల్లెప్రజలు! నోటికివచ్చింది అన్నారంటే ఫలితాలెలా ఉంటాయో ఆలోచించుకో."

"ఏమీ ఫర్వాలేదు." తేలికగా అనేసింది శ్రీదేవి. "నిన్నుగురించి నిలువెత్తుధనం పోసినా ఈ పల్లెలో ఎవరూ ఏమీ అనరు; అన సాహసించరు. వారి ప్రాణదాతవనే అకుంఠిత గౌరవం ఇక్కడ ప్రతి ఒక్కరికీ వున్నది నీపై. నీమీద గౌరవంతోనే ఆ అమ్మాయినీ చూస్తారు."

"అవునమ్మా. అదంతా సరే. కాని ఆ గౌరవాన్ని నిలుపుకోవాలికదా? వారేమీ అనుకోరనే ధైర్యంతో వెర్రిగా ప్రవర్తిస్తే ఆ మరుక్షణంలోనే ఆ మర్యాదంతా నశించిపోతుంది."

నిండుగా నవ్వింది శ్రీదేవి. "అంతదూరం నేనాలోచించలేదంటావా?" అర్థంగానట్లు చూచాడు శ్రీనగేష్.

తిరిగి శ్రీదేవి చిరు నగవుతో అన్నది: "నేడో రేపో ఈ యింటి కోడలు కానున్నది. పరాయిదేమీ కాదు."

"ఎంత తెలివున్నా ఆడవారొక్కొక్కప్పుడు బొత్తిగా అర్థంలేకుండా మాట్లాడతారు. ఈ అమ్మాయిల్ని చూడగానే నువ్వు బొత్తిగా ఇలా ఎందుకు మారిపోతున్నావో నాకు తెలియదు." అని విసుక్కుంటూనే అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాడు.

కుమారుని తత్వం తెలిసేవున్న శ్రీదేవి నిండుగా నవ్వుకొన్నది.

శ్రీదేవి ఈ ఉదయం చాలా సందడిగావున్నది, నౌఖర్లందరికీ హడావుడిగా పనులు పురమాయిస్తూన్నది. తన సహజ గంభీరత్వాన్ని మఱచిపోయి అందరితో నవ్వుతూ మాట్లాడుతున్నది.

"ఒరేయ్, పట్నంపోయి వద్దాం. పదింటికల్లా అమ్మాయిని సిద్ధంగా వుండమని చెప్పు." అంటూ ఒక నౌఖరుచేత జయశ్రీకి కబురు పంపింది.

"ఏమిటమ్మా అది!" అతి ఆశ్చర్యంతో ప్రశ్నించాడు శ్రీనగేష్.

"ఏముంది? ఎందుకంత ఖంగారు పడ్తావ్?"

కినుకగా అన్నాడు; "ఏమైనా కానీయ్. నేనీ పని మాత్రం చేయను. ఆమెను మాత్రం నాతో తీసుకువెళ్ళలేను. ఎన్నడూ నీ ఆజ్ఞను యింతగా ఎదిరించలేదు;" లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"కోపగించుకోకయ్యా బాబూ. నీ కిష్టంలేని పని నేను బలవంతంగా చేయిస్తానా?"

"మరి?"

"కార్లో నేనూ వస్తున్నాను!!!"

ఆశ్చర్యంతో చాలసేపు మాట్లాడలేకపోయాడు శ్రీనగేష్," ఏమిటమ్మా? నువ్వువస్తావా? ఇటు సూర్యుడటు ఉదయించినా ఆశ్చర్యమక్కరలేదు కాని, నువ్వు బయలు దేరుతుంటే నాకాశ్చర్యంగా వున్నది!"

సరిగా అక్కడ జయశ్రీ కూడ అదేవిధంగా ఆశ్చర్య పోయింది. పరమ సంతోషంగా బయలుదేరి వచ్చింది.

"ఎందుకోగాని జయా, అమ్మకు నీపై చాలా చాలా ప్రేమాభిమానాలు పుట్టుకొచ్చేశాయి. ఇదివఱలో ఒక్కసారైనా యిల్లు కదలనిది, ఈ రోజున నీకోసం......"అన్నాడు శ్రీ నగేష్.

ఏమేమో ఊహాగానాలతో తేలిపోతూన్న జయశ్రీ చిరునవ్వు నవ్వి ఊరుకున్నది మాట్లాడకుండా.

'అమ్మాయిత ఉపకారబుద్ధితో పలుందాగా ప్రవర్తిస్తూంటే ఈ జయశ్రీ ఒక్క కృతజ్ఞతా వాచకమైనా పలుకదేమా!' అని లోలోన ఆశ్చర్యపోయాడు శ్రీనగేష్.

"అత్తయ్యా, నువ్వు నిజంగా నా గురించే బయలు దేరుతున్నావా? ఏమో నాకు నమ్మకంలేదు. అన్నగారి కుటుంబం అంత ఆపదపాలైతేనే రాని నువ్వు, ఇవాళ యింత చిన్న కారణానికి బయలుదేరతావా?" జయశ్రీకి మనస్సులోని మాట పైకి నిర్మొహమాటంగా అనేయడం అలవాటు.

ఆ మాటలు శ్రీనగేష్‌కు కష్టమనిపించాయి. శ్రీదేవి వదనంలో ఏభావమూ లేదు. గంభీరంగా విని ఊరుకుంది.

శ్రీదేవినీ, జయశ్రీనీ బజారులో దిగవిడచి తాను వెళ్ళిపోయాడు శ్రీనగేష్.

"ఆడవారి బేరాలకూ కొనుగోళ్ళకూ అంతూ పంతూ ఉండదంటారు. త్వరగా తెమలండి. నేను మళ్ళీ మూడు గంటలకొచ్చేస్తాను." అన్నాడు పోతూ పోతూ.

"చూద్దాంగా ఎవరు ముందు తెములుతారో! అయినా మీ మగవారికి అడుగడుగునా ఆడవారిని ఏదో ఒకటి అని తమ ఆధిక్యాన్ని నిరూపించుకోవడానికే నిత్య తాపత్రయం. ఆడవారంటే బొత్తిగా అలుసు!" అన్నది జయశ్రీ సవాలు చేస్తున్నట్టు.

"బాగా చెప్పావ్!" శ్రీదేవి నవ్వుతూ జయశ్రీని సమర్థించింది." అయినా పనిమీద వచ్చినప్పుడు కాస్త ఆలస్యం అయితే అవ్వనూ అవుతుంది, డబ్బు వెచ్చించేటప్పుడు నిదానంగా చూచుకోకపోతే ఎలా?"

### జరిగిన కథ

వైద్య విద్యా పట్టభద్రుడయిన శ్రీనగేష్ సేవాతత్పరత అతని మామ శ్రీపతికి నచ్చదు. శ్రీపతి కుమారుడు శ్రీహరి వివాహం, సమయానికి కట్నం అందని కారణంగా ఆగిపోతుంది. తిరిగి వస్తూండగా కారు ప్రమాదంలో చిక్కుకొని శ్రీపతి గారికి మతిస్థిమితం తప్పుతుంది. శ్రీనగేష్ గ్రామంలో పెట్టిన ఆసుపత్రి–భాగ్యచక్రం చాలా అభివృద్ధి చెందుతుంది. దానిని చూచేందుకు శ్రీలక్ష్మి రాగా ఆమెకు తన ఆసుపత్రి పెట్టుటకు దారి తీసిన సంఘటనలను శ్రీనగేష్ తెలియజేస్తాడు. శ్రీలక్ష్మి తిరిగి వెళ్ళిపోతుంది. ఆ తరువాత శ్రీపతి యింటికి వెళ్తాడు శ్రీనగేష్. శ్రీపతిని, జయశ్రీని తనయింటికి ఆహ్వానిస్తాడు. శ్రీపతి, జయశ్రీ యిద్దరు "భాగ్యచక్రం" ను తిలకించి, నగేష్ ఇంటికి పోయి మర్యాదలపొంది తిరిగి ఇంటికి వెళ్తారు.

"సరే బాబోయ్. మళ్ళీ తేడా వస్తే ఆ నెపం నామీద వేస్తారు. అదేదో నిదానంగానే కానివ్వండి. జయా! మరచిపోకు! లైట్ కలర్స్ ఓన్లీ!" అంటూనే వెళ్ళిపోయాడు.

సాయంత్రం నాల్గు గంటల వేళ అతడు తిరిగి వచ్చే సరికి అనుకున్నట్టుగానే ఇంకా బట్టల కొనుగోలు పూర్తి కాలేదు.

"ఏం, ఇంకా అవ్వలేదూ:" అంటూ వచ్చిన కుమారుని "శ్రీధర్ ఏడీ?" అని ప్రశ్నించింది శ్రీదేవి, ఒడలంతా నేత్రాలు చేసుకు వెదకుతూ.

"వస్తున్నాడు. ఐస్ క్రీమ్ కావాలంటే అలా పార్లరికి పంపించాను డ్రైవర్ తో."

'పటం ఇంకా ఎప్పుడు చూద్దాం ఎప్పుడు చూద్దాం అని నేనుంటే............" విసుగ్గా అన్నది శ్రీదేవి.

నవ్వాడు శ్రీనగేష్. "కనిపెట్టాను. నువ్వసలు అందు కొచ్చావిప్పుడు. అయినా అంత తొందరేమిటి? ఇక ఓ రెండు నెలలు నీదగ్గరే వుంటాడుగా?" అంటూ జయశ్రీ వైపుతిరిగి "ఎవరు నెగ్గారు?" అని చిలిపిగా ప్రశ్నించాడు.

"మీకు జ్యోతిష్యం వచ్చని నాకేం తెల్సుమరి?" అంది మూతి మూడు వంపులు త్రిప్పి. "ఇంతకీ శ్రీధర్ అంటే ఎవరు?"

"నీకు తెలియదా? శ్రీదేవి శ్రీనగేష్‌లు ఇద్దరూ ఎదురు ప్రశ్నించారు.

"అదే తెలుస్తుందిలే తర్వాత," చటుక్కున సంభాషణ మార్చేశాడు శ్రీనగేష్. "ఏవీ? ఏమేం కొన్నారు?"

చిరుకోపం నటించింది జయశ్రీ. "కొన్నవన్నీ నువ్వు సెన్సారు చేయాలి కాబోలు! ఇవిగో చూడు."

ఎన్నిక చేసినవన్నీ ఒక్కొక్కటే పరిశీలించసాగాడు శ్రీనగేష్. "ఈ చీర అచ్చా బాగుంది."

"చీరకాదు. డోర్‌కర్టెన్!" జయశ్రీ సమాధానం.

"ఓ! సారీ! ఈ దుప్పట్లిలా ఉన్నాయేమిటి?"

"హేళన అనవసరం. అవి చీరలు!" ఖంగుమన్నది జయశ్రీకంఠం.

"ఓహో! నాకు తెలియవులేమరి! మొదటే చెప్పానుగా! అన్నట్టు ఈ టేబిల్ క్లాత్‌ల ఖరీదెంత?"

"ఛ అవి టేబుల్ క్లాత్‌లు కాదు. జాకెట్ పీస్‌లు... ......"అని వివరిస్తూ శ్రీనగేష్ బలవంతగా చిరునవ్వును అపుకొంటూండడం గమనించిన జయశ్రీ కిలకిలా నవ్వేసింది. "తమాషా చేస్తున్నావన్నమాట! ఇంకా తెలియదేమో అనుకుని నేను వాగుతున్నాను. ఫో, ఇక నేను చెప్పను!"

అంతలో షాపుయజమాని, తాను వారికి పూర్తిగా అపరిచితుడనన్న విషయం మరచిపోయి తెచ్చి పెట్టుకున్న ఆత్మీయతను ఒలుకబోస్తూ శ్రీదేవితో మాటలు ప్రారంభించాడు: "చక్కటి ఈడూజోడూనమ్మా, ఏమౌతారు? కొడుకూ, కోడలూనా లేక కూతురూ, అల్లుడూనా? ఏం అన్యోన్యంగా ఉన్నారు!"

ముగ్గురు ముగ్గురే చిత్ర ప్రతిమలైపోయారు క్షణ కాలం.

కాని లిప్త పాటుకాలంలోనే శ్రీనగేష్ తేరుకున్నాడు ఆ విస్మయావస్థ నుండి. వెంటనే సంభాషణ మార్చివేయ వలసిన అత్యవసర పరిస్థితిలో వున్నట్టు గ్రహించి, "అమ్మా! ఇంతకూ ఏమేమి కొన్నారు? ఇంకానేమి కొనాలి?" అనడిగాడు తల్లిని.

"ఇవిగోనండి." వరుసగా దొంతరలు పెట్టివున్న పాకెట్లను చూపించాడు షాపు యజమాని. "తియ్యండి బాబూ. మీరుకూడా తియ్యండి. ఒకటో రకమైన సూటింగ్ క్లాత్ వుంది. షర్టింగ్స్‌కు వున్నాయి. చెప్పండి. ఏం తియ్యమన్నారు? ట్వీడ్, బిన్ని. షార్క్‌స్కిన్. టెర్లిన్.... .........…"

తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు శ్రీనగేష్, షాప్ యజమాని ధోరణి పూర్తిగా మారిపోవడంతో.

"నాపని అయ్యింది. బిల్లు వ్రాసేయండి." అంది జయశ్రీ.

"చిత్తం చిత్తం అయ్యగారేమీ తీయనేలేదు." అంటూ నసిగాడు బిల్లువ్రాస్తూనే.

"ప్రస్తుతం అన్ని ఉన్నాయిలెండి నాకు" అన్నాడు నగేష్.

"ఈ చిన్న చిన్న బొమ్మలగుడ్డ చాలా బాగుందబ్బాయ్ తీసుకుందామా?" అన్నది శ్రీదేవి లేత నీలిరంగు ప్రింట్‌లో వున్న లినెన్ క్లాత్ నొకదానిని చూపుతూ,

"బాగానేవుంది కానీ, ఎందుకమ్మా అది మనకి?"

"బుష్‌కోటుకు బాగుండదూ?"

"ఎవరికీ?" అతి ఆశ్చర్యంతో అదరిపడుతూ అడిగాడు, "నాకే?" జయశ్రీకూడ అతి ఆశ్చర్యంగా చూడ సాగింది.

అదనుదొరకిన షాపు అతడు లంకించుకున్నాడు "మీకంటె పెద్దవారుకూడ వేసుకుంటున్నారండీ! ఇప్పుడిదే ప్యాషన్‌కదూ? తీస్తున్నాను చెప్పండి. ఎన్ని గజాలు? మీకు మూడు గజాలు చాలనుకుంటాను." అతడలా ఊదరగొట్టడం చూచి విసుగ్గా పెట్టాడు నగేష్ ముఖం. ఆ చికాకును గమనించిన వ్యాపారి కొంచం తగ్గాడు.

''ఇందులో ఎన్ని కలర్స్ వున్నాయో అన్నీ తలో గజంన్నరా తీయండి''. శ్రీదేవి ఆజ్ఞయిచ్చేసింది. దొరికినదే తడవుగా అమ్మకందారు గుడ్డకొలిచి తీసేస్తున్నాడు.

అర్థంగానట్లు చూచాడు నగేష్ తల్లివైపు. ''నేను రంగురంగుల బొమ్మల చొక్కాలు తొడుక్కుంటే కాలేజీ హీరోని చూచినట్లు చూస్తారు జనం. డాక్టర్ కున్న గౌరవం నశించిపోతుంది''.

శ్రీదేవి వదనం అప్రసన్నతకు ఆలవాలమైంది. ''నువ్వసలు శ్రీధర్ సంగతి పూర్తిగా మరచిపోయావనుకుంటాను?''

బరువుగా హసించాడు శ్రీనగేష్, "ఎందుకు మరచిపోతానమ్మా? కానీ, సైనిక్‌స్కూల్లో చదివే కుర్రాడికి అటువంటి దుస్తులెందుకమ్మా?

''చాల్లే. ఇక యింటి దగ్గఱకూడా ఆ మొద్దుగుడ్డలే తొడుక్కోమంటావా? ఈ నెలా సెలవులు. నా ముచ్చట తీరా ఈ నాల్గు రోజులైనా చూచుకోవద్దూ?''

''పోనీ, అలాగే కానియమ్మా. దానికంత మీమాంస దేనికి? త్వరగా తెమలాలి. అక్కడ మామయ్య ఎలా ఉన్నారో!''

ఒక్కసారిగా జయశ్రీ వదనంలో దరహాస చంద్రికలూ ఆనందజ్యోత్స్నలూ ఆరిపోయాయి. "ప్చ్. సినిమా చూచి వెళ్ళేయోగం లేదు,'' అంది నిరుత్సాహంగా.

''అలాటి ఉద్దేశ్యం వుంటే ఇంకా ముందుగా వచ్చి, మ్యాటినీ షో చూచి వెళ్ళవలసింది. ఇక యిప్పుడెలాగ?'' అన్నాడు నగేష్.

అతడిమాట తేలికగాతీసేసింది జయశ్రీ. "పోనీయిప్పుడైతేనేం? ఇంట్లో వంటమనిషి, నౌఖర్లూ ఎలానూ ఉన్నారు కదా! చూచివెళ్దాం.''

''వద్దుజయా, అంత సాహసంవద్దు. మామయ్యది పూర్తిగా పసిబిడ్డ స్థితి. నౌకర్లకేం ఎందరైనా వుంటారు. బాధ్యత స్వంతవారికి మినహా మరెవరికీ వుండదు'' అంటూనే అక్కడినుంచి లేచాడు, జయ ధోరణిని గురించి లోలోన ఆశ్చర్యంతో ఆలోచిస్తూ. కేవలం ఒక విధిగా, తప్పని సరిగా ఆమె తండ్రి ఆలనపాలనలను చూస్తూన్నదే కాని, అందులో ప్రేమాభిమానాలూ, మమతా బంధనలూ కొంత కొరవడినట్లు తోచింది అతడికి.

ఆలోచనలతో పరధ్యానంగా వీధివైపు అడుగులు వేస్తూన్న అతడు, ''నమస్కారమండీ!'' అనే సన్నని కంఠం విని ఆశ్చర్యంగా తలెత్తిచూచాడు.

గుర్తుపట్టలేక పోతూన్నట్లున్న అతడి చూపులనుచూచి, ''మఱచిపోయారా?'' అన్నది ఆ యువతి దరహాస వదనంతో.

''ఓ! లక్ష్మిగారు కదూ! గుర్తురాక కాదు, హఠాత్తుగా కనిపించడంతో కొద్ది తడబడ్డాను. అంతే.'' అన్నాడు మన స్ఫూర్తిగా చిరునవ్వు నవ్వుతూ.

"అమ్మాగారు కులాసానాండీ? జయశ్రీ, ఆమె తండ్రిగారూ కుశలమా?" మనస్ఫూర్తిగా ఆప్యాయతతో అడుగుతూన్నట్లు ఆమె నేత్రాలే స్పష్టీకరిస్తున్నాయి.

''ఆఁ. అదుగో వారూ వచ్చారు. చూడండి.'' అన్నాడు శ్రీనగేష్.

''ఓ! వచ్చారా!'' సంతోషంగా త్వరత్వరగా వారి దగ్గఱకు నడచింది శ్రీలక్ష్మి. ''నమస్కారమండీ. నేను గుర్తున్నానా?'' అనడిగింది శ్రీదేవిని.

''ఆఁ. అంతా బాగున్నారా? బట్టలు కొనడానికి వచ్చావా?'' నవ్వుతూనే మాట్లాడుతూన్నప్పటికీ శ్రీదేవి ధోరణిలో పూర్వపు ఆప్యాయతా ఆత్మీయతలు లోపించినట్లు గుర్తించడానికి తెలివైన శ్రీలక్ష్మికి ఆట్టేసేపు పట్టలేదు, అది శ్రీనగేష్ స్పష్టంగా గ్రహించాడు.

సస్నేహంగా జయశ్రీ దెసచూచింది శ్రీలక్ష్మి. కాని జయశ్రీ చిటపట లాడ్తూన్న ముఖాన్ని మరోవైపు త్రిప్పుకోవడంతో మాట్లాడ సాహసించలేక కొద్ది క్షణాలు మౌనంగా నిలబడింది శ్రీలక్ష్మి.

''నాన్నగారి స్థితి ప్రస్తుతం ఏమైనా మెరుగ్గావున్నదా జయా?'' అని ప్రశ్నించింది [illegible]

సమాధానం నగేష్ నుండి [illegible] ''కొద్ది మెరుగ్గానే వున్నది.''

జయశ్రీ ముఖంలో [illegible] తాండవమాడింది. ''కారు వచ్చిందో లేదో చూడు.'' అంటూ ఒక నౌఖరుకు ఆజ్ఞాపించింది.

శ్రీలక్ష్మి ముఖంలో ఆగ్రహం, అవమానం, తిరస్కారం ఒక్కసారిగా ముప్పిరిగొన్నాయి. ఆ ఆవేశాన్ని తట్టుకోవడానికి బొటన వ్రేలుతో నేలపై రాస్తూండిపోయింది.

''మరి మాకు సెలవివ్వండి లక్ష్మిగారూ.'' అన్నాడు నగేష్.

శ్రీలక్ష్మి తలెత్తి ఒక్కసారి శ్రీనగేష్‌నూ మరొక్కసారి శ్రీదేవిని చూచి, ''మా యింటి కొక్కసారి రాకుండానే వెళ్తారా?'' అనడిగింది.

''సైమేదమ్మా? వెళ్లిపోవాలి.'' అన్నది శ్రీదేవి చటుక్కున.

''మరొకసారి వస్తాంలెండి శ్రీలక్ష్మి! ప్రస్తుతం మాత్రం వెళ్లిపోవాలి. ఏమనుకోకండి." అన్నాడు శ్రీనగేష్ అతి మార్దవమైన స్వరంతో.

''అవును లెండి. మీవంటి వారికి ఆతిథ్యం యివ్వగల అదృష్టం అందరికీ లభిస్తుందా? ముక్కూ-ముఖం ఎరుగని క్రొత్త దాన్ని-నన్ను సకల మర్యాదలై తే చేసి పంపారుమీరు. ఆనాటి నుండి నాన్నగారూ అమ్మగారూ ఒకసారి మీ దర్శనం చేసు కోవాలనుకుంటున్నారు. మీరేమో యింతవఱకూ వచ్చి కూడ మాకు అగ్రపూస్తాన్ని దూరం చేస్తున్నారు.''

ఆ మాటల తీరుకు నిజంగా ముగ్ధుడైపోయాడు శ్రీనగేష్. ''పోనీ ఒక్కసారి వెళ్దామా అమ్మా? ఆమె అంతగా ఆహ్వానిస్తున్నారు?'' అన్నాడు తల్లితో.

శ్రీదేవి యేమో అనే లోగానే జయశ్రీ తీక్ష్ణ స్వరంతో అన్నది. ''అంతగా వెళ్ళాలనివుంటే మీరు వెళ్ళండి. తిరిగి సవ్యంగా ప్రాణాలతో ఇంటికి రాగలమనే ఆశమాత్రం పెట్టుకోకండి.'' అంటూనే చకచకా ముందుకు నడిచింది.

శ్రీలక్ష్మి కనులలో నిండిన నీటినిచూస్తూ అనునయ స్వరంతో మెల్లగా అన్నాడు శ్రీనగేష్. ''లక్ష్మిగారూ! బాధ పడకండి, నేను వస్తాను. మీ యింటికి వారిని వెళ్ళనివ్వండి.''

పై పెదవిని పంటితో అదిమి పెడుతూ అధోముఖయై నిలచింది శ్రీలక్ష్మి మౌనంగా.

''వెళ్ళొస్తామమ్మా అమ్మాయి!'' అంటూనే శ్రీదేవి మరి శ్రీలక్ష్మి మాటకు ఎదురు చూడకుండానే వెళ్ళిపోయింది.

''జాగ్రత్తగా ఇంటికి వెళ్ళిపోండి, దారిలో ఐస్‌పార్లర్ లో చంటిబాబును ఎక్కించుకు వెళ్ళండి.'' అని డ్రైవరుకు హెచ్చరికలు యిస్తూన్న కుమారుని ''నువ్వురావా?'' అని ప్రశ్నించింది శ్రీదేవి.

''రాను. నాకు యింకా యిక్కడ హాస్పిటల్‌లో కొంత పనుంది. రాత్రికి వస్తాను.'' నగేష్ సమాధానం.

''హాస్పిటల్‌కా? లక్ష్మి యింటికా?'' సూటిగాచూస్తూ అడిగింది జయశ్రీ.

ఆమె నిర్మొగమాటం తనలో కలిగించిన ఆశ్చర్యభావ పరంపరలను పైకి ద్యోతకం కానీయలేదు శ్రీనగేష్. ''పోనీ వోయ్ డ్రైవర్. జాగ్రత్తగా తీసుకువెళ్ళు.''అని కారుడ్రైవరును గంభీరంగా హెచ్చరించాడు, కారు కదలిపోయింది.

షాపులోనికి తిరిగి వచ్చిన శ్రీనగేష్ శ్రీలక్ష్మి యథా పూర్వస్థానంలోనే ఖిన్నవదనంతో నిలబడివుండడం చూచాడు. దగ్గఱగా వెళ్ళి, ''రండి లక్ష్మి మీ ఇంటికి వెళ్దాం.'' అన్నాడు.

భారంగా తలెత్తిన శ్రీలక్ష్మి కనులు తడిసివున్నాయి. ''నాగురించి మీరు నిష్ఠురాలు పడతారా?'' అన్నది దీనంగా.

''ఫర్వాలేదు రండి. ఇది షాపు. ఇక్కడ అంతగా మాటలు బాగుండవు.'' అని పరిసరాలను గుర్తుచేశాడు.

గ్రహించిన శ్రీలక్ష్మి మరి మాటలు పొడిగించక, మౌనంగా అతడితో నడచింది.



పరిచయాలు అక్కరలేకనే శ్రీనగేష్‌ను గుర్తించిన శ్రీనివాసరావు, సుశీలాదేవి అత్యాదరం చూపారు శ్రీనగేష్ పట్ల. ''మీ ఊరువస్తే మా అమ్మాయికి చాలా మర్యాదలు చేశారని చెప్పింది కృతజ్ఞులం.'' అన్నారు.

''అమ్మాయి గారు ఏదో అతిగా చెప్పినట్లున్నారండి. అదేమీ లేదు, ఏదో సాధారణ మర్యాద. అంతే.'' అన్నాడు నగేష్ ప్రత్యుత్తరంగా.

''అవునవును. ఇంటికి తీసుకువెళ్ళి ఓదార్చి మర్యాదలు చేయడమూ, మీ పనులు మానుకొని వెంటనౌకర్ని సాయం పంపడమూ అంతా వట్టిదే కదూ?''

సుశీలాదేవి మాటలకు శ్రీనగేష్ చిరునవ్వే సమాధాన మైంది.

''చూడండి డాక్టరుగారు, ఏదో వివాహమంటూ అనుకున్నాం, దైవ నిర్ణయం మరొకలాగున్నది. దానికి ఆ జయశ్రీ మమ్మల్ని నిందించడమేమిటి చెప్పండి? అయినా ఈ పిల్ల అసలు అక్కడికి ఎందుకిక వెళ్ళడం? ఏమిటో ఆవెఱ్ఱి అభి మానం, నాకు తెలియదు.''

కాఫీ ట్రేతో ప్రవేశించిన శ్రీలక్ష్మి ''ఎందుకమ్మా ఆ విషయాలన్నీ ఆయనతో? ఆయనకు విసుగు మధ్యన!''అన్నది.

''విసుగేమున్నది పెద్దవారు మాట్లాడుతూంటే ? చెప్ప నీయండి.'' అన్నాడు శ్రీనగెష్ మర్యాదగ.

"లక్ష్మి మాట నిజమేలెండి. ఏదో నాబాధకొద్ది నేనన్నాను. కలుసుకోక కలుసుకోక కలుసుకున్నాం. మళ్ళీ ఎప్పటికో? ఈ కొద్దికాలమూ ఈ పనికిమాలిన మాటలతో వృథా చేసుకోవడం దేనికి ?" అని ఊరుకున్నది సుశీలాదేవి.

నలుగురూ కాఫీలు తీసుకున్నాక మెల్లగా సంభాషణకు ప్రక్రమించాడు శ్రీనివాసరావు. "అయితే మన స్వగ్రామమే వూరు డాక్టరుగారూ ?"

చెప్పాడు నగేష్.

''మీ ఆసుపత్రి విషయాలన్నీ అమ్మాయి చెప్తూంటే వినడానికి చాలా ఆనందమైంది సుమండీ ! నిజంగా మీది చాలా చక్కటి ఆదర్శం. ఇంతకూ మీ నాన్నగారిపేరు ?''

సమాధానం చెప్తూనే కూర్చున్న తావు నుండి లేచాడు శ్రీనగేష్. ''మరి నాకు సెలవిప్పించండి,"

"అప్పుడే? '' ముగ్గురూ ఒక్కసారే అన్నారు.

''ఇంకా ఊళ్ళో చూచుకోవలసిన పనులున్నాయండీ. ఆ పనులు అయ్యాక యివ్వాళే వెళ్ళిపోవాలి. లేకుంటే అక్కడ ఊళ్ళో పేషెంట్సుకు యిబ్బంది పాపం!"

''సరే. రోగులంటున్నారుగనుక కాని, లేకుంటే వెళ్ళనివ్వం." అన్నది శ్రీలక్ష్మి నవ్వి.

"పిలైనప్పుడు వస్తూండండి.'' అంటూ సాగనంపారు శ్రీనివాసరావు, సుశీలాదేవి.

''రండి. కారులో డ్రాప్ చేసేస్తాను హాస్పిటల్ దగ్గఱ.'' అన్నది శ్రీలక్ష్మి.

''ఎందుకులెండి. నేను వెళ్ళిపోతాను,''

''నాకెలాగూ బజారుకు వెళ్ళవలసిన పని వున్నదికదా! రండి,''

''వెళ్ళండి." శ్రీనివాసరావు కూడా అన్నాడు.

శ్రీలక్ష్మి నగేష్‌లతో కారు బయలుదేరింది.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా నిస్తబ్ధంగా గడచి పోయింది. కారు మెత్తగా పరుగిడుతూనేవుంది. (సశేషం)

# ముఖ్య వార్తలు

## రాష్ట్రంలో

అక్టో 19. ఆంధ్రప్రదేశ్ నేషనల్ కేడెట్ కోర్స్ డైరెక్టరేటు కొత్త భవనాలకు సికిందరాబాదులో గవర్నరు ప్రారంభోత్సవం చేశారు.

నవం 3. విశాఖ పట్టణంలో అయిదవ ఉక్కు కర్మాగారాన్ని నిర్మించాలని గత 19 రోజులుగా శ్రీ టి. అమృతరావు జరుపుతున్న ప్రాయోపవేశాన్ని విరమించుకున్నారు.

## భారతదేశంలో

అక్టో 19. కరువుభత్యం విషయమై నియమించబడిన గజేంద్ర గడ్కర్ కమీషన్ సిఫారసులను భారత ప్రభుత్వం అంగీకరించింది.

అక్టో 20. యుగోస్లేవియా అధ్యక్షులు టిటో, సంయుక్త అరబ్ రిపబ్లిక్ అధ్యక్షులు నాసర్ కొత్తఢిల్లీ చేరుకున్నారు.

అక్టో 21. యుగోస్లేవియా అధ్యక్షులు టిటో, సంయుక్త అరబ్ రిపబ్లిక్ అధ్యక్షులు నాసర్, భారత ప్రధాని శ్రీమతి ఇంధిరాగాంధీ కొత్తఢిల్లీలో సమావేశమయ్యారు.

అక్టో 31. కార్డియాలజీకి సంబంధించిన అయిదవ ప్రపంచ కాంగ్రెసు సమావేశానికి రాష్ట్రపతి ప్రారంభోత్సవం జరిపారు.

నవం 1. లోకసభ శీతకాల సమావేశం ప్రారంభమైంది.

నవం 3. ఢిల్లీలో ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ తొలి స్నాతకోత్సవంలో రాష్ట్రపతి అధ్యక్షోపన్యాసం యిచ్చారు.

## విదేశాలలో

అక్టో 17. మలయేషియాలో అయిదు రోజులపాటు అధికార పర్యటన జరిపే నిమిత్తం ఉపరాష్ట్రపతి డా. జాకీర్ హుస్సేన్ కౌలాలంపూర్ చేరుకున్నారు.

అక్టో 20. 1966 సంవత్సరానికి సాహిత్యంలో ఇజ్రాయేలు దేశీయుడు సామ్యుయేల్ జోసఫ్ అగనాన్‌కు, జర్మను దేశీయుడు నెల్లీ సచాన్‌కు కలిపి నోబుల్ బహుమతి ప్రకటించబడినది.

అక్టో 31. పెనామా కాలువను మిహిర్ సేన్ విజయవంతంగా ఈదగలిగారు.

నవం 3. పారిస్‌లోని ఎకొలె నోర్మలేకు చెందిన ప్రొఫెసర్ ఆల్ఫ్రెడ్ కస్టలర్‌కు భౌతిక శాస్త్రంలో 1966 సంవత్సరానికి నోబుల్ బహుమతి ప్రకటించబడింది.

ఇలినోయిన్‌లోని చికాగో విశ్వ విద్యాలయాచార్యుడు రాబర్ట్ ఎస్. మల్లికెన్‌కు రసాయన శాస్త్రంలో 1966 సంవత్సరానికి నోబుల్ బహుమతి ప్రకటించబడింది.

నవం 5. అడిస్ అబాబాలో ఆఫ్రికా సమైక్య సంఘం నాలుగవ శిఖరాగ్ర సమావేశం ప్రారంభమైంది. ★

# అధికాహారోత్పత్తికి మార్గాలు

రోజురోజుకీ పెరిగిపోతున్న జనాభా, ఆ జనాభాకు కావలసిన ఆహారమూ—యివీ యీనాడు వ్యవసాయ శాస్త్రజ్ఞులముందున్న సమస్యలు. ఉన్నంతలోనే పంటనేలలో అధిక దిగుబడిని ఎలా సాధించాలి? బంజరుగా వుండిపోయిన నేలను ఏవిధంగా సాగు చేయాలి? అన్నప్రశ్నలను వారు ఎదుర్కోవలసి వస్తున్నది. రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ శాస్త్రజ్ఞులు ఫిలిప్పైన్స్‌లో—అధిక దిగుబడి యిచ్చే వరి వంగడాలను వాడి వున్నకొద్దిపాటి నేలలోనూ అధికోత్పత్తిని సాధించారు. ఎక్కువ దిగుబడినిచ్చే బలిష్ఠమైన పొట్టి రకం వరిమొక్కలను రూపొందించి తద్వారా ఎకరాకు సగటు 800 శాతం అధిక దిగుబడిని సాధించారు. మామూలు పంటభూముల ప్రక్కనే పరిశోధక మడుల్ని ఏర్పాటుచేసి అక్కడ ఈ కొత్త రకం వరివంగడాల్ని నాటారు. ఇవి పుష్టిగా పెరిగి, కంకులువేసి వాటిప్రక్కనేవున్న పాతరకం వరి పొలాల్ని వెక్కిరిస్తున్నాయా అన్నట్టు తయారయ్యాయి. కొత్త రకం ముందు పాతరకం పంట చూడ్డానికి ఏ [illegible] ప్రాంతంలోని పంట భూమిగానో అనిపించేట్టుంది. ఎందువల్లనంటే కొత్తరకం ఏపుగాఎదిగి విస్తారంగా వెన్నులు వేయడమేగాక వెనకటిరకం ఏడాదికి ఒక పంట దిగుబడినే యివ్వగా యిది మూడు దిగుబడులను యిస్తున్నది. మొత్తం 2,600 శాతం అధిక దిగుబడి నివ్వగల వంగడాలుయివి.

మిచిగన్ స్టేట్ యూనివర్సిటీ పరిశోధకులు రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ శాస్త్రజ్ఞుల ధోరణిలోగాక మరొక కొత్తమార్గంలో అటు పరిమిత పంటభూమినుండి అధిక దిగుబడినీ సాధించారు. యిటు సాగునేలనూ విస్తృత పరిచారు. రహదారులు నిర్మించే వారి కొన్నిపద్ధతులను వీరు అనుసరించి ఆ ధోరణిలో ఏస్ఫాల్ట్ పొరలను భూమిలో పరిచారు. ఈ ప్రక్రియ ద్వారా అన్నిరకాల పంటలనుండి అధిక దిగుబడిని సాధించగలిగారు.

అసలు ఈ పద్ధతిపై ఏడేళ్ళక్రితమే అగ్రికల్చరల్ ఇంజనీరు క్లారెన్స్ హేన్సన్, వ్యవసాయ వేత్త ఎ. ఎర[illegible] ఎరిక్సన్‌లు పరిశోధనలు జరపడం ప్రారంభించారు. మిచిగన్ ప్రాంతంలోని కొన్నిచోట్ల యిసుకమట్టి ప్రదేశాలలో వేసిన పంటలు అధిక దిగుబడిని యివ్వడంచూసి దానిపై వారిద్దరూ పరిశోధనలు ప్రారంభించారు. ఇసుక ప్రాంతమే అయినా పంట బాగాపండింది. ఇసుకమట్టికి అడుగుపొరగా బంకమట్టి వుండడంవల్ల వర్షపునీటిని యింకిపోనీయకుండా పీల్చివేసి, నేలఉపరితలాన్ని తేమగా వుంచుతుందని, అందువల్లనే పంట అధికదిగుబడిని యిస్తున్నదని వారు గుర్తించారు. ఈ నేలలోంచి బంగారాన్ని పండించడానికి నిశ్చయించుకున్నాం మేము" అన్నారువారు.

అనుకోవడం తేలికేగాని అసలు చిక్కంతా పనిచేయడంలోనే వుంటుంది. ఉపరితలానికి రెండుఅడుగుల లోతున కృత్రిమంగా బంకమట్టి పొరలనుగాని, పోలిథిలీన్ పొరలనుగాని వేయడంవల్ల వాళ్ళనుకున్నట్టు ఏకోశానా జరగలేదు. పగుళ్ళద్వారా వర్షపునీరు యింకిపోయి ఉపరితలం ఎప్పటిలాగే పొడి పొడిగా వుండేది. తేమమిగిలేదికాదు. అందువల్ల పరిశోధనకని వేసిన పంటలు బాగాదెబ్బ తిన్నాయి. అప్పుడు అమెరికన్ ఆయిల్ కంపెనీ సలహా మేరకు వారు ఆస్ఫాల్ట్‌ను ఉపయోగించి పరిశోధనలు చేయడం ప్రారంభించారు. పరిశోధనలు విజయవంతమయ్యాయి. ఆస్ఫాల్ట్ పొరలు నీటిని అడ్డగించి, యింకిపోనీకుండా మిగిల్చి దానిని ఉపరితలానికి అందించి తేమగా వుంచగలవని తేటతెల్లమైంది.

ఆస్ఫాల్ట్ పొరలను భూమిలో పరచడంవల్ల పరిశోధక మడుల్లో ఎకరాకు సుమారురెట్టింపు కేబేజిపంట లభించింది. మామూలు మడుల్లో ఎకరాకు 260 క్రేట్లు దిగుబడి కాగా యిప్పుడు 505 క్రేట్లు దిగుబడి లభించింది. బంగాళదుంపల దిగుబడి 50 శాతం, దోసకాయల దిగుబడి 100 శాతం అధికంగా లభించాయి. దీనివల్ల వ్యవసాయదారులకు బాగాలాభంకూడాను. క్రేటు కేబేజి ధర 2 పౌండ్లు. ఆస్ఫాల్టు వుపయోగించగా ఎకరాకు 505 క్రేట్లు కేబేజి లభించింది. అంటె మామూలు భూమిలో పంటకన్నా అదనంగా 245 క్రేట్లు లభించిందన్నమాట. మార్కెట్టులో దీనికి 490 పౌండ్లు సొమ్ము లభిస్తుంది. ఎకరానికి అవసరమైన ఆస్ఫాల్టు పొరఖర్చు 225 పౌండ్లు వుంటుంది. అందువల్ల వ్యవసాయదారుడికి తొలిపంటలోనే అదనంగా ఎకరాకు 265 పౌండ్లు లాభం వుంటున్నది. భూమిలో వేసిన ఆస్ఫాల్టుపొర పదిహేనేళ్ళ వరకూ ఏ మాత్రం చెక్కుచెదరదని కూడా హేన్సన్, ఎరిక్సన్‌లు లెక్కగట్టారు.

నేలలోపల పొరలను పరచడానికి మిచిగన్ స్టేట్ యూనివర్సిటీ పరిశోధకులు ఒక పద్ధతిని కనిపెట్టారు. ట్రాక్టర్ పుల్ రూట్ గోల్ట్‌బర్గ్ డివైస్ నొకదానిని రూపొందించారు. ఇది రెండడుగుల లోతున మట్టిని పెళ్ళగిస్తుంది అప్పుడు దానిక్రింద ద్రవరూపంలోకి మరగబెట్టిన ఆస్ఫాల్ట్‌ను స్ప్రే చేస్తారు. వెంటనే ద్రవరూపంలోని ఆస్ఫాల్టు 34 అంగుళాల వెడల్పులో 1/8 అంగుళాల మందాన షీటుగా ఘనీభవిస్తుంది. అలా షీటుకూ షీటుకూ మధ్యగల ఖాళీలోంచి నీరు పోకుండా ఒక షీటు అంచు మీద మరొక షీటు అంచును పరుస్తారు. వీటిని పరచడానికి అయ్యే ఖర్చును తగ్గించడానికీ, ఈ పనిని శీఘ్రతరంచేయడానికీ వీలుగా 10 అడుగుల వెడల్పు షీటులను పరచగల సాధనాన్ని కనిపెట్టే ప్రయత్నంలో యింజనీరు హేన్సన్ వున్నారు.

ఆస్ఫాల్ట్ షీటులను పరచడం ద్వారా ఆగ్నేయాసియాలో ఆహార కొరతగల దేశాలలో ఎకరా పంట దిగుబడిని రెట్టింపు చేయవచ్చని మిచిగన్ స్టేట్ యూనివర్సిటీ పరిశోధకులు చెప్తున్నారు. రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ పరిశోధకులు కనుగొన్న వంగడాలతో ఆస్ఫాల్ట్‌పొరల పద్ధతితో ప్రపంచంనుంచి కరువు రక్కసిని పారద్రోలవచ్చు.



# పంచతంత్రము

## ( మిత్రలాభము )

దక్షిణ దేశమునందు 'మహిళారోప్యము.' అను పట్టణము ఉండెను. దాని సమీపమునందు మిక్కిలియెత్తైన మఱ్ఱిచెట్టుఉండెను. దానిపైన అనేక పక్షులు, తొఱటములో పురుగులు నివసించుచుండెను, నీడలో చాలామంది బాటసారులు సేద దీర్చుకొనుచుండిరి.

ఆ వృక్షముపై లఘుపతనకము, అనువాయసము ఉండెను. ఆ కాకి ఆహారము తెచ్చుకొనుటకుగాను పట్టణమునకు బయలుదేరుచు ఎదురుగ నొక బోయవానిని చూచెను. వానిచేతిలో వల ఉండెను. వాడు చింపిరితలతో యమకింకరునివలె నల్లగానుండెను. వానిని చూచి లఘుపతనకము భయపడి "ఈ దురాత్ముడు ఈ వటవృక్షము సమీపమునకే వచ్చుచున్నాడు. దానిపై నివసించు జంతువుల గతి యేమి?" అని పరి పరి విధములుగ చింతించి వెంటనే తిరిగి ఆ వటవృక్షము కడకుపోయి అచటి పక్షులన్నిటికి యిట్లు చెప్పెను:–"ఓయీ! యీదురాత్ముడైన బోయవాడు వలను బియ్యమును తీసికొని వచ్చుచున్నాడు. ఇతనినేమాత్రము నమ్మగూడదు. వల పన్ని బియ్యము చల్లును. ఆ బియ్యమును విషసమానముగా చూడవలెను."

కాకము ఇట్లు చెప్పుచుండిగనే కిరాతుడు చెట్టుక్రిందకు వల పన్ని తండులములను చల్లి సమీపమునందే పొంచి చూచుచుండెను. పక్షులన్నియు లఘుపతనకుని మాటప్రకారమే ఆ తండులములను ముట్టకుండ విషమువలె చూచెను.

ఇంతలో 'చిత్రగ్రీవుడు' అనునొక పావురములరాజు తన పరివారముతో అచ్చటికి వచ్చెను. బియ్యమును చూచి, లఘుపతనకుడు నివారించుచున్నప్పటికిని, ఆశచేత వలలో పడెను. పావురములన్నియు బంధింపబడెను. అది చూచి బోయవాడు సంతసించి కఱ్ఱతో పావురములను కొట్టి చంపబోయెను. చిత్రగ్రీవుడు తన పరివారముతో నిట్లనెను. 'ఓయీ! మీరు భయపడవద్దు. మన మందరము ఈ వలతో పైకెగిరి దూరముగా పోయి అవలీలగా తప్పించు కొందము. ఒక వేళ మీరు భయపడి పైకి ఎగురక పోయినచో తప్పక వినాశమును పొందగలము."

ఆ ప్రకారమే పావురములన్నియు ఎగిరి ఆకాశములో వలతో పాటు పోవుచుండెను. క్రిందనే భూమి మీద వాటినిచూచుచు బోయవాడును పరిగెత్తుచుండెను లఘుపతనకముగూడ 'ఏమి జరుగునో చూతము' అని కుతూహలముతో కపోతముల వెంటనే ఉరుకుచుండెను. ఇంతలో కపోతములు కనపడకుండ దూరము పోవుటను చూచి బోయవాడు నిరాశచెంది "కపోతమాంసాశ వదలుకుందమనుకున్నను, నా జీవనోపాధికి మూలమైన వలకూడ పోయెనే" అని దుఃఖించెను.

బోయవాడు కనపడక పోవగనే చిత్రగ్రీవుడు శాంతచిత్తుడయ్యెను. అక్కడికి ఈశాన్య దిక్కులోనున్న 'మహిళారోప్యము' అను నగరమునకు సపరివారుడై పోవుచు, "అక్కడ నామిత్రుడు 'హిరణ్యకుడు' అను మూషిక రాజు ఉన్నాడు. అతడు మన బంధములను విడిపించును." అని ఇతర కపోతములతో చెప్పి ఆ దిక్కుగా పోయెను. అక్కడ హిరణ్యకుని బిలమును సమీపించెను. బిగ్గరగా హిరణ్యకుని పిలిచి చిత్రగ్రీవుడు తనకు గలిగిన దురవస్థను అతనితో చెప్పెను. తన మిత్రునకు గలిగిన వ్యసనమునకు మిక్కిలి దుఃఖించి యెలుక బిలము వెలుపలికివచ్చి "ఇది యేమిటి అని అనెను. ఇది నేను జిహ్వారుచికి వశమైనందున



ఏర్పడినది. ఈ వలను నీవు కొరికి మమ్మందరిని బంధవిముక్తుల జేయుము" అని చిత్రగ్రీవుడనెను. వెంటనే యెలుక చిత్రగ్రీవుని బంధము కొరుకబోవగా నతడు తొలుత నా యాశ్రితుల బంధములను త్రెంపి వారిని కాపాడుము. జీతము బత్తెము లేకున్నను నన్నువీరు ఆశ్రయించి సేవించుచున్నారు. తమ కుటుంబమును గూడ వీడినన్ను సేవించు వీరికి ఇంతమాత్రమైనను సాయపడ వలదా ? నీవు నాబంధముచే మొదలు కొరికినప్పుడు నీదంతములు భగ్నములైనచో వీరిని కాపాడలేవు. లేదా, ఇంతలో పుగా బోయవాడు వచ్చినచో నేను తప్పించుకునెదనుగాని వీరి గతి యేమగును ? అప్పుడు నాకు నరకము కలుగునుగదా ? కనుక వీరి పాశమునే తొలుత త్రెంపుము॥ అనిఅనెను. ఆ మాటలకు హిరణ్యకుడు చాల సంతోషించి అందరిని మొదలు విడిపించి చిత్రగ్రీవుని గూడ విముక్తునిచేసి, అతడు చూపించిన రాజ ధర్మమును ప్రశంసించెను, తిరిగి యెప్పుడైనను ఆపదవచ్చి నప్పుడు రమ్మని చిత్రగ్రీవుని కోరి హిరణ్యకుడు వారినందరిని వీడుకొలిపెను. చిత్రగ్రీవునికి మంచి మిత్రుడు ఉన్నందువలన అపాయమునుండి తప్పించుకొని యధేచ్ఛగా పోయెను. ఎలుక తన బిలములో దూరిపోయెను.

లఘుపతనకుడు చిత్రగ్రీవునికి కలిగిన బంధవిముక్తిని చూచి ఆశ్చర్యపడి, 'ఆహా ! ఈ హిరణ్యకుడెంతమంచివాడు, ఎంతశక్తిమంతుడుగదా ! నేను ఎవరినిగూడ నమ్మువాడనుకాను. కాని, యితనితో స్నేహముచేయవలెనని అభిలాష కలుగుచున్నది." అని నిశ్చయించుకొని చెట్టునుండి దిగి బిలమువద్దకు పోయి 'ఓయీ ! హిరణ్యకా !' అని పిలిచెను. ఆధ్వని విని హిరణ్యకుడు, ఇంకేదైనను పావురము వలలో చిక్కుకొని యున్నదా !' అనితలచి—

హిర :—ఎవరు ? నీవు అని అడిగెను.

లఘు :—నేను 'లఘుపతనకము' అను కాకిని.

హిర .—అట్లైన వెంటనేయిక్కడినుండి వెడలిపొమ్ము.

లఘు :—నీవద్ద నాకు పెద్దపనియుండి వచ్చినాను. దర్శన మీయవా ?

హిర :—నీతో కలియవలిసిన అవసరము నాకు లేదు.

లఘు :—ఓయీ ! చిత్రగ్రీవునిబంధమును నీవు విడిపించుట చూచి నాకు నీయెడల ఎక్కువప్రేమ కలిగినది నేనుగూడ ఎప్పుడైన బంధములో చిక్కుపడినప్పుడు నీనుండి విముక్తిని కోరుచున్నాను. కనుక నాతో స్నేహము చేయుము.

హిర :—ఓయీ ! నీవు భోక్తవు. నేను నీకు భోజ్యమను. కనుక నీతో నాకు మైత్రిపొసగదు. విరోధ భావముతో ఎక్కడనైనను మైత్రికుదురునా ? కనుక పొమ్ము.

లఘు :—ఓయీ ! నీస్నేహమును కోరి నీదగ్గర ద్వారముముందు కూర్చొనియున్నాను. నీవు నన్ను నిరాకరించినచో ఇచ్చటనే ప్రాణత్యాగమైనను చేసెదను. లేదా ప్రాయోపవేశమైనను చేసెదను.

హిర :—ఓయీ ! శత్రువైన నీతోగూడ నేనెట్లు స్నేహము చేయుదును.

లఘు :—ఓయీ ! నీదర్శనమైనను నేటిదాక నాకు లేదే. మనకు వైరమెక్కడిది ? తప్పుమాట్లాడు చున్నావు.

హిర :—వైరము రెండువిధములు. ఒకటి సహజము. రెండవది కృత్రిమము నీవు నాకు సహజవైరివి.

లఘు :—ఈ రెండువిధములైన వైరములకు లక్షణము చెప్పుము.

హిర :—ఏదోయొక కారణముచేత ఏర్పడువైరము కృత్రిమము. అది, తగిన ఉపకారము చేయుటచేత పోవును. స్వాభావికముగ నేర్పడు వైరము ఎన్ని ఉపకారములు చేసిననుపోదు. సహజవైరము కలవారెవరనగా :—'ముంగీస–సర్పము, గడ్డితిను పశువులు–నఖాయుధములగు–వ్యాఘ్ర సింహాదులు, జలము–అగ్ని, దేవతలు–రాక్షసులు, కుక్కలు–పిల్లులు ధనవంతుడు–దరిద్రుడు, సవతులు, సింహము–గజము, వేటకాడు, లేళ్ళు, శ్రోత్రియుడు–దురాచారుడు, కాకులు–గుడ్లగూబలు, మూర్ఖులు–విద్వాంసులు, పతివ్రతలు–కులటలు, సజ్జనులు–దుర్జనులు.' అని. వీరిలో నెవరికి గూడ ఎవరును ఏమియు బాధచేసినది లేదు. అయినను, పరస్పరము ప్రాణములు తీయుటకు గూడ ప్రయత్నించెదరు.

లఘు :—ఓయీ ! నీమాటసరికాదు. వినుము. కారణమును బట్టి మిత్రత్వము, శత్రుత్వము ఏర్పడుచుండును. కనుక బుద్ధిమంతులు మైత్రినే చేయవలెను కాని వైరము చేయకూడదు, కనుక నాతో నీవు మైత్రి చేయుము.

హిర :—ఓయీ ! నీతో నాకు మైత్రి పొసగదు. ఎందుకనగా, పూర్వమునుండి వైరమేర్పడిన వానితో మైత్రి కలుపుకొనుట మృత్యువును ఆహ్వానించుటయే యగును. నేను గుణవంతుడనుగదా ! నాకెవరును అపకారము చేయరు అని తలచగూడదు.

లఘు :—వాస్తవమేకాని, నేను నీకు మంచిమిత్రుడనుగా వచ్చినాను. నీకేలాటిభయము కల్పించనని శపథముచేసి చెప్పుచున్నాను.

హిర :—నీవుచేయు శపథములయందునాకు విశ్వాసములేదు,

లఘు :—ఓయీ ! అట్లైనచో నీవు బిలమునందు ఉండియే బయటనున్న నాతో ప్రతిదినము మాట్లాడుచుండుము

హిర :—అటులనే యగుగాక. కాని నీవు నా బిలములో కాలుగూడ ఉంచగూడదుసుమా !

లఘు :—మిత్రమా ! అలాగే కానిమ్ము.

అనాటినుండి హిరణ్యక లఘుపతనకులు మైత్రితో ఇష్టాగోష్ఠి సలుపుచు కాలము గడుపుచుండిరి. పరస్పరము ఆహారము గూడ ఇచ్చుకొనుచుండిరి. ఇట్లాయిరువురు పరస్పర విశ్వాసము కలవారైయుండగా నొకనాడు కాకి కన్నుల నీరు నింపుకొని హిరణ్యకునితో నిట్లనెను "మిత్రమా ! నాకీ ప్రదేశముపైన విరక్తికలిగినది. వేర్వేరుచోటికి పోయెదను".

హిర;—నీ విరక్తికి కారణమేమి ?

(తరువాత 55 వ పేజీలో)

# భాసుడు - కర్ణభారము

అయ్యగారి నరసింహమూర్తి

"భాసోహాసః కవికులగురుః కాళిదాసో విలాసః కేషాంనైషా భవతి కవితాకామినీ కౌతుకాయ" (భాసుడే హాసము కాళిదాసే విలాసము నయిన సంస్కృత కవితా విలాసిని యెవరికి సంతోషము గొలుపదూ) అని జయదేవుఁడు భాసకాళిదాసులను గూర్చి పలికినాఁడు. బాణుఁడు హర్షచరితలో "సూత్రధార కృతారంభైః నాటకైః బహుభూమికైః సపతాకైః యశోలేభేభాసో దేవకులైరివ భాసుని నాటక వైశిష్ట్యమును వర్ణించినాఁడు. ఇఁక రాజశేఖరుఁడు సూక్తిముక్తావళిలో భాసనాటక చక్రేపిఛేకైః క్షిప్తే పరీక్షితుః స్వప్నవాసవదత్తస్య దాహకోభూత్ నపావకః" అని భాసనాటకములలో మేటియైన వాసవదత్తమును గూర్చి వ్యంగ్యముగాఁ జమత్కరించినాడు. ఆలంకారికులనేకు లీతని నాటకమునుండి కొన్ని లక్షణములను దమ గ్రంథములందుదాహరించినారు. అంతేగాక

కవికులగురువుగాఁ బ్రసిద్ధి వడసిన కాళిదాసు కూడ భాసుని కొన్ని సందర్భములలో ననుకరించెననిన ఈతని ననుకరించెననిన ఈ కవి కల్పనాచాతుర్యము, సంభాషణానైపుణ్యము, రచనారీతులు_ఎట్టివై యుండునో మనమూహించుకొనవచ్చును.

భాసుడు రామాయణ మహాభారతములను సాంఘిక చరితముల నాధారముగాఁ గొని పదమూడు నాటకములను రచించినాఁడు, అందు మధ్యమ వ్యాయోగమము. పంచరాత్రము, దూత వాక్యము. దూత ఘటూత్కచము, కర్ణభారము, ఊరు భంగము అను నారు నాటకములు భారత కథకు సంబంధించినవి, వీనిలోఁ బంచ రాత్రము తక్క మిగిలినవి యేకాంకికలు, ఈ యేకాంకికలలోని సన్నివేశములు, కల్పనలు_కధాగతికి, రసపోషణకు ననువై యున్నవి,

భారతేతి వృత్తసంబంధమగు నేకాంకికలలో నొకటియగు 'కర్ణభారము'ను గూర్చి చర్చించుటయే ప్రస్తుత వ్యాసోద్దేశము, దశరూపకమున

ఉత్సృష్టికాఙ్కే ప్రఖ్యాతం వృత్తం బుద్ధ్యా ప్రపంచయేత్
రసస్తు కరుణః స్థాయీనేతారః ప్రాకృతానరాః
బాణ వత్సంధి వృత్త్యంగైర్యుక్తః స్త్రీపరిదేవాతైః

వాచా యుద్ధం విధాతవ్యం తథాజయ పరాజయే"

చెప్పఁబడిన లక్షణము ననుసరించి కర్ణభారము నుత్సృష్టి కాఙ్కమనఁదగి యుండును,

కథ ప్రఖ్యాతమగు భారతేతిహాసమునుండి గ్రహింపఁబడినది, కల్పనలు, కధాగతికి రసపోషణమునకుఁ బర్యాప్తములై యున్నవి, కరుణరసమాది నుండి యంతము వరకునంతర్వాహినిగాఁ బ్రవహించుచున్నది, ఇందింద్రుఁడును బ్రాహ్మణరూపమున వచ్చినాడు కనుక దేవతాసంబంధమగు వృత్తమిందు లేదు. నాయకుఁడు కర్ణుడు, స్త్రీ పాత్రలుగాని వారి రోదనలుగాని యిందు లేవు, ముఖ, నిర్వహణ సంధులు మాత్రమే గలవు. వాగ్యుద్ధము మాత్రమే యిందుఁగలదు,

'కర్ణభారము' భారతమున కర్ణపర్వమునకు సంబంధించినది, కర్ణుని జీవితములోని కరుణఘట్టము నాధారముగా భాసుడు అస్పల్పాద్భుత ప్రతిభతో నీ నాటకమును రచించినాడు, ఇందలి నాయకుడు కర్ణుఁడు, ఇతఁడు సహృదయుడు, శూరుడు, దానవీరుడు, శరీరమనిత్యమనియు కీర్తిశాశ్వతమనియు, మానవునిగా, బుట్టిన ప్రతివ్యక్తి సత్కార్యముల నాచరించి యశస్సు నార్జింపవలెనని, కేవలవాగ్రూపమునగాక క్రియాత్మకముగాఁ జేసి చూపిన ఆదర్శమూర్తి.

శీర్షిక:_ శీర్షిక వ్యుత్పత్తిని గూర్చి పలువురు పలువిధములుగ నర్థముచెప్పిరి కర్ణమున కౌరవ సేనాపతి, కర్ణేంద్రియమని, ద్వంద్వార్థములు, కర్ణుని మానసిక చింతయే భారమనుట. భార శబ్దమునకు 'బరువ'ని సామాన్యార్థము. ఇటు కౌరవపతిని గెలిపించుటయనెడి భాగము ఆ భారముచేఁ గర్ణుని మనమునఁ బుట్టిన హృదయావేదనను వ్యక్తీకరించు నేకాంకికయని డాక్టర్ జి. కె. భట్‌గారి యభిప్రాయము.

వాచికదానము_వాస్తవదానము, అని దానములు రెండు విధములు. కర్ణుని దానశూరమును బ్రకటించుటయను విషయము నాధారముగాఁ గొని నడిపింపఁబడిన యేకాంకిక. శ్రవణములకు సహజముగానున్న కుండలములు వాచిక వాస్తవదానములకుఁగల మధ్యకాలములో నాతనికి భారమనిపించెనని 'పుశల్కర్' గారు నుడివిరి. కర్ణయోః భారభూతాని కుండలానిదత్త్వా కర్ణేనాపూర్వా దానశూరతా ప్రకటీకృతా తామధికృత్యకృతం నాటకం_ (పుశల్కర్-భాస-A Stuby page 188). వీరు కవచ విషయమును సమర్థింపకుండుటచే వీరి యర్థము యుక్తి యుక్తము గాలేదని 'దేవధర్'గారు పలికిరి.

ప్రయాసచేఁ బ్రయత్నమొనరించి ప్రయోగ సమయమునకు ఫలితము వీయని 'విద్యాభారము' కలవాడనుటను సూచించు నుద్దేశముతో భాసుడీ యేకాంకికకు 'కర్ణభారమ'ని పేరిడి యుండును,

ఏలయన కర్ణుఁడు శల్యునితో___

"మాతావన్మమ శరమార్గలక్ష భూతాః సంప్రాప్తాః క్షితిపతయః సజీవశేషాః కర్తవ్యం రణశిరసి ప్రియంకురూణాం ద్రష్టవ్యోయది సభవేద్ధనంజయోమే" (1-6)

" పుడమి నశేష జీవులగు భూపతులందఱు నాకరాళికిన్ పడిగురియౌదురాయనెడి పల్కులతోఁ బనిలేదు నాకు నిక్కడగల కృత్యమొకండెయే కౌరవకోటికి మేలుసేత రవ్వడి యెదురైన పక్షమున వాంఛితమిప్పుడె సిద్ధిపొందెడిన్ " అని యర్జునుఁడున్న తావునకు రథము నడుపుమనినాడు. అంతట మరల కర్ణుడు

అయం సకాలః క్రమలబ్ధశోభనే
గుణప్రకర్షోదివస్యోయమాగతః
నిరర్థమస్త్రంచమయాహిశిక్షితం
పునశ్చమాతుర్వచనేనవారితః '' (1-8)

ఇదియే మన్నల సాధనంబునకు నెంతేయు త్తమౌ కాలమీ అపే నా జీవితమందు నుత్తమ దినంబైనన్ ఫలంబేమినే మొదటన్ నేర్చిన శస్త్ర విద్య యఖిలంబున్ వ్యర్థమయ్యెంగదా. పిదపన్ వారితమయ్యె మాతృవచన ప్రీతిన్ రణోత్సాహమున్.

ఈ యేకాంకికయందు కర్ణుడు విద్యనుగూర్చి మాతకిచ్చిన వాగ్దానమునుగూర్చి చింతపడినాడు గాని ఇక వేనినిగూర్చిగాడు. గనుక వ్యర్థమైన విద్యాభారముగలవాడని సూచించుటకే భాసుడీ నాటకమునకు కర్ణభారము'వి పేరిడినాడు.

యఁస్వాదనుచితం వస్తుః నాటకస్వరసస్యవా అవశ్యం తత్పరిత్యాజ్యం అన్యదావా ప్రకల్పయేత్ ' అని ఆలంకారికుల మతము.

ప్రఖ్యాతమగు భారతమునుండి కథనుగైకొని కథాగతికి. రసపోషణకు ననువగు రీతిని భాసుడు కొన్ని కల్పనలు గావించి అల్పమైన యీ యేకాంకిలో వీరహాస్య కరుణరసములతో బాటు, భారతీయుల త్యాగబుద్ధి స్నేహధర్మము కర్తవ్యపాలనము, దానశీలము మానవస్వభావమైన దయాగుణము, స్వార్థచింతనతో మొదట వంచనచేసి పిదప పశ్చాత్తాపము చెందుట ఇత్యాదియల్పములగు విషయములనెన్నిఁటినో లోకమునకుఁ దెల్పినాడు. ఆదర్శపురుషుల శీలముల నలవఱచుకొనిన మానవులు కర్ణునివలె నాచంద్రతారార్కమగు యశస్సునార్జించి వెలుగొందఁగలరని యీ యేకాంకిక మూలమున వ్యక్తము చేసినాడు.

కర్ణభారము నీకర్ణుని దాన వీరమును బరాకాష్ఠనందించుట కింకొక చక్కని కల్పన చేయఁబడదని కర్ణుడు చేసినదానములలో కవచకుండల ప్రదానము ప్రధానమైనది. అదియును బ్రాహ్మణ రూపమున వచ్చిన యింద్రునకు. భారతమున నీదానము పాండవులు వనవాసము చేసిన దినములలోఁ జేసినట్లుండ ఈయేకాంకిలో శల్యసారథ్యముతో కర్ణుడర్జునుని మార్కొనబోవునపుడు బ్రాహ్మణ వేషములో నింద్రుడువచ్చి గ్రహించినట్లు భాసుడు మార్పుచేసినాడు. ఈ దానమేనాడు చేసినను కర్ణుని కీర్తికి భంగమురాదుగాని యుద్ధభూమిలోఁ గర్ణుడు తన పరాజయము, ఆత్మనాశము నెఱిఁగియెఱింగి యెంతమాత్రము జంకు గొంకులేక కవచకుండలములను (భూ) సురశ్రేష్ఠున కర్పించుట కర్ణుని దాన వీరమునకు, ధీరతకు, త్యాగ శీలమునకు చరమ స్థానము. ఈ వాడగుణమును బ్రదర్శించుట కింత కంటె మించిన తావు వేరొకచోట లేదు కనుక భాసుని యీ మార్పు అనల్పము, అన్వర్థమునై యున్నది.

శల్యుడు కవచకుండలముల నీయవలదని కర్ణుని వారింపఁగాఁ గర్ణుడు.

శిక్షాక్షయం గచ్ఛతి కాలపర్యయాత్
సుబద్ధమూలానిపతన్తి పాదపాః
జలంజల స్థానగతంచశుష్యతి
హుతంచ దత్తంచ తథైవతిష్ఠతి

కాలవిపర్యయంబు ననుగాంచుభయంబును శిక్షలెల్ల సన్మూలములైన వృక్షములు భూతలమందున గూలిపోయెడిన్ గాలవశంబునన్ జలధిగర్భ జలంబును నెండిపోవునే వేళనశింపకుండెడును వేల్చిన హోమము పాత్రదానమున్. అని ఇంద్రునకు కవచ కుండలములనిచ్చివేయును అనంతరము శల్యుఁడు నీవు వంచింపఁబడితివి కర్ణా ! యని చెప్పగా నింద్రుఁడే నాచేత వంచితుఁడయ్యెనని గంభీరముగా నిట్లుపలికినాఁడు.

అనేక యజ్ఞాహుతి తర్పితోద్విజై
కిరీటవాన్ దానవ సంఘ మర్దనః
సురద్విపాస్ఫాలన కర్కశాంగు లిర్మయా
కృతార్థః ఖలుపాక శాసనః (1-23)

[వసుధామరులచేత బహుమఖాహుతులచే
ననయంబు తర్పితుఁడైనవాడు

దానవ సంఘమర్దనుఁడు కిరీటిమం
తుడునెల్ల వేల్పులదొర ఘనుండు

బరావతాస్ఫాలనాభ్యాసముననుగ
ర్కశముతా యంగుళుల్ గలుగునతడు

నగు పాక శాసనుండర్థియై వచ్చినా
చేతనే నేడు వంచింపఁబడియె]

అని తాను పాత్రునకే దానమిచ్చితిని ఇంద్రునంతటి వాడొక సామాన్య మానవుని యాచించుట యసామాన్యమని కర్ణుఁడు తన దానగుణ శ్రేష్ఠతను నిరూపించుకొనినాడు.

అటు పిమ్మట ఇంద్రుఁడు తాఁజేసిన కార్యమునకుఁ బశ్చాత్తాపమునొంది దేవదూత 'విమల'యను శక్తిని కర్ణునకుఁ బంపగా దానిని కర్ణుఁడు నిరాకరించును. దానమునిచ్చి ప్రతిదానము స్వీకరించుట తగని కార్యము. దీనిమూలమున భారతీయుల త్యాగశీలమెట్టిదియో తెలియుచున్నది.

అనంతరము దేవదూత కర్ణునితో నేను బ్రాహ్మణుఁడను నేచెప్పుచున్నాను గావున గ్రహింపుము అని యనినంతనే కర్ణుఁడు- బ్రాహ్మణవచనమా: దానిని పూర్వమెన్నఁడును నేనతిక్రమింపలేదు. ఎపుడు నా కిది సిద్ధించునని గ్రహించుటకు సంసిద్ధుఁడయ్యెను. కర్ణుడు బ్రాహ్మణులను తృప్తిపరుపవలెననెడి యుద్దేశ్యముతో ఆ 'శక్తిని' బ్రాహ్మణాశీర్వాదముగాఁ దలఁచి గ్రహించినాడు. దీనివలనఁ గర్ణునకు బ్రాహ్మణవాక్కుపైఁ గల ఆస్థ (శ్రద్ధ) దృఢవిశ్వాసము, వెల్లడియగుచున్నది.

రాధేయుఁడు రథము నధిరోహించుటకు వచ్చుచు మాతా వన్మమ శరీరమార్గ లక్షభూతాః సంప్రాప్తాః క్షితిపతయః సజీవ శేషాః కర్తవ్యం రణశిరసి ప్రియం కురుణాం ద్రష్టవ్యోయది సభవేద్ధనంజ యోమే (1–6)

పుడమిపై శేషించిన భూపతులు నామార్గణములకు గురియగుదురా లేదా యను దానితోఁ బనిలేదు కౌరవకోటికి మేలు సేయుటయే ప్రస్తుతము చేయఁదగినపని. అర్జునుఁడెదురైనచో మద భీప్సిత మీడేరును ఈ పలుకుల మూలమున కర్తవ్యపాలనము, స్నేహధర్మము లేరీతిగా నుండవలేనో తెలియుచున్నది.

కర్ణుఁడు గురువు తనకొసంగిన శాపమును గూర్చి శల్యునకు చెప్పగా నాతఁడు విషాదము నొందఁ వానికిఁ గర్ణుఁడిట్లనినాడు.

"హతోఽపి లభతేస్వర్గం, జిత్వాతులభతే యశః
ఉభేమతే లోకేనాస్తి నిష్ఫలతారణే" (1–12)
(రణమునంగూలు నెడల స్వర్గంబు దొరకు
గెలిచితినయేని శాశ్వతకీర్తి గలుగు
జగతి నీరెండు గౌరవాస్పదములు సుమి
సంగరంబుల యందు నిష్ఫలతలేదు")

ఐహికాముష్మిక భోగములు రణమువలననే కలుగు ననియు, నవియే గౌరవప్రదములు, శాశ్వతములు ననియు నత్తరి దిందు పడుట తగని పనియని కాయమశాశ్వతము గనుక నిత్యమైన కీర్తి కొరకు పాటుపడుటయే మానవునిగాఁ బుట్టిన ప్రతిజీవి కుండవలసిన ధర్మమని లోకమునకుఁ జాటినాఁడు ఇందు కర్ణుని రణోత్సాహము తెలియుచున్నది. మానవ స్వభావమగు దయాగుణము కూడ నిందుఁగలదు.

"పూర్వం కుంత్యామ్ సముత్పన్నో
రాధేయఇతి విశ్రుతః
యుధిష్ఠిరాద యస్తేమే
యవీయాం సస్తుపాండవాః" (1–7)
మాతుర్వచనేన వారితః" (1–8)
మొదటి కుంతిమహాదేవి పుత్రుఁడైతి
పిదప రాధేయుఁడని నాకుఁ బేరుఁగలిగె
నందువలన యుధిష్ఠిరుఁడాదియైన
పాండు పుత్రులు నాకు భ్రాతలైరి."

"పిదపన్ వారితమయ్యె మాతృవచన ప్రీతిన్ రణోత్సాహున్ అని కర్ణుడు డిందు పడుటలో మానవుని దయాగుణము కూడ వెల్లడియగు చున్నది.

కర్ణుడస్త్రవిద్యా వృత్తాంతమును వినిపించిన పిదప శల్యునితో గూడి రథారోహణము సేయుచుండ "భోకర్ణ! మహత్తరం భిక్షంయాచేమి" (ఓ కర్ణా! మహత్తరమగుభిక్షను యాచించుచున్నాము.) అను బ్రాహ్మణ వాక్యము వినఁబడును. దీనిమూలమున భాసుడు కర్ణునకు రాఁబోవుఫలితమును సూచనచేసినాఁడు ఒంటి బ్రాహ్మణ శకునము దుష్ఫలితమునిచ్చును.

కర్ణుఁడును బ్రాహ్మణాకృతిలోనున్న ఇంద్రుఁవింగని సంతసంబడి యాతని రాకకుం గృతార్థతమజెందిన వానివలె ప్రీతుండై నమస్కారము చేయును. అక్కడ వారిరువురకును జరిగిన సంభాషణమూలమున భాసుఁడు లలితమగు హాస్యమును బోషించినాడు. భూసురరూపమున వచ్చిన ఇంద్రుఁడు ప్రాకృతమున మాట్లాడుట హాస్యజనకమే.

ఇంద్రు :– (ఆత్మగతమ్) కింనుఖలు మయాకర్తవ్యం యది దీర్ఘాయుర్భవేతి వక్ష్యే దీర్ఘాయుర్భవిష్యతి యది నవక్ష్యే మూఢఇతిమాం పరిభవతి తస్మాదుభయం పరిహృత్యకిం నఖలువక్ష్యామి భవతుదృష్టమ్ (ప్రకాశమ్) "భోకర్ణ! సుయ్యేవిఅ, చందేవిఅ, హిమవన్తేవిఅ, సాగరేవిఅ చిట్ఠదు దేజసో అని బ్రాహ్మణుడయ్యు ప్రాకృతమున దీవించును.

[(తనలో) నేవిషదేమనిపల్కుదును. దీర్ఘాయుష్మంతుఁడవుగమ్మనియంటినా! దీర్ఘాయుష్మంతుడే యగును. అనకపోతినా కుటిలస్వభావముగా భావించి పరిభవించును. కావున నీరెంటికి తప్పుకొనుటకే మందునుకాని దారి కనఁబడినది. ప్రకాశముగా ఓ కర్ణుడా! నీకీర్తి సూర్యునివలెను, చంద్రునివలెను, హిమవంతునివలె సముద్రునివలె నుండుగాక ]

కర్ణుడు :– భగవన్! కింనవక్తవ్యం దీర్ఘాయుర్భవేతి! అథవాపత దేవశోభనమ్ (దేవ దీర్ఘాయుష్మంతుఁడవుగమ్మని దీవింపఁగూడదా! పోనిండు ఇదేశుభము)—మీకు వేయి గోవులనిచ్చెదనన బ్రాహ్మణుడు "గోసహస్రమితి! ముహూర్తకంక్షీరంపిబామి! నేచ్ఛామికర్ణ! నేచ్ఛామి! (వేయిగోవులా! ఒక ముహూర్తము పాలుత్రావెదను కర్ణా! వద్దు వద్దు)

కర్ణుడు తురంగములు! మాతంగములు, మహారజతులు తాజయించిన పృథ్వి, అగ్నిష్టోమఫలము; చివరకు శిరస్సునిత్తుననినను ఇంద్రుడు వలదనును. అపుడు కర్ణుడు

॥అంగైః సహైవ జనితం మమదేహరక్షా
దేవాసురైరపి నభేద్యమిదంసహాస్త్రైః
దేయంతథాపి కవచంసహకుండలాభ్యాం
ప్రీత్యామయా భగవతే రుచితమ్ యదిస్యాత్

(1–21) అని పలుకఁగనే యతిశయానందముతో-దానివి గ్రహించుట కొప్పుకొనును. అపుడు రాధేయుఁడాత్మగతమున ఏష ఎవాస్యకామః కిం ను ఖల్వనేక కపట బుద్ధేః కృష్ణస్యోపాయః। సోఽపిభవతు। దికయుక్తమను శోచితుమ్। నాస్తి సంశయః అనికపటము నెఱింగియు కర్తవ్యపాలనమే దృష్టియందిడుకొని ధృఢనిశ్చయుడైనాఁడు

ఆత్మనాశమును గుర్తెరింగియు భీరునివలె వెనుకంజవేయక ధీరతతో పీపై చివరి వరకు నడిచినట్లు నాటకమున నిరూపింపబడినది. కర్ణుని త్యాగబుద్ధియు చరమస్థానము నందుకొన్నది.

ఇంద్రుని పాత్రమూలమున స్వార్థపరాయణత్వముతో నొరులను మోసగించియు తరువాత పశ్చాత్తాపమునెందుట మానవ దయాస్వభావమని భాసుడు వ్యక్తముచేసినాడు. ఇంద్రుని వంటి మానవులను మనకు సమాజములో తారసపడుదురు.

కర్ణుని కవచకుండలములనుగ్రహించిన పిమ్మట ఇంద్రుడు పశ్చాత్తాపముతో నొకదేవదూతచే 'విమల' యను నొక యమోఘమైనశక్తిని పాండవులలో నొకనిని వధించుటకొఱకని కర్ణున కంపినాడు. ఇటు పాండవ శబ్దముచే లోకముగాని కర్ణుడుగాని తలంచినట్లుగాక భీమునకు హిడింబియందుదృవించిన ఘటోత్కచునిసంహారమునకై యుపయోగపడెను. పాండవశబ్దము పంచ పాండవులలో నొకడుగాక పాండవ వంశములో నొకడని కడకు తేలినది. పాండవశబ్దము నుపయోగించి హాస్యమునందించినాడు భాసుడు.

ఈ యేకాంకికయందు కరుణరసమును వ్యక్తీకరించుటకు చేసినప్రయత్నమేమియులేకున్నను నియ్యది యంతర్వాహినిగా నాటకము మొదటినుండి తుదివరకు ప్రవహించినది. ఉదాత్తమైన కర్ణుని చరితమునాతడు మాటిమాటికి మోసగింపబడుటను జూచినవారందఱు కంటతడి పెట్టుదురు. అయం సకాలఃక్రమలబ్ధశోభనే............" ఇత్యాది శ్లోకముల మూలమున అతని దైన్యము; దుఃఖముతోడి స్పష్టమగుచున్నది.

'ఏకోరసఃకరుణఏవ' అని చెప్పుటకు భవభూతి ఉత్తర రామ చరితతోబాటు భాసుని కర్ణభారమును గూడ నుదాహరణముగా నెన్నవచ్చును.

ఈ యేకాంకిక కథావిషయమున పాత్రల విషయమున చాల పరిమితమైనది. ఇందలి ప్రతిపాత్ర సామాజికుని ఆకర్షించి ఆకట్టుకొనునదిగా నున్నది. కర్ణుని ప్రత్యేకాను భూతివలన ప్రభావితుడై అతనిపై సానుభూతిని కనబఱచినవాడు. భాసుని శల్యుడు కాగా భారతశల్యుడు క్రూరుడు, నిర్దయుడు, విశ్వాస ఘాతకుడు. భాసుని శల్యుడు మానవతావాది. శల్యుడు "నీవు పూర్తిగా వంచనచేయబడితివి కర్ణా!" అనువాక్యమున శల్యుని మానసికవ్యథ, నిర్మల హృదయున కపారమైన సానుభూతి వ్యక్తము చేయుచున్నది.

అర్జునుడున్న ప్రదేశమునకు రథము తోలుకొనిపొమ్మని శల్యునకాదేశించుటతో నీనాటకము పరిసమాప్తమగుచున్నది.

త్యాగపూర్ణ దివ్యచరితముగల మహారథి కర్ణ జీవితమును కవులనేకులు గానముచేసి తమవాక్కును సఫలము చేసికొనిరి. రూపక చక్రవర్తియగు భాసుడును దనయనల్పకల్పనా ప్రతిభతో కర్ణుని జీవితఘట్టమును గైకొని యందు భారతీయ గౌరవము, త్యాగశీలము, స్నేహధర్మము, కర్తవ్యపాలనమును లోకమున కెరింగించి భారతీయ చరితలో కర్ణునిఖ్యాతి సాహితీ చరితలో భాసుడును నొకదివ్యమూర్తిగా వెలుగొందుచున్నాడు. 

(51 వ పేజీ తరువాయి)

లఘు:—వినుము. ఈ దేశములో గొప్ప అనావృష్టిచేత కరవు సంప్రాప్తమైనది. అందుచేత ప్రజలు మాకు బలికూడ ఇచ్చుట లేదు. ఇదిగాక ఆకలిగొన్న ప్రజలు పక్షులను పట్టుకొని పోయి తినుటకు వలలు పన్నుచున్నారు. నేను ఆవలలో పట్టుపడి కూడ దైవశాత్తు తప్పించుకున్నాను. ఇది నావిరక్తికి కారణము. కనుక నేను విదేశము వెళ్ళుటకు నిశ్చయించినాను.

హిర:—ఇప్పుడు నీవెక్కడికి పోవుచున్నావు?

లఘు:—దక్షిణదేశములో ఒక వనములో నొకసరస్సుకలదు. అక్కడ నీవలెనే నాకొక ప్రాణమిత్రుడైన తాబేలురాజు ఉన్నాడు ఆతని పేరు మంథరకుడు. అతడు నాకు మత్స్యఖండాదులను ఆహారముగా నిచ్చి నన్ను పోషించగలడు కనుక అక్కడికి పోయెదను.

హిర:—అట్లైనచో నేనుగూడ నీతో అక్కడికి వచ్చెదను. నాకును ఇక్కడ ఉండుట దుఃఖకరమై యున్నది.

లఘు:—ఓయీ! ఇక్కడ నీకేమి దుఃఖము కలిగినది. చెప్పుము.

హిర:—మిత్రమా! ఈ విషయములో చాల చెప్పవలసియున్నది. కనుక అక్కడికి పోయిన తరువాతనే చెప్పెదను.

లఘు:—నేను ఆకాశమునందు ఎగిరిపోవువాడను గదా! కనుక నాతో వచ్చుట నీకెట్లు సంభవమగును?

హిర:—నాప్రాణములు రక్షింపదలచితివేని నన్ను నీవీపుపైన ఎక్కించుకొని అక్కడికి తీసుకొని పొమ్ము. నాకు అన్యథా గతిలేదు

లఘు:—(అదివిని సంతోషముతో) అట్లైనచో నేను ధన్యుడను ఎందుకనగా అక్కడ నీవుగూడ ఉన్నచో మనము సుఖముగా కాలము గడపవచ్చును. నేను 'సంపాతము' మొదలగు ననేక గమనములతో ఆకాశమునందు ఎగిరిపోగలను. నావీపుపైన ఎక్కుము. సుఖముగా నిన్ను ఆసరస్సు చేర్చెదను.

(సశేషం)

# హర్షవల్లి సూర్యదేవాలయం

శ్రీ వేమకోటి సీతారామశాస్త్రి

శ్రీకాకుళం జిల్లాలో, శ్రీకాకుళపట్టణానికి వొకమైలు దూరమున విలసిల్లుతున్న పుణ్యక్షేత్రం సూర్యక్షేత్రం హర్షవల్లి. హిందూదేశంలో సూర్య దేవాలయాలు అరుదు. కారణం సూర్య భగవానుడు ప్రత్యక్షదైవము కావటంవల్లనే.

ఓం॥ హర్షవల్లి పురీవాసం। ఛాయోషాపద్మినీ యుతం।
సర్వదేవనుతం నౌమి। భాస్కరం మంగళాకరం।

అని వేలాది యాత్రికులు యిచటి సూర్యమూర్తిని, సందర్శించి, భక్తిశ్రద్ధలతో, సేవిస్తూవుంటారు.

## స్థలపురాణం.

మహాభారత యుద్ధంలో, కౌరవ పాండవులలో యెవ్వరికీ, సహాయంచేయటం, యిష్టంలేని బలరాముడు తీర్థ యాత్రలకు బయలుదేరి, లంబనాసురిని గాగల రాక్షసులను సంహరించి, ధర్మ ప్రతిష్టచేశాడు. నాగావళీనది ఒడ్డున రుద్రకోటీశ్వరుని ప్రతిష్టించి, తూర్పుదిక్కుకు తరలిపోయాడు.

దేవేంద్రుడు, ఒకనాడు రుద్రకోటీశ్వరుని సందర్శించాలన్న కోరికతో కోటీశ్వర దేవాలయానికి వచ్చాడు. ఆ సమయం అర్ధ రాత్రి. ద్వారపాలకుడైన నంది, దేవేంద్రుని కొంతసేపు ఆగమని తను పోయి శివుని ఆజ్ఞను తీసుకు వస్తానని సవినయంగా విన్నవించాడు. కానీ అహంకారపూరితుడైన దేవేంద్రుడు అంగీకరించలేదు. వారిద్దరి మధ్య జరిగిన సంఘర్షణలో, దేవేంద్రుని హృదయంమీద నందీశ్వరుడు తన్నగా దేవేంద్రుడు తూర్పుదిక్కుగా, మైదానంలో, శక్తివిహీనుడై మూర్ఛపోయి, క్షణకాలం తరువాత, తేరుకుని, తన నిజస్థితిని గూర్చిచింతించి రుద్రకోటీశ్వరుని ధ్యానించాడు. నందిని క్షమాపణ కోరుకొమ్మని సూర్యుని అశరీరవాణి, దేవేంద్రునికి కలలో హెచ్చరించింది. దేవేంద్రుడు అలాగే నందీశ్వరుని ప్రార్థించగా, అతనికి పూర్వ తేజస్సు శక్తీ వచ్చాయి.

పిమ్మట దేవేంద్రుడు, సూర్యదేవుని కరుణకు ఒక్కాలి కృతజ్ఞుడై, అదే స్థలంలో వొక పుష్కరిణి త్రవ్వగా, అందులో సూర్యదేవుని విగ్రహం లభ్యమైనది. దేవేంద్రుడు, మయుని రప్పించి అచ్చట సూర్య దేవాలయం నిర్మించి భక్తి శ్రద్ధలతో సేవించి, ఐరావతంతో అమరావతికి తరలిపోయాడు.

## చారిత్రాత్మక ప్రాధాన్యత

చారిత్రాత్మకంగా, యీ హర్షవల్లికి యెంతో ప్రాముఖ్యత వుంది. క్రీ॥ శ॥ 396 నుండి కళింగ రాజ్యం గోదావరీ మహానదుల మధ్యనే విస్తరింపబడి, గంగాన్వయులైన క్షత్రియులచే పరిపాలింపబడినది. ఏడవశతాబ్దపు రెండవ భాగంలో గుణార్ణవన్ కొడుకైన దేవేంద్రవర్మ, యీ ప్రాంతాన్ని పాలించేవాడు. ఆ దేవేంద్రవర్మ, యీ సూర్యదేవాలయాన్ని స్థాపించినట్లు తామ్ర శిలాశాసనాలు, అప్పటికాలంలో, హర్షవల్లి వేదపాఠశాలకు, విద్యార్థులకు సత్రపు నిర్వహణకై, చెరువును త్రవ్వించుటకై, దేవాలయంలో శాశ్వత ధూపదీప నైవేద్యములు జరిపించుటకు భూములను దానము చేయబడినట్లుగా తెలియజేస్తున్నవి పై ఆధారములను బట్టి, పదమూడు శతాబ్దములనుండి యీ దేవాలయం దివ్యమయిన మహిమతో విలసిల్లుతున్నది

అప్పటి కాలంలో దేవాలయంలో వుండే శిల్ప సంపద, మతావేశపరులైన మహమ్మదీయులు పదహారవ శతాబ్దంలో ధ్వంసంచేశారు. అయితే యే కారణం వలననో వారు మూల విరాట్టును మాత్రం తాకలేకపోయినారు. తరువాత యీ దేవాలయం 1778 శ్రీ యలమంచిలి పుల్లాజీ అనే భక్తుడు పునరుద్ధరించాడు.

## విగ్రహ స్వరూపం

శ్రీసూర్యదేవుని విగ్రహం, నల్లరాతితో మలచబడి, సుమారు ఆరడుగుల పొడవు, మూడడుగుల వెడల్పు, వొకటిన్నర అడుగులు మందము గల నల్లరాతిలో మలచబడివుంది. సూర్య భగవానుడు, పద్మహస్తుడై నిలబడి అభయ హస్తమిస్తున్నట్లుగా శిల్పించబడివుంది. తేజోమయుడైన ఆ దివ్యమూర్తి, ఆదిత్యమూర్తి రథానికి మీదుగా రాజలాంఛనంగా వుండే సింహలలాటంవుంది. కుడిచేతి ప్రక్కముందు భాగంలో పద్మినీ, మధ్య ఉషః చివరన ఛాయాదేవి వున్నారు సనకసనందనాదులు ఛత్రం చామరం వీస్తున్నారు. పింగళుడు, మాఠరుడు, అనే ద్వారపాలకులు వున్నారు యివన్నీ సప్తాశ్వములు గల రథముతో అనూరుడు రథసారధిగా వున్నట్లు, శిల్పం మలచ బడివుంది.

## క్షేత్రప్రాధాన్యత

హర్ష అంటే ఆనందమిచ్చేది. ''హర్షవల్లి'' 'అరసవెల్లి' అనే గ్రామ్య పదంగామారింది. సంస్కృతంలో 'అర్ష'' అంటే మూలవ్యాధి అని అర్థం. ఆదిత్యుని సేవించిన వారికి మూలవ్యాధి నయమవుతుంది కావున 'అర్షోహరి' అని అంటారు.

ప్రతి సంవత్సరం, మాఘాది పంచమాసాలలోను, ప్రతి ఆదివారం, యీక్షేత్రంలో గొప్పయాత్ర జరుగుతుంది. యాత్రికులకు దేవస్థానము వారు తగిన సదుపాయములు కలిగించారు.

అరుణోదయ సమయంలో, సూర్యకిరణాలు కొన్ని నిర్దిష్టమైన దినములలో, సూర్యభగవానుని పాద పద్మాలను, కొన్ని క్షణాల మాత్రం స్పృశిస్తాయి. యిన్ని ప్రాకారాలను దాటుకుని, సూర్య కిరణాలు దేవుని పాదాల వద్దకు చేరటం, చాలా ఆశ్చర్యకరం అద్భుతమైన విషయం. హర్షవల్లి దివ్యక్షేత్రమై విలసిల్లుటకు యిది నిదర్శనం.

మంగళం సూర్యదేవాయ। మంగళం పద్మబాంధవే।

